# శ్రీరామవిజయము.

## కల్యాణకాండము.

ఇది

కాకినాడ వాస్తవ్యులు:

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారిచే

విరచింపఁబడి, ప్రచురింపఁబడినది.

ప్రథమముద్రణము 1200 ప్రతులు.

కాకినాడ:—పట్టమట్ట శేషగిరిరావుగారి జార్జిప్రెస్సుయందు

ముద్రింపఁబడియె.

1935.



[ వెల 1–0–0.

# పీఠిక.

—:o:—

నేను బ్రహ్మశ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారిచే విరచింపఁ బడుచున్న 'శ్రీరామవిజయము' యొక్క, పూర్వకల్యాణకాండములఁ బఠించియుంటిని. వీనియందు అమూల్యములగు నపూర్వవిషయములెన్నియో హృదయరంజకముగా వర్ణింపఁబడియున్నవి. శ్రీశాస్త్రిగారిరచనాశైలి మృదుమధురమై, శుభభావవిలసితమై, నీతిబోధకమై, ఆంధ్రసోదరీసోదరులెల్లరు ననాయాసముగా గ్రహింపఁదగిన కథాసంవిధానములతోఁగూడి, యలరారుచున్నయది.

శ్రీశాస్త్రిగారి విజ్ఞానసంపదనుగూర్చి పూర్వకాండకృతి పరిశోధనలో బ్రహ్మశ్రీ బులుసు సుబ్బారావుగారు వ్రాసిన వాక్యములు యథార్థములు.

ప్రస్తుతము తెలుగునఁ బ్రకటింపఁబడుచున్న గ్రంథములు కొన్ని మనయార్య మర్యాదలకు వన్నెతేలేకుండుటయే కాక, అవమానమును గూడఁ గొనివచ్చుచున్నయవి. కావ్యపాఠమువలనఁ జనులకు విజ్ఞానవికాసముదయింపవలయునుగాని, నీరసభావములుద్భవింపరాదు.

శ్రీశాస్త్రిగారిచే విరచింపఁబడుచున్న యీ 'శ్రీరామవిజయము' సనాతనార్యమర్యాదలఁ జక్కఁగాఁ దెలియఁజేయుచు, మనోహరములగు నుపాఖ్యానములచేఁ జన పులకింపఁగొలుపుచున్నయది. ఇట్టి యున్నతభావవిరాజితములగు కావ్యములు మనయాంధ్రసారస్వతమున బయలు వెడలుట సంతసావహము. శాస్త్రిగారు మిగతకాండములఁగూడఁ బ్రకటించి, యాంధ్రసోదరులకానందమును సమకూర్తురు గావుత. కథానాయకుఁడగు శ్రీరామచంద్రుఁడు వీరికిఁదగు నుత్సాహశక్తి నొసంగు గావుత.

కాకినాడ,
8—5—35.

ఉప్పులూరి భీమశంకరశాస్త్రి,
బి. యే., బి. ఎల్.

శ్రీరస్తు

# కృతిసమర్పణము



సుగుణభూషితులును, ఉదారస్వభావులును, నాకాప్తమిత్రులును, మండలప్రధానవైద్యాధికారమునుండి విశ్రాంతినిగైకొనియున్న శ్రీలక్ష్మీకాంతాసమేతులగు మహారాజశ్రీ ఉంగరాల సీతారామస్వామినాయుడు L. M. & S. గారికి, వారికుమారుఁడు చి॥ హనుమంతరావునకును, చి॥ సౌ॥ లక్ష్మీనరసమాంబకును, శ్రీయువసం॥ వైశాఖశుగం సోమవాసరమున జరిగిన వివాహమహోత్సవసమయమున శ్రీరామవిజయముయొక్క ఈకళ్యాణకాండము కృతిగానొసగఁబడినది.



డాక్టరు ఉంగరాల సీతారామస్వామినాయుడుగారు, L. M. & S.

*Retired District Medical Officer.*

# విజ్ఞప్తి

—:o:—

ఘనాశయులారా! ఇంతకుముందు నాచేఁ బ్రకటింపఁబడిన 'శ్రీరామవిజయ' 'పూర్వకాండము' నందు "నాయూహ" అను శీర్షిక క్రిందవ్రాయఁబడిన దానిలోఁ గాండములఁ బేర్కొనుచు, పూర్వకాండమునకుఁ బిమ్మట బాలకాండమనియు, దానికిఁబిమ్మట అయోధ్యాకాండమనియుఁ దెలుపఁబడినది కాని యిపుడు బాలకాండమునకు కళ్యాణకాండమనియు అయోధ్యాకాండమునకు రాజ్యకాండమనియుఁ బేరుల మార్చితిని.

ఈకళ్యాణకాండమునుండి శ్రీమద్రామాయణమున వాల్మీకిముని పుంగవునిచే వర్ణింపఁబడిన ప్రధానేతివృత్తమును ఆధారముగాఁ దీసికొనియుండుటచే, అపూర్వరమ్య కావ్యనిర్మాతయగు ప్రాచేతసుని పూర్వాపరజన్మగాధలగూర్చి వ్రాయఁగుతూహలినై, యామునిసింహుని చరితములోని "కళ్యాణకాండము"ను ప్రారంభించితిని.

మఱియు, నీమునీంద్రుని జీవితము నీతిబోధకముగానుండుటచే దీనింజదివి సహృదయులానందింతురను నమ్మికచేఁ గొంచెము పెంచి వ్రాసితిని. దేవాలయమునకు ముందు ధ్వజస్తంభమువలె, రామాయణమునకు ముందు వాల్మీకిజీవితముండుట ధర్మమని నాతలంపు.

ఈకళ్యాణకాండమును ముద్రించుటకువలయు బాధ్యతనంతను వహించి, సర్వవిధముల నాకుఁబ్రోత్సాహమును గలిగించిన నామిత్రులగు మహారాజశ్రీ ఉంగరాల సీతారామస్వామినాయుడు L. M. & S, గారికిని, గౌరవాదరములతోనీకళ్యాణకాండమునకుఁ బీఠికనువ్రాసి తమకుఁగల సారస్వతాభిమానమును వెలిబుచ్చిన బ్రహ్మశ్రీ ఉప్పులూరి భీమశంకరశాస్త్రి బి. యే. బి యల్ గారికిని, నాకృతజ్ఞతావందనముల నందఁజేయుచున్నాఁడను.

ఇట్లు,

సుజనవిధేయుఁడు,

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి.



కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిగారు,

*Retired Sanskrit Pandit,*

P. R. College, Cocanada.

శుభమస్తు

# శ్రీ రామ విజయము

## కళ్యాణకాండము

——:0:——

శ్లో॥ సూర్యంవందే కృపాసింధుం దివ్యతేజోవిరాజితం
యద్వంశ్యాలోక కల్యాణం మన్యంతే జన్మనః ఫలం॥

ప్రథమాధ్యాయము

—: వాల్మీకి చరితము :—

శ్లో॥ కూజంతం రామరామేతి మధురం మధురాక్షరం।
ఆరుహ్యకవితాశాఖాం వందే వాల్మీకి కోకిలం॥

సిప్రానదీతీరమున నుజ్జయినీపట్టణమునకు అయిదుకోసముల దూరమున సాలయను ద్విజాగ్రహారమొండు కలదు. ఆయగ్రహారవీధులనేగునప్పుడు ఒకగృహమున వేదనాదమును, వేఱొకయుదవసితమున శాస్త్రచర్చయు, మఱియొకభవనమున వేదాంతవిచారమును, వేఱొండునిలయమున గానకళాభ్యాసమును, ఇకనొకమందిరమునం బురాణగోష్ఠియు, ఇట్టుల ప్రతిగృహమునను నేదియో విద్యావ్యాసంగము వినవచ్చుచుండును.

ఇట్లు భారతీవిహరణోద్యానవాటికయనదగు నాభూసురాగ్రహారమునకు స్వామియు, నిరతాన్నప్రదాతయు, దేవగురువిప్రాతిథి పూజాపరాయణుండును, విదితాఖిలనిగమ నిగమాంతసారభాసురుండును, శ్రీవత్సగోత్రరత్నాకర శీతకరుండును, నగు మాధవుండను, భూసురోత్తముండు సదాచారసంపన్నయు, వినిర్మలానురాగ కళావిలసితయు, నిరుపమానసుగుణభాసితయు, నగు కమలయను, భార్యతో సుఖముగా గాపురము చేయుచుండెను.

ఆద్విజదంపతులు శ్రీహరికథాసుధాస్వాదనతత్పరులై కాలమును పావనముగా గడుపుచుండిరి. కాని వారికి యుక్తకాలమునకు సంతతి సమకూరదాయెను. అందుచేనాదంపతులు కొంచెముఖిన్నులై సంతాన ప్రాప్తికై ప్రత్యేకముగా దైవతములనారాధింప మొదలిడిరి. ఇట్లుండ నొకనాడు స్తంభుడను మునీశ్వరుఁడు వారింటికి నతిథిగా వచ్చెను. అంతనావిప్రదంపతులు భక్తివినయములతో నావృద్ధతాపసునకు నర్ఘ్య పాద్యాదులొసంగి, పూజించి, షడ్రసాన్నములతో భోజనమిడి, యాదరించిరి. వారిభక్తికాబ్రహ్మర్షి సంతసించి, మార్గాయాసముచే శయనింపఁగోర, వారాతనికి మెత్తనిపక్కనమర్చి, దానిపై శయనింపఁగోరిరి. పిమ్మట నావిప్రకాంతయగు కమల యామహర్షి కొంతసేపునిదురించి లేచి, విశ్రాంతుఁడుగా నుండుటను తెలిసికొని సమీపించి, నమస్కరించి, వినయముమీర నిట్లుప్రార్థింపఁ దొడంగెను.

కమల: —మునివరా! మాయీయగ్రహారమున సంసారులాదరు సంతానవంతులై సంతసించుచుండ, మాకేలయట్టి భాగ్యము చేకూరదాయె? మేముచేసికొన్న పాపమేమి? దయానిధీ! మాకీలోపముతీఱి, యానందముచేకూరు దారికానవచ్చుటలేదే! సంయమీంద్రా! ఇంటింటను నామకరణోత్సవములును, అన్నప్రాశనశుభములును, లోనగు మంగళములు జరుగుచుండ, మాసదనమిట్లు నిరానందనిధానమై యుండవలసినదియేనా? మునిసార్వభౌమా! యీగ్రామమున జరుగుశుభకార్యములలో విప్రకాంతలెల్లరును నిజబాలురనో బాలికలనో, మనుమలనో మనుమరాండ్రనో, చంకలనిడికొని, ముచ్చటగాఁ గన్పట్టుచుండ, నట్టిభాగ్యములేక. నిర్భాగ్యవలె నేనింటియుండుట, నాకమితదుఃఖమును సమకూర్చుచున్నయది.

ఓయతికులతిలకా! సుమమంజరులతోడను, ఫలగుచ్ఛములతోడను, విరాజిల్లుట రసాలలతికలకు శోభావహము. కుంకుమ తిలకములతోడను, సంతానసంతతులతోడను, విలసిల్లుట సంసారకాంతలకు మంగళావహము. తాపసరాజేంద్రా! నేడుమీరాకచే నాహృదయేందీవరమేదియో తెలియరాని వికాసమందుచున్నయది. కావున నాయందుఁ

గృపయుంచి, నాకుసంతతికలుగుటకనువగు మంత్రమునో, దైవతమునో యుపదేశించి, నావంధ్యతనుబాపి, ధన్యతనుసమకూర్పఁ బ్రార్థించు చున్నదానను. నిరాకులస్వాంతులగు మిమ్మిట్లువ్యాకులచిత్తనై వేధించు చున్నందులకు క్షమియించి, నామనోరథము సఫలముచేయ వేడికొను చున్నదానను, అనియిట్లు దీనముగాజాలిగొలుపు పలుకులఁబలుకుచున్న యాబ్రాహ్మణయిల్లాలినిఁ గనుఁగొని యామునిశిఖామణి కరుణార్ద్రహృద యుఁడై తనలోనిట్లు తలంచెను.

"ఓహో! సతీమణులను సంతానవాంఛ యెట్లువ్యాకులపెట్టును! వీరికిసంతతిలేదను సంతాపముకలిగిననాఁడు, వారిసిరులెంతటివైనను తృణ లవములకంటె నధమములుగా వారికంటికిఁ గన్పట్టునేగాని, సౌఖ్యదాయ కములుగాఁ జూపట్టవు. ఈసతీతిలకము ముందు సంతానప్రాప్తికై చేయునుపవాసాదిశ్రమల కంతుండనేరదు. ఇకవీరు గర్భవిర్భావమైన ప్రథమదివసము మొదలు ప్రసవదినమువఱకును ననుభవించుకష్టములకు మేరకానరాదు. ఇంకప్రసవకాలమున వీరుచెందువేదనమును భగవం తుఁడు పురుషుఁడగుటచే నాతనికిగూడఁ దెలియశక్యముకాదు. ఇంతటి తోవీరికష్టములు గట్టెక్కునా? లేదు, లేదు. శిశువునుప్రసవించినది మొదలు బిడ్డపెద్దయగువఱకు నాఁడునకు వీరుచేయు నుపచారముల గణింపఁతరముకాదు. పెక్కేల? ఈమాతృదేవతలు తమజీవితాంతము వఱకు నిజజీవితాది సకలసంపదల స్వనందనానందన సంపాదనమునకై త్యజించి, సంతసించుచుందురు. కావుననే "నమాతుః పరదైవతమ్" అని సువర్ణాక్షరములతోఁ గాలఫలకముపై శాశ్వతముగా లిఖింపఁబడి యున్నది.

"నిజమే యిట్టి మాతృదేవతయుండ నామెనుపూజింపక పుణ్య సంపాదనమునకై దేవాలయములకును, పుణ్యతీర్థములకును, పోవుట వృథాయాసమే కాక పాపహేతుకముకూడనగును."

ఇటులనామునివరుఁడు తలపోసి, పిమ్మట నాభూసురసతి నవలో కించి "పుత్రీ! నీకచిరకాలములో నొకమనోహరుఁడగు నందనుఁడు జనిం పగలఁడు. శ్రీహరినిధ్యానించుచుండుము. ఇంతకుమించిన యుపదేశ

మెద్దియునులేదు. శ్రీహరిధ్యానము కలుషహరము. కామితప్రదము. కావున వ్యాకులముఁవీడి. నిశ్చలచిత్తవై భగవంతునారాధింపుము. అమ్మా! నీకు సౌభాగ్యసంపదలు సమకూరుఁగాక్షత నేపోయివచ్చెద." అని యాముని సంతోషవార్తను తెలుప నాకమల వికసితముఖకమలయై, మునిపాదములకు సాష్టాంగనమస్కారమొనర్చి, "నందనుఁడు పుట్టిన పిమ్మటఁ దిరుగవచ్చి, తనపూజలనందుకొని, సుతునిఁదీవింపుఁడని" పరి పరి విధముల వేడికొనెను. ఆమునీంద్రుఁడు వల్లెయని, యాద్విజపల్లెనుండి. వెడలిపోయెను.

కమల, మునిబోధించినరీతిని శ్రీహరినిహృదయమున ధ్యానించుచు, బలికిసేవలఁజేయుచు, అతిథ్యభ్యాగతులఁ బూజించుచుఁ, గాలముఁగడపుచుండెను. ఇట్లుకొంతకాలముగడువ శ్రీహరికృపచే నాభూసురభార్య గర్భవతియయ్యెను. అపుడాయగ్రహారికకాంతలు మోదముతో మోదకాదులనూడిదలుగాఁ గొనితెచ్చి, యాద్విజకాంతకు సారెలియ్య మొదలిడిరి.

ఇట్లావిప్రపత్ని పుంసవనాదిసంస్కారకలితయై, పదియవమాసమున నొకసుందరాకారుఁడగు నందనుఁబ్రసవించెను. వెంటనే మాధవుఁడాశిశువునకు జాతకర్మాదివిధులనెఱపి ఆబాలుఁడుస్తంభుని యాశీఃప్రభావముచేఁ గలుగుటవలన స్తంభుఁడని. నామకరణమొనర్చెను.

ఆబిడ్డఁడు క్రమక్రమాభివృద్ధినొంది, యుపనీతుఁడై సకలవిద్యలఁ గరతలామలకములట్లు గ్రహించి, అచిరకాలములోనే సకలకలాకోవిదుఁడని ప్రసిద్ధిఁగాంచుటయగాక, వినయవివేకాదిగుణభూషితుఁడై జననిజనకులకును, అగ్రహారికులకును, సంతోషసంధాయకుఁడై వర్ధిల్లఁజొచ్చెను.

ఆయగ్రహారస్వామియగు మాధవుఁడు నిజసుతునకు వివాహముచేయఁగోరి తనయర్ధాంగియగు కమలతోసంబంధముఁగూర్చి ఆలోచింపఁదొడంగెను. ఇట్లుండఁ గుంతలదేశసార్వభౌముఁడగు స్వర్ణజయనృపాలుఁడు పండితపరిషత్తునేర్పఱచి, దేశదేశములఁగల విద్వాంసులకాహ్వానములఁబంపెను. ఆపిలుపునువిని స్తంభుఁడు తండ్రియాజ్ఞనుబడసి, కుంతలమునకేగి, యాపండితసభలో నసదృశమగు నిజపాండిత్య

మును బ్రకటింప, నాకుంతలవిషయాధీశ్వరుఁడు ఆద్విజకుమారుని యద్వితీయమగు వైదుష్యమునకు విస్మితుఁడై యమూల్యములగు పారితోషికములనొసంగి, సన్మానించెను.

అంతనాకుంతలరాజాస్థానపండితుఁడగు గర్గుఁడు స్తంభుని పాండిత్యమహిమకును, సౌందర్యగరిమకును, వలచి, తనపుత్రికయగు కాంతిమయి నాతనికియ్యఁగోరి, తనమనోరథమును కుంతలేంద్రునకుఁదెలుపనాయేలిక యందులకుసంతసించి, నెంటనేనిజమంత్రిని పాలగ్రామమునకుఁబంపి, బంధుసహితముగా మాధవుని స్వరాజధానియగు కళ్యాణపురమునకు రప్పించి, కాంతిమయిని స్తంభునకిప్పించి, మహావైభవముగా గళ్యాణమహోత్సవముల సాగించెను.

మాధవశర్మ పుత్రునివివాహానంతరము నూతనదంపతుల వెంటనిడికొని, బంధువులతోఁగలసి యింటికివచ్చి, నూతనవధూప్రవేశోత్సవాదులనెఱపి, బంధుమిత్రులసన్మానించి, అమితానందముతో సుఖముగాఁ గాలముగడుపుచుండెను.

స్తంభుడును విద్యావయోగుణరూపములతో నలరారు కాంతిమయి నిజకాంతయైయొప్ప, సంసారసుఖములననుభవించుచు, దలిదండ్రులదైవతములుగా భావించిపూజించుచు, విద్యార్థులకు వేదాదివిద్యల బోధించుచు, సత్కార్యములనాచరించుచు జీవితమును ఘనముగా నడపుచుండెను. కాంతిమయియు, నత్తమామలకును భర్తకును ననువర్తినియైననేకలోపచారముల జేయుచు, గృహకృత్యములయందత్తగారికెంతమాత్రిమొత్తము కలుగకుండ సర్వకార్యములఁ దాస్వయముగాఁగనుగొనుచు నత్తింటివారికమితానందమును సమకూర్చుచుండెను.

ఆయగ్రహారమునఁగల పిన్నపెద్దలగుస్త్రీలెల్లరును కాంతిమయిబుద్ధికుశలతను దెలిసికొని, గృహకార్యనిర్వహణమున నాయునతీమణియాలోచనములఁ జేకొనఁజొచ్చిరి. పలుపలుకులేల? యాయూరినారీమణులకాకాంతిమయి జీవితమాదర్శకమై వెలయుచుండెను.

ఇట్టులభూసురకుమారులలో స్తంభుఁడును, జన్నికట్టుకన్నియలలో కాంతిమయియు, వన్నెగాంచియుండిరి. వారిరువురియనురాగవు

నకు వారియనురాగమేసాటి అట్టియుత్తమదంపతులంజూచి, కమలాంమా ధవులు పరమానందభరితులై, తమయంతటిభాగ్యశాలురీభూతలమున లేర నునంతటి గర్వమునుపొందసాగిరి. ఇట్లావిప్రకుటుంబము మోదముతో గాలముగడుపుచుండ, మాధవుఁడు పుత్రకళత్రాదుల దుఃఖసముద్రమునముంచి, దివికేగెను. కాలమెుక్క గీతినిగడుపనగునా! స్తంభుఁడు పితృమరణమునకు విలపింప నాప్తులగుభూసురులాతనికి ధైర్యమునుబోధించి పితృమేధమును క్రమముగానిర్వర్తింపఁజేసిరి.

## —: ద్వితీయాధ్యాయము, కుమైత్రి :—

ఆయాపత్కాలమున స్తంభునియింటికి వచ్చినబంధుబృందముతోఁ గుమతియను నొకబంధుబ్రువుఁడు వచ్చియుండెను ఆదుష్టుఁడు స్తంభునిసంపదకచ్చెరువంది, యెట్లైననాపిల్లకుమారుని విషయాలోలుని గాఁజేసి, ధనమునుసంగ్రహింపనెంచి, ఆతనితోస్నేహమును నెఱపసాగెను. మాధవనందనుఁడు నిష్కపటస్వభావుఁడగుటచే వానివిన యోక్తులకుభ్రమసి, వానినిఁ బ్రియమిత్రునిగాభావించి, వానితోఁగలసి తిరుగఁజొచ్చెను.

ఇట్లుండ నామోసగాడు స్తంభునిఁ దనమాటలయందు నమ్మకకలవానినిఁగాఁజేసికొని, యొకనాఁడిట్లుబోధింపఁదొడఁగెను "మిత్రమా! రేపుమహాశివరాత్రియగుటచే నుజ్జయినీపట్టణమునఁ గాళప్రియనాథుని యుత్సవమతివైభవముగా జరుగును. మనమాదివ్యోత్సవమును జూచివత్తమురమ్ము ఆనాఁడు పార్వతీపరమేశ్వరులు కైలాసమునువీడి, యుజ్జయినీనగరవిభవమును జూడవచ్చిరాయన్నట్లు నందివాహనారూఢులై యూరేగుదురు. సకలదిశలనుండి పండితులును సన్యాసులును, సత్పురుషులును, వేనకువేలువచ్చి, యాయాదిమదంపతులగు గిరిజాచంద్రశేఖరుల దర్శించి, ధన్యతనందఁగోరుచుందురు. కన్నులున్నందుకు ఫలమాయుత్సవమును దిలకించుటయేయని తలంచెదను" ఆమోసగాని బాసలవిన్నతోడనే స్తంభుఁడుత్సవాలోకనకుతూహలుఁడై, యాకృత్రిమమిత్రునితో గలసి, కొంతద్రవ్యమునుజేకొని, యుజ్జయినికేగి దివ్యోత్సవములఁదిల

కించి, పరమానందభరితుఁడై తనకట్టినసంతోషమునకు సమకూర్చినందులకు మిత్రునిస్తుతించి, తిరుగవానితోఁ దనయగ్రహారమునకువచ్చెను.

ఇట్టులనాకుటిలసఖుని ప్రోత్సాహముపై నామాధవనందను డుజ్జయినికి నపుడపుడుపోవనారంభించెను ఆకుమతియుఁదనసఖులచేనుజ్జయినియందుస్తంభునకు విందులఁజేయించుచు వినోదముల సంఘటింపఁజేయుచుఁ గ్రమముగాఁగొంతిమయీకాంతుని హృదయవాతావరణమును తారుమారగునట్లుచేసి ధనములఁజెప్పించి యావిత్తముతో మొదట నాటకశాలలకును, పిమ్మట నృత్యమందిరములకును దక్వాత గానభవనములకును దోడ్కొనిపోవుచుఁ నిట్టుల నాభూసురకుమారుఁడెన్నడెరుంగని నూత్నరుచులకు నలవాటుపడునట్లొనర్చెను.

అట్లుకొంతకాలము జరిగినపిదప నాతఁడు తనవలలోఁబడుటను కనిపెట్టి, యొకనాఁడిట్లుబోధించెను "మిత్రమా! ఈపురమునఁ దారయను గాయకశిరోమణి యొకర్తుకలదు. ఈతార సంగీతమునఁ పేరెన్నికగన్నది. ఈపాటలాధరికి బహువర్ణపరిచయముకలదు. వేణువుచేకొని కృతులను వాయించుటలో జాణ. రాగములమాధుర్యమునకుఁ బెట్టినదిపేరు. కలరవమునఁ బరభృతికయే, పిక్కల నాభివనమున నమృతవల్లివలె నీకుటిలాలక గణికాకులమునఁ గణనకెక్కియున్నది మిత్రమా! నీవీతారాగానమును వినితీరవలయును. కావున మనమీసాయంతనమాగాయకి మందిరమునకేగి సంగీతమునువినవత్తము

స్తంభుఁడు:—మిత్రమా! నాకుగానమన్న నెక్కువమక్కువయే కాని మనమటకేగి, వేశ్యాగానమును వినుటకుమాత్రము కొంచెము జంకు కలుగుచున్నది అన నాతార్పుగాఁడిట్లుపలికెను. "మిత్రుఁడా! మనము దానింటికి గానకళకై పోవుచుంటిమికాని మరెట్టియూహతోడను కాదు. కావున సందేహముతోఁ బనిలేదు. అని యాశ్రోత్రియశిఖామణిని తారాసదనమునకుఁగొంపోయి మొదటినాఁడు కేవలగానకళా వినోదముతోడను రెండవదినమున నాట్యవైభవముతోడను, మూఁడవ దివసమున నభినయవిలాసముతోడను, నాల్గవయహమున సరససల్లాప

ములతోడను సంతృప్తునిగాఁజేయించి, తుదకావెలయాలివలలో నాకోడగానిఁబడవైచి యూకుంటెనగాఁడు కృతార్థుఁడాయెను.

అదిమొదలా విప్రకుమారుఁడు నిజాగ్రహారమునువదలి యుజ్జయినియందు నొకగృహమునద్దెకుతీసికొని, యందుమిత్రులతోఁగలసి నివసించుచుఁ గ్రమముగా దారనుబాసి, యాతారతోవిహరింపఁదొడగెను. మెల్లమెల్లగా నావారకాంతయుఁ దటిచ్చంచలములగు ననురాగకళావిలాసములఁ బ్రదర్శించుచు శీలభాసురుఁడగు నాభూసురసుందరాంగుని దన్నువీడి, క్షణకాలముండనేరనంతటి స్థితికిఁ దెచ్చెను. "నిజమే పాపాణములకడధనమున్నచో వానినికూడ నీవారభామినులు తమతళుకుబెళుకులచేఁ గరిగింపఁజాలుదురు"

స్తంభుఁడును నిజముగతన్ను బ్రేమించి తనక్షేమమును గోరునది యాతారయొక్కతియే యనియు మిగతకళత్రాదిబాంధవులు కార్యార్థము తనతోఁగలసియున్నారనియు, తన్నువీడి యాభోగముసాని క్షణకాలముకూడ జీవింపఁజాలదనియు దలంపఁదొడంగెను "ఆహా! ఈకపటానురాగిణుల మాటలకున్న జనమోహనశక్తి మదిరావాహినులకుగూడ నుండనేరదుకదా".

తుదకావిప్రకుమారుఁడు తనకు ధనమవసరమగునపుడు నిజగ్రామమునకువెళ్ళి, యట రెండుమూడుపూటలుండి, భూములునమ్ముటయో కొదువపెట్టుటయో చేయుచుఁ దల్లిగాని, యిల్లాలుగాని తనపనులకు వ్యతిరేకముగా దేనినేనిచెప్పవచ్చినచో నాబోధలవినక వారినిఁగసరుటకును దిట్టుటకును జిరాకుపడుటకును మొదలిడువాఁడు పాపమువారీతడెక్కడభారముచెందునో యనియుఁదిరుగరాకుండునేమొ యనియుఁ దలంచి మారుపలుకక యింటనున్నంతకాలము సకలోపచారములజేయుచుండెడివారు ధనముచేకూరినవెంటనే యాతఁడు తల్లితోఁగాని భార్యతోఁగాని సంభాషింపకయే వెడలిపోవుచుండెడివాఁడు.

ఇటులఁగాలముసాగుచుండ నొకరేయి సాలగ్రామమునుండి గాలివానలో నొక్కపెట్టున ఆతఁడుజ్జయినికేగుటచేఁ దీవ్రముగా జ్వరము వచ్చెను. అపుడాతారాకాముకుఁడు జ్వరబాధచే తనబసలోనుండనేరక,

తారయింటికేగెను తారయు, స్తంభుఁడు జ్వరపీడితుఁడగుటనుగాంచి వేరుగానొకగదిలో మంచమువేయించి, యందాతనిపరుండఁగోరెను స్తంభుఁడగ్రహారమునుండితెచ్చిన ధనమునంతను దలక్రిందఁబెట్టుకొని యామందిరములోఁబరుండెను తార మధ్యమధ్యవచ్చి యాతనియోగక్షేమమును గనుఁగొనుచుండెడిది. ఇట్లాద్విజసుతుఁడు రెండుదినములేమియుఁదినక యుపవసించుటచే మూడవనాఁడు జ్వరముతగ్గుదలకువచ్చెను అంతతార వచ్చి యిట్లుపలికెను.

తార:—ప్రాణప్రియా! మీకీనాఁడేమైనఁగొంచెము జ్వరముతగ్గినదియా? రెండునాళ్ళజ్వరమున కింతచిక్కియుంటిరే! స్మితసుందరమగు మీవదనము సరోవారిని బాసిన సరసీరుహమువలె వాడియున్నది. నాకీ రెన్నాళ్ళ నుండియు నోటికికూడును కంటికినిదురయు లేవనినమ్ముఁడు

స్తంభుఁడు :—ప్రేయసీ! జ్వరము తగ్గినదనియే చెప్పవచ్చును. కాని కాళ్ళుమాత్రము కొంచెము లాగుచున్నవి కావున నీవు బెంగటిల్లక యాహారమును జేకొనుము

తార :—నాతిండికేమిలెండు మనోహరా! మీకాళ్ళులాగుచున్న వంటికే నేగొంచెము పట్టుకనా ?

స్తంభుఁడు :—కోమలాంగీ! నలినీదళాతిసుకుమారములగు నీకర పల్లవములు నాకఠినపాదముల సోకినకందును కావున వలదు క్రమముగా నొప్పులు సర్దుకొనునులే.

తార:—నాథా! నేస్వయముగా మీకుపచారముల జేసినఁగాని నామనసొప్పుటలేదు అని కరములఁజాపి, నిజకంకణనాదములు చెలంగ నాద్విజపాదముల బట్టనారంభించెను.

స్తంభుఁడు:—ప్రియా! నీహృదయ మెంతమృదువైనదియో నీచేతులును నంతమెత్తనివే నాకునీవుచేయు నుపచారముకంటె నీయనురాగపదములేసౌఖ్యమును కలిగించుచున్నయవి అంతతారచేటిక వచ్చి తలుపుచాటునుండి "అమ్మా యాయూరిబేరి వచ్చియున్నవాఁడు" అని తెలిపెను.

స్తంభుఁడు:—ప్రేయసీ! ఆవర్తకుఁడెవ్వఁడు? ఆతఁడిటకేలవచ్చె?

తార:—మోహనాంగా! మాయమ్మ నేనువలదనుచున్నను ఈ కెంపులగాజులను ఉరవ్వలకమ్మలను ఆతనియొద్దఁదీసికొని కొంతపైక మిచ్చిమిగిలినసొమ్మునకు దిరుగరమ్మన్నది ఆకోమటిమావాళ్ళకుఁజిరపరిచితుఁడగుటచే వస్తువులనిచ్చి తిరుగవత్తునని వెడలిపోయినాడు ఇపుడా సొమ్మునకై వచ్చియుండును. ప్రస్తుతము మాయమ్మయూరలేదు. నాకడ సొత్తునులేదు. ఏమిచేయుటకుఁ దోపకున్నయది.

స్తంభుడు :—నీతల్లియెటకేగె ?

తార :—ఆపెయా! మావీధిగాజులవీరయ్యతోఁగలసి శివరాత్రికి శ్రీశైలమువెళ్ళినది. తిరుగనెప్పటికివచ్చునో?

స్తంభుడు :—మోహనాంగీ! నిజముగా నీసహజసౌందర్యమునకు నగలధరింపవలసిన నవసరములేదు.

తార :—సుభాషణా! నిజమేమీరన్నట్లు అకృత్రిమానురాగమునకు కృత్రిమాలంకారములతోఁబనిలేదు.

స్తంభుడు:—సువదనా! మనమతనికియ్యవలసిన సొమ్మెంత?

తార :—ప్రియా! ఎంతోనా అంతాచేరినరెండువేలు దాటవు అందుఁగొంతముట్టియే యున్నది. నేపోయి ఆవణిజునినెంతసొమ్మిమ్మనవలసియున్నదియో కనుగొనివత్తును. కానిపాపహరమగు మీపాదసేవకు విఘ్నముగా నీబేరగాడు దాపరించినాడు.

స్తంభుడు:—సుదతీ! ఆగుము ఆతనికియ్యవలసిన మొత్తము నీ మూటనుండితీసి ఇచ్చివేసి మిగిలినసొమ్ముఁగొనిరమ్ము దానిని నామిత్రునకునోసంగెదను. ఆతనికేదియో ఘనమవసరమున్నదని నన్నడిగియున్నాడు, నేనుతప్పక సొమ్ముతెచ్చియిచ్చెదనని బాసచేసియున్నాడను అని, తలక్రిందిశాలువమూటనుతీసి, యాగణికకందిచ్చెను, ఆవారకామినియు దానింగైకొని వెడలి కొంతసేపావైశ్యునితో సరససల్లాపములాడి, యాతడిచ్చిన బహుమతులఁజేకొని స్తంభుఁడిచ్చినధనములోనుండి సగముతస్కరించి, తిరుగస్తంభునికడకువచ్చి యామూటనటుచుంచి యామోసకత్తెతిరుగఁగాళ్ళుపట్టుచునిట్లుపలుకఁదొడంగెను.

తార :—ప్రాణేశ్వరా! నేచేయునుపచారమువలన మీకేమైన సౌఖ్యముకలుగుచున్నదియా? ద్విజవరా! మోమాటపడకుడు ఈ సేవకురాలిని మీయర్ధాంగినిగా భావింపుడు.

స్తంభుడు:—వెర్రిదానా! నీవీస్తంభునకు బహిఃప్రాణమని భావింపుము. నీవు నాపైఁజూపునను రాగములోఁ బదియవవంతుకూడ నాయిల్లాలియుల్లమున లేదు.

తార:—మనోవల్లభా తమహృదయము నాయందంతటి ఘనానురాగపూరితమగుటచే నిట్లనుచుంటిరేకాని సౌందర్యమున నేమి సరస సంగీతాదికళలయందేమి, మీయింటియామెకంటె నేనెక్కుడుదానా?

స్తంభుడు :—పేర్మిరసపారా! తారా! నామాటవినుము నా జీవితకాలములో నిన్నుదక్క వెరొక్కకాంతను కన్నెత్తిచూడనని నిశ్చయింపుము నానాలుక కల్లలాడదని విశ్వసింపుము.

తార:—ప్రియానతంసా! నాజీవితమునకంతటి భాగ్యము చేకూరునా? సరసులు సమయోచితసంభాషణులుకదా? అనుచుండ చేటిక వచ్చి "అమ్మా యీమన్నెపుదొర వచ్చియున్నవాఁడు" అని తెల్పెను.

స్తంభుడు:—తొయ్యలీ! ఈదొరయెవఁడు? ఈతఁడు మనయింటికిరాఁగారణమేమి?

తార:—మనోహరా! మాతల్లి తెలివితక్కువను లేమని తెల్పెదను. ఈతఁడు మామాన్యమునకుచేరియున్న తనచేనును అమ్మకము జూప మాతల్లి పొలములో పొలమును కులములోకులమును కలయునన్నపుడుపేక్ష చేయరాదని యీపొలముకొని కొంతసొమ్మిచ్చి మిగతపైకమునకుఁ బత్రమువ్రాయించి, నాచేవంద సంతకముచేయించినది. ఆయప్పునకాతఁడు వచ్చియుండును. అదేమిపాపమోగాని నేను మీకు నిశ్చబ్దముగా నిమురకలిగింపఁ గోరుచుండ నీయప్పులవారీనాడే రాదొడంగిరి.

స్తంభు:—చంద్రముఖీ! మీయమ్మచేసినది చాలమంచిపని ప్రక్కమడి దాటినమరిదొరకునా? కలిసినపంపులఁగొనుటలో మాతండ్రిగారు పడినపాటు నేనెఱుంగుదు. కావున విచారింపకుము. మనమా

సొమ్ము కొద్దికాలములో నిచ్చివేయుదము. నీవేగి యాదొరతో మాట లాడి పంపుము. పంపుడుమాత్రముపోనియ్యకుము అనఁతొరి చిత్తమని పైకివచ్చి ఆదొరతో సరసములాడి, యాతఁడొసంగు సొమ్ములగైకొని, తిరుగవచ్చి ప్రియవల్లభా! నేటికి రెండు కటికలాంఘనముల జేసియుంటిరి. చాలనీరసముగనుంటిరి. కావునఁ గొంచెము గోక్షీరములనో ద్రాక్షా ఫలములనో చేకొనుఁడు. మీ సెలవైన సేవకురాలినిపంపి తెప్పింతును. అంతచేటికవచ్చి "అమ్మా గ్రామకరణము వచ్చియున్నాఁడు." అని తెలి పెను.

తార:—కోపముతో సరే! క్షణక్షణమునకు ఎవరోవచ్చియు న్నారని నేనునాప్రియునకు సేవచేయకుండ నడ్డుపడుచున్న దానవు. ఈక రణపిశాచము సామాన్యముగా విడిచిపోవువాఁడు కాఁడు. కావున చేటీ ఈవృద్ధజంబుకమును మాయమ్మవచ్చినపిమ్మట రమ్మనుము. పొమ్ము. ఇకముందు పాపహరమగు భూసురపాదసేవకు నంతరాయము కలిగిం పకుము.

స్తంభుఁడు:—సుమతీ! ఈకరణమునకుఁగూడ సొమ్మీయవలసి యున్నదియా?

తార:—అనురాగసుధానిధీ! ఏమనిచెప్పుదును సిగ్గగుచున్నది. మాతల్లి మీయాధారముచూచుకొని మొన్న యీకరణముకడ నొక పాటిపెరటిని క్రియమునకుఁదీసికొన్నది. ముదుపు మావాళ్లొట్టిపోయిన గొడ్లను ఇంటినుండిగొట్టివేయుచుండెడివారు. నేనదిచూచి యట్లుచేయఁ జనదనియు, నొకకొట్టముకట్టించి వానినందుంచి ధరవచ్చినప్పుడమ్మివే యుదమనియు బోధింప నీపేరటినికొని ఇంతలో పాకలువేయించి వట్టి పోయినపశువులఁ గట్టుచున్నారు. అదిగో యాపెరటిసొమ్ము పూర్తిగా జేకొనవచ్చియున్నాఁడు కాబోలు "శ్రేయాంసిబహువిఘ్నాని" అన్నట్లు మీపదపంకజ కైంకర్యమునకన్నియు నాటంకములే కలుగుచున్నవి. ద్విజచరణారవిందసేవచే ముందుజన్మమునందైన ఈవెలయాలిపుట్టుక లేకుండుఁగావుతయని తలంచుచున్న దాన,

స్తంభుఁడు:—ప్రేయసీ! ఈతనికీయ్యవలసినసొమ్మెంత ?

తార:—వెయ్యిరూపాయలకు లోపుగానే యిత్తునని తలఁచెదను. కాని ప్రాణేశా! మనమిప్పుడీతనికి సొమ్మియ్యవలను నేనేదియొ సాకుఁబన్ని యీతనిఁ దిరుగ రమ్మని చెప్పిపంపివేసెదను లెండు. మీరు మీ మిత్రునకు సొమ్మిత్తుమని యభయమిచ్చియుంటిరిగా' కావున ఈ సొమ్ము మిత్రునకొసంగి సత్యమును గాపాడుడు అసత్యమును మించిన పాపము లేదు.

స్తంభుఁడు:—అబలామణీ! ఇట్టిస్వల్పమొత్తములకుఁ గూడఁ ద్రిప్పుచుండుట మర్యాద కాదు. ఆతలగడపైనీవు విన్నమాట తీసికొనివెళ్ళి కరణమునకియ్యవలసినదానినిచ్చి పంపుము. లేకున్న నీతఁడు కోపించి కొంపముంచును. సహస్రాక్షుని నేత్రములనైనఁ గప్పవచ్చునుగాని కరణముకన్ను మూయదరముగాదు. కాలునకు భయపడనివారుందురుగాని కరణమునకుభీతిల్లనివారుండరు. ఇకముందు అప్పుచేసియాస్తులఁగొనకుము.

తార:—ఘనాశయా! మాకుటుంబమువాళ్లు మర్యాదనపేక్షించి కులీనుల ప్రాపునుగోరిరేకాని ధనములకాశించి కులహీనుల సాంగత్యము నపేక్షింపరైరి. మఱియు మాదినలుగురువచ్చి పోవుచుండుకొంప ఎంతసంపాదించినను గృహవ్యయమునకే చాలకున్నది; అని చల్లగా నాసొమ్ముతీసికొని, పైకివెడలి కరణముముద్దుచెల్లించి ఆతడిచ్చినదానిని చదుకొనెను. “ఆహా! ఎంతటివివేకులును వారనారీమణుల యనురాగములు సాయంతనవారిదరాగములవలె చంచలములని తెలియజాలకున్నారు కట్టా! సకలపురుషార్థసాధకములగు దేవాలయములుండ నిఖిలజ్ఞానవిజ్ఞాననిలయములగు గ్రంథాలయములుండ! శ్రీలైశ్వర్యసంపాదకములగు సజ్జనసమాజములుండ వానినిఁజేరక ధనమానప్రాణముల హరించి, మానవుల జీవచ్ఛవములనుగాఁ జేయు, నీవేశ్యాలయదురితకూపములఁగూలి యేల! నశించుచున్నవారలో తెలియకున్నది”

## —: తృతీయాధ్యాయము హితబోధ. :—

పిమ్మటనొకనాడు స్తంభుఁడు నిజమిత్రుల వెంటనిడికొని సాలగ్రామమునకువచ్చి, వారినందరిని తనభవనమునఁగూర్చుండనియమించి, లోనికేగి, కాంతిమయినిపిలచి “నామిత్రులకుమనయింట నేఁడు విందుచేయ

వలసియున్నది. కావున వేగముగా భోజనము సమకూర్పుము." అని తెలిపి మిత్రులతోఁగలసి వినోదగోష్ఠినికాలము గడుపఁదొడంగెను. అపుడాస్తంభునిభార్య భర్తయాజ్ఞానుసారము వెంటనేవంటకముల సమకూర్చియుంచెను. కానియాతఁడాటపాటలనడుమ కాలమెంతగడిచెనో తెలిసికొనకుండెను. పరిశీలింపనపుడు రెండుయామముల కాలము గడచినది పాపమింటనతిథులుండ ముందుభుజింపఁదగదనితలంచి, యాయిల్లాలత్తగారికిఁగూడనన్నమిడక, భర్తరాకకై వేచియుండెను.

కొంతవడికాతనియుత్తమమిత్రులు స్నానమాడలేదు సరియకదా కాళ్లుకూడకడిగికొనక తమలములనమియుచు భోజనశాలకు రాఁదొడంగిరి అంతస్తంభుఁడు కాంతిమయికడకువచ్చి కోపముతో " ఇంకనువడ్డింపవేమి ? ఇంతనిర్లక్ష్యభావమా ?" అని కేకలిడ ఆసుగుణాలయ మెల్లగా నిజకాంతునితో "మీరురాకముందు వడ్డించినచోఁ పదార్థములు చల్లారిపోవునని వడ్డింపమైతిని. కోపింపకుఁడిదెసిద్ధముచేయుచున్నదాన" అని క్షణకాలములో వడ్డనపూర్తిచేసెను. అంతవారందరు కడుపారభుజించి వెడలిపోయిరి.

ఇదివఱకాశ్రోత్రియగృహమున కిట్టియపాంక్తేయాతిథులెన్నడును వచ్చియెఱుంగరు. ఆయమంగళాతిథ్యమునకుఁ కమలకుఁగడుపుమండఁ బుత్రునిపిలచి యిట్లుపలికెను.

కమల:—కుమారా! వీరా! నీప్రాణమిత్రులు? బిడ్డా! వాతావరణమున రోగక్రిములు తిరుగునట్టుల లోకమున వంచకజనులు సంచరించుచుందురు. వారిదారులు దారాసంపన్నులగు సుదారులకుఁతగవు సంసారులు ప్రమాదమునవారితోఁ గలసినచో నతివేగముగా నిస్సారులైచెడుదురు. కావున ప్రాజ్ఞుఁడవగునీవు కొంచమాలోచించి, చేరఁదీయదగినవారెవ్వరో, చేరఁదీయకూడనివారెవ్వరో గుర్తింపుము. నీబాగును గోరియే నేనిట్లుబోధించుచుంటినికాని నిన్ను బాధింపనెంచికాదు.

నాతండ్రీ! వినుమునామాటలు మనకిట్టిదురాచారులతో మైత్రి యెంతమాత్రమునుదగదు కావున, వీరిసాంగత్యమును బరిత్యజించి, యు

జ్జయినికేగక, యింటనుండి సత్కర్మాచరణతత్పరుఁడవై నీపూర్వులకీర్తి సంపదల నిలువఁబెట్టుము. ఇట్లంటినని కోపింపకుము.

స్తంభుడు:—అమ్మా! నేనునీచులతో సహవాసముచేయుదునా? వీరు ప్రాతఃస్నానములఁ జేసియుండుటచేఁ దిరుగస్నానమాడరైరి. వీరిదేశాచారముప్రకారము మడిబట్టలఁగట్టనగత్యము లేదు. వీరెల్లరును నాగరకులగు ప్రాజ్ఞులు. వీరునాసౌఖ్యమునకై యవసరమున్నచో నిజజీవితములనుగూడఁ బరిత్యజింతురు వీరు నాకువారిండ్ల నొసంగునాతిథ్యమును జూచిన నీవువింతచెందుదువు వీరందరు నధికధనాఢ్యులు కావున వీరుసామాన్యులనియు నేవీరితోఁగూడి చెడుచుంటిననియు నెంచివిచారింపకుము సదాకుగ్రామములలోఁ గాపురముండుటకంటెఁ బట్టణములలో నివసించుట ఆరోగ్యప్రదము నాగరకతాజనకము సౌఖ్యదము. అందుచే నేనుజ్జయినిలో నివసించుచుంటిని అనితల్లినోదార్చి, నిజసఖులతోఁగలసి వెడలిపోయెను.

నిజనాథుఁడుజ్జయినికి నేగినతోడనే కాంతిమయి, తనయుని యెడబాటునకు విచారించుచున్న యత్తగారికడకేగి యిట్లుపలికెను.

కాంతిమయి ;—అత్తా! మీసద్బోధల మీపుత్రులు వినరని యేతలంచితిరా? వినమీమన్నీ! వారిని మనమిపుడెంత ప్రార్థించినను ప్రయోజనములేదు ఇపుడు మీసుతుని మానసకువలయకాంతుఁడు కుటిలగణికానురాగవ్యామోహమేఘచ్ఛన్నుఁడై యున్నవాఁడు ఈకులటానురాగాగ్నిజ్వాలలు ధనేంధనములు పడుచున్నంతవఱకు మండుచునే యుండును. వానిసంపర్కము తీఱినతోడనే ఇవ్వియుఁజల్లారును కావున మీరోర్పుగలిగి నాచేనుపచారములఁ జేయించుకొనుచుండుడు. నాకువారు తిరుగమనలఁ బ్రేమింతురను గట్టినమ్మకముగలదు మఱియు మీరు కొంచముదయయుంచి నాప్రార్థనల వినగోరుచున్నదానను ఇహలోకబాంధవులు పరలోకమార్గమున జీవులకుసహాయపడనేరరు.. ప్రాణులకు శ్రీహరినామస్మరణమే సంసారసాగరతరణోపాయము కావున మీరీతుదికాలమున హృదయాంతరమునఁ జక్రధరుని స్మరింపఁగోరెదను అని యాపుత్తడిబొమ్మ అత్తగారినోదార్చి సకలోపచారముల జేయుచుండెను.

ఆయగ్రహారనివాసులెల్లరకు స్తంభుని ప్రవర్తనము దుఃఖజనకముగానుండెను. వారాదరముతో ననేకరీతుల నాతనికి బోధించిరి కాని ప్రయోజనమావంతయు గానరాదయ్యెను. ఇటులుండ స్తంభుఁడు తా దీసికొనివెళ్ళిన ధనమంతయు వ్యయమగుటచే ధనమునకై తిరుగనిజాగ్రహారమునకు రాగా గాంతిమయి భర్తనుభయభక్తులతో సర్వోపచారములుచేసి యాతనితో వినయముగా నిట్లు మనవిచేసెను.

కాంతిమయి :— ప్రాణేశ్వరా! మీమాతృదేవత మీరామెతోఁ దెలుపకయే వెడలిపోవుటను తెలిసికొని "ఏమీ! నాబిడ్డఁడు నాతో మాట్లాడకయే యేగెనా?" అని పలుసారులు నన్నుబ్రశ్నించిరి మిమ్ము దలచి పరితపించిరి సచ్చరితా! మీజనయిత్రి తుదివయసుననున్నవారు, మీచేతులలోఁ బ్రాణములవిడువవలెనని కోరుచున్నవారు కావుననాపె జీవితాంతమువరకైన నింటనుండి మీతల్లిగారికి సంతసమును సమకూర్ప ప్రార్థించుచున్నదానను.

సదాశయా! వెలయాలిని బ్రియురాలినిగాను, ఇల్లాలినిబగదానిగాను, తలంచుచుంటిరే కాని, ఓర్పుతో వారిరువురకుగల తారతమ్యమును గుర్తింపకుంటిరి రసికావతంసా పలాండుకందమునకు పరిమళమును, కులటాబృందమునకు అనురాగమును, కలుగుట గగనారవిందసదృశము శ్రోత్రియకులభూషణా! వారాంగనావదనములన నీచజననిష్ఠీవన పాత్రములుకావా? వానిముద్దిడఁగులీనులగు భూసురకుమారులకుఁ దగునా? ప్రాణనాథా! సుధాకరబింబమును గారుమబ్బులమికొనినట్లు మీవిజ్ఞానసంపదను కాని కోరికకప్పివేయుచున్నది. జ్ఞానలవములేనిమీనములు పల్లివానిగాలమునఁజిక్కి యవియునట్లు విజ్ఞాననిలయులగునరులు నీచానురాగజాలమునఁబడి మడియదగునా? కావున ద్విజావతంసా! భూసురకుమారులకుఁ దగిన దేవతాతిథిపూజల నెరపుచు శిష్యబృందముల కుఆమ్నాయవిద్యలఁ గరపుచు మీతల్లిగారికానందమును సమకూర్పుడు అనిబ్రతిమాలుకొనుచున్న యిల్లాలినాముందరి కళ్ళెఱ్ఱజేసిచూచి ఇట్లు పలికెను.

స్త్రభుఁడు:—కాళ్ళీలా! ఏమి! నీవైషమ్యము! ఇట్లుభర్తలని దించి, వారియావాదమునకర్తృతగులుట సతీలక్షణముగా నెంచుచుంటివా? చాలునీధర్మబోధ తెలసెనీహృదయకాఠిన్యము ఇంకనధికముగాఁ బ్రేలితివా చెంపలెత్తవారఁగలవు. అనిభూములమ్మినధనమును చేకొనిపోవనున్న నిజపతికడ్డుగాఁ జేతులుజోడించినిలచి, కాంతిమయి యిట్లుప్రార్థించెను.

కాంతిమయి:—ప్రాణవల్లభా! వృథాగానాపైఁ గోపించుచుంటిరి నేజేయునది ప్రార్థనముగాని ప్రబోధముకాను. తమయింటనాకంటె వేరొకరు మీకుమంచిచెడ్డల నివేదించువారు లేకుండుటచే నేనింతగా బ్రతిమాలుకొనుచుంటిని. అంతియకాని మిమ్మగతాళిచేయుటకుఁగాదు. దైవముసాక్షి నాయంతరాత్మసాక్షి మీపాదారవిందములుసాక్షి అని పాదములఁబట్టఁబోవ, ఆకులటావిటుఁడు ఆకోమలగాత్రిని గాలితోఁద న్ని, నేలఁబడవేసి, వెడలిపోయెను. ఆపాటునకాసుమగాత్రి మూర్ఛితయై కొంతవడికిఁదేరి ఇట్లుచింతింపఁదొడఁగెను.

ఆహా! ఆర్యకులసంజాతులగుపతులు అగ్నిసాక్షికముగాఁ బాణిగ్రహమొనర్చిన సతులనవమానించుటకు నొడిగట్టుచో ఇకహిమాంశుకరములు కలువతీగెలఁగాల్ప మొదలిడవచ్చును. మలయానిలములు మాకందసుమమంజరులదహింప నారంభించుచు, ఇస్సీ! వెలుతురులోఁ జీకటియా! స్నేహములోఁబరాభవమా!, సంతోషములోసంతాపమా! తార్కికులచే న్యాయశాస్త్రమునఁ దెలుపఁబడిన పదార్థలక్షణము వట్టి కల్ల నైయాయికులు మోసగాండ్రు నిజముగాఁ బదార్థములకు స్థిరమగు గుణనిర్వచనములేదు. కాదుకాదు నాయూహయేతప్పు గాఢనిద్రలో మానవుఁడెట్లు లోకతత్త్వమెఱుంగక యజ్ఞానములోఁబడియుండునో, యటులనే వ్యామోహసుషుప్తిలోఁ బడినజీవుఁడు ధర్మమెఱుంగక, యవినీతిమార్గమున సంచరింపఁదొడఁగును. నానాథుఁడిపుడు కుటిలవ్యామోహనిద్రాముద్రితనేత్రుఁడై యుండుటచే నన్ను శత్రుసమానురాలినిగా భావించి, యవమానించుచున్నవాఁడు. దైవకృపచేనాతఁడు మోహావిముక్తుఁడయ్యెనా! నన్నాదరించిప్రేమింపఁగలఁడు మగలు తమ్మలనుచేసనంతమాత్రాన భార్యలు కినియఁదగదు.

కట్టా! ఎట్టి ప్రేమ యెట్లాయె! సకలకళాకోవిదుఁడును, శీలరత్నాకరుఁడును సౌందర్యరాసియు, అసమానానురాగభాసియును నగు నాప్రాణేశుఁడు నన్నవమానింపఁ దొడఁగెఁగా! ఇయ్యది తప్పక నా పురాకృతపాపఫలము. ఈనాడు కాకున్న వేరొకనాటికైనను నా నాథుఁడు నాపైఁ బ్రసన్నతఁ జూపకుండునా! తప్పుదారులఁ బోవువారిని నిందించుట కంటెఁ బ్రేమించి బోధించుట మంచిది కాని వారు తమ్ము బాధించరని తెగనాడుట మంచిది కాదు. పాపము! మాయత్తగారు తమసుతుని ధూర్తకృత్యములను విన్నచోఁ దుఃఖింపఁగలరు. కావున ఆమెకు నాపాటును తెలుపఁ దగదు." అని మెల్లగా లేచి శ్వశ్రూమందిరములోనికేగెను.

"ఆహా! ఆర్యనారీమణుల హృదయసీమ యెంతటి వైశాల్యము కలవిగానున్నవి! వారవిలాసినీకామాంధులగు భర్తలు తమ్మవమానించి తన్నినను వారిని నిందింపరు సరికదా! వారికై విలపింపఁ దొడంగుదురు. కాని సర్వజ్ఞుఁడగు నీశ్వరుని సృష్టిలో నట్టి సతీమతల్లులకుఁ గూడఁ బరాభవములు సంభవమగుటను జూచునపుడు అవినీతిశాసకుఁడును దయామయుఁడును అగు దేవుఁడు కలఁడా? యను సందేహము కలుగకమానదు. కట్టా! నరుఁడు నీచసుఖాపేక్షచేఁ జేయు దారుణకృత్యములకు మేర కానరాదుకదా! ఓ సర్వజ్ఞా! సర్వేశ్వరా! లోకజనకా! తలిదండ్రులగుణములు నిజసంతతికబ్బునందురే! అట్టిస్థితిలో అనంతకల్యాణగుణనిలయుఁడవును అమేయ ప్రేమరససాగరుఁడవును నగు నీకు బుట్టిన సంతతులిట్లవగుణులగుటకుఁ గారణమేమి? అచేతనమగు పంకమునఁ బుట్టిన పంకేరుహము మంగళామోదగుణావహమై లక్ష్మీనిలయమై వెలయుచుండ, జ్ఞానస్వరూపుఁడవగు నీనుండి యుదయించిన జీవుఁడేల యమంగళగుణుఁడై అవివేకకృత్యముల నెఱపుచున్నవాఁడు? వేదాంతులు తమకేదో తత్త్వము బోధపడినట్లు నటింతురే కాని ఈ జీవవిలాసరహస్యము నానంతయుఁ దెలుపఁజాలకున్నవారు. తప్పక యిది దురూహ్యము.

అట్లు కాంతిమయి కమలభవనములోనికేగినతోడనే యా సాధ్వి కోడలిని జూచి యిట్లు పలికెను.

కమల:— తల్లీ! నీ వల్లభుఁడు మనల విడచి వెడలిపోయెనా? పుత్రీ

నానందనుఁడిట్టు ధనార్థమైవచ్చుచున్నవాఁడు కాని మనపైననురాగము చేఁగాదు. పడపుపడఁతుకల మక్కువలకుఁబస, పసిడియేకదా? గుణవతీ! భగవంతుఁడు నాకుఁబుత్త్రినిగను భాగ్యమునేకాని, వానిచేతిలోఁజను సంపదను సమకూర్చినట్లు తోఁపకున్నది. వినయహీనమగువిద్యయు విరాగదూరమగు ప్రేమయు దుఃఖమునుగలిగించునేకాని సౌఖ్యమును సమకూర్పజాలవు మనకనురాగమేకాని విరాగముదయింపకున్నయది కటకటా! నానందనుఁడపకీర్తికూపమునఁ బడుచున్నవాఁడు వీనికిఁదగుగుణసాహాయ్యమును మనము కలిగింపనేరకున్నవారము.

కాంతిమయి :—అత్తా! విచారింపకుము సృష్టవస్తువులకు మార్పుసహజము స్థిరతయనిత్యము ఈనాఁడుకన్నట్లు రూపగుణాదులు రేపు చూపట్టనేరవు మీనందనుఁడిట్లు జారశిఖామణులుగా మారుదురని మీరు కలలోనైనఁదలంచితిరా? లేదుకదా! మనకుపుణ్యమున్నచో తిరుగవారే రేపో యామరునాఁడో పశ్చాత్తప్తులై ధీశాలురుగా మారవచ్చును ప్రాణులభాగ్యరేఖలెట్లు తారుమారగునో యేరెఱుంగుదురు విదుషీమణీ! అనురాగపల్లవములకున్న రమ్యత విరాగజీర్ణపర్ణములకుండునా? వేనినేని సమకూర్చుకొనుటకష్టము పరిత్యజించుట సుకరము మఱియుఁ దల్లులు పిల్లలను సతులు పతులను వీడుటయనునది యసంభవకృత్యము సంయోగవియోగములు పాంచభౌతికదేహమునకుగాని ప్రేమశరీరమునకులేవు పాత్రమున స్నేహము లేకున్న దీపకళతగ్గునట్లు హృదయమునస్నేహము లేకున్న ప్రేమకాంతిముఁగియును కావున దీపకాంతినిగోరువారు తైలమును ప్రేమకాంతినిగోరువారు స్నేహమును పోషించుచుండవలయును.

అట్లాయత్తగోడండ్రు తమమనసుల సంతృప్తములనుగాఁ జేసికొని సంసారకృత్యముల సాగించుకొనుచుండిరి అంతకొంతకాలమునకు స్తంభునిమాతయగు కమల వైధవ్యదుఃఖముచేతను, పుత్త్రుని యవినీతిప్రవర్తనముచేతను, వార్థకప్రాబల్యముచేతను, క్రమముగాఁ గృశీభూతయైనిర్యాణకాలమాసన్నముకాఁగాఁ గోడలినిబిలిచి యిట్లు తెలిపెను.

కమల:—అమ్మా! కాంతిమయీ! నాకవసానకాలమాసన్నమయినట్లు పొడకట్టుచున్నది. నానందనుని ముఖారవిందమును కన్నులారఁ

గాంచి, ఈపాంచభౌతిక దేహమును విడువవలయుననియున్నది. కావున నెవ్వరినైన నుజ్జయినికిఁబంపి, నాపుత్రునిరప్పించి, ఆసుందరాంగుని నా కొకసారిచూపుము నాప్రాణములు పుత్రప్రేమతో నేగకుండునట్లు చేయుము అనఁ గాంతిమయి యత్తగారి యార్తనాదమును విని హృదయము నీరైపార ఇట్లు పలికెను.

కాంతిమయి :—అమ్మా! చింగటిల్లకుము మీనందనుల నెటుల నైననిటకు రప్పింతును అనిపలికి అచటనుండి వెలుపలికివచ్చి తనలో నిట్లు చింతింపదొడఁగెను "పూజనీయురాలగు మాయత్తసుతునిఁజూడ పలవరించుచున్నది ధర్మనీయుఁడగు నాహృదయకైరవచంద్రుఁడు కుటిల కులటాకుహూరాగ హతుఁడై కానరాకున్నవాడు నేనెట్లానుమానీయుని దోడ్తెప్పించి, నాయత్తగారికి జూపగలనో తెలియకున్నది ఇట్టికష్టకాలమున నార్తసంరక్షకియగు పార్వతిని బ్రార్థించుటతక్క వేరొండు సాధనములేదు" అని నిశ్చయించితన కిష్టదైవతమగు కాత్యాయనీ దేవినిట్లు ప్రార్థింపదొడఁగెను.

"ఓదయాలహరీ! గౌరీ! ఇట్లసహ్యదుఃఖసాగరమునఁగూలి, యవియుచున్న ఈదీనురాలిని దయాకరములగు నీకరములసాచి యుద్ధరింపకుంట క్షేమరూపవగు నీకున్యాయమా? అర్ధనారీశ్వరివైన నీవునీదాసురాలు పతిత్యక్తయై పరాభవమందుచుండ గళ్ళారఁజూచుచు నెటుల యూరకుంటివమ్మా? అమ్మా! యిట్టియార్తురాలిపైఁ జాలిగొనక పర్వతపుత్రివనిపించుకొనకుము నాపైదయజూపి మంగళాంగివనిపించుకొనుము. ఓమునికోటిరాణీ! నామనోహరుని మానసమును శీలవంతమును గాఁజేసి, యాద్విజకుమారమాళి నాసేవలజేకొనునట్లు చేయుము ఓవిఘ్నేశ్వరజననీ! నీప్రాణేశ్వరుఁడు లోకదాహకమగు హాలాహలమును బరిగ్రహించి, ప్రాణిసమూహముల సంరక్షించియుండ నీయండఁజేరియున్న భక్తుల దుఃఖములఁ బరిహరించి, ప్రోవకుంట శివకాంతవగునీకుఁ దగవుగాదు. ఓశంకరసుందరీ! నానాథునితల్లికంటికాపె తినూజునిఁజూపి పుణ్యముకట్టుకొనుము విపన్నులఁగాపాడుట నీప్రసన్నతకు చిహ్నము" అని ప్రార్థించి తిరుగనిటులఁదలంచెను. ౹౹పురుషకారములేనిదే మనో

రధము శ్రీదేరఁబాలవు అని ఈక్రిందికీతి నొకయుత్తరము తనకాంతు నకువ్రాసెను.

—: చతుర్థాధ్యాయము వినయలేఖ :—

పావనములై యనురాగామోదభాసురములై వెలయుపతి దైవత పాదారవిందములసన్నిధికి కాంతిమయి వినయానతవదనయై సాష్టాంగ నమస్కారపూర్వకముగా వ్రాయువిజ్ఞాపనలేఖ—
శుభచరిత్రా! కమలాపుత్రా!

మీతల్లిగారు మీమొగ మరాటునకుఁ జాలవిచారించుచున్నవారు. ఆసాధ్వీమతల్లి దేహవల్లి పరితాపపరంపరలచేఁ గ్రమముగా క్షీణించు చున్నయది వైద్యులాపెకు మాదులిచ్చి ప్రయోజనములేదనుచున్న వారు మాయత్తగారికి మీవదనారవిందముచు జూచుచు మీకరపుట ములలో నిజజీవితసుమములర్పింపవలయునను కోరికతక్క వేఱొట్టియైహి కాభిలాషయులేదు. పావనాశయా! తమకుఁదెలియని ధర్మముకలదా? తల్లినిమించిన దైవతయున్నదియా! మానవులకువందలకొలంది సుందరాం గులగు మదవతులు చేకూరుదురుగాని, వినిర్మలప్రేమపూరితస్వాంతలగు మాతృదేవతలు లభ్యమగుదురా? విద్యానిధీ! తల్లులుగలించిరేని యట్టి వారీ యీశ్వరసృష్టియందు మరికానవత్తురా? వారు స్వసుఖములబా టింపకయు వేఱొట్టిఫలములనపేక్షింపకయు, నిజనిర్యాణమువఱకు నాత్మ జులపైఁ జూపుప్రేమకు సాటిలేదు. దానికదియేసాటి, తత్త్వజ్ఞా! తారకా గణములగణింపవచ్చు ఇసుకనలసులలెక్కింపనగు, సాగరతరంగశీకర ములఁ బరిగణింపవలనుపడును. కాని మాతృదేవతా హృదయకోశమున నిమిడియుండు స్వచ్ఛవాత్సల్యమునకుఁ బరిమాణమును నిరూపించుటకు బరమేష్ఠికిఁగూడ సాధ్యముకాదు. అట్టియనురాగకల్పవల్లులగు తల్లుల విషయములోఁ బుత్రులెల్లుమసలవలయునో మీయట్టిప్రాజ్ఞులకు వేఱు గఁదెలుపవలయునా? కావునఁ గతపతియై దుర్భరవైధవ్యదుఃఖమునఁ బడి, మరణోన్ముఖయై మిమ్ముఁజూడవిలపించుచున్న మాతృదేవతనిట్లు నిర్లక్ష్యముచేయుట మీయట్టిసత్కులజాతులకు, బాడిగాదు. శీలభూష ణా! మీతల్లిగారికి మీయువారిసన్నిధినే యుండవలయునని యు, బైకిఁ

బోరాదన్నియుఁ గోరికయున్నను గట్టిగామిమ్ము నిరోధించిన మీరెక్కుడు భారముచెందుదురోయని ఆపె సంకల్పమును వెలువరింపకయున్నవారు, ప్రస్తుతమాతపస్విని మరణాసన్నయైత్తై మిమ్మొకసారిచూడఁ గోరుచున్నవారు. కావున ఈయుత్తరమును చూచినవెంటనే ఇటకుదయచేయఁ బ్రార్థించుచున్నదానను మీచేతగానున్నంతవఱకు మీనూతనకాంత మిమ్మొడఁబాసిపోనేరదు. కావునఁ గొలదిదినములు మీరావెలయాలి వియోగఖేదమును భరించి మీతల్లిగారికి మీదర్శనానందమును సమకూర్పవలయును.

ఈనావిజ్ఞప్తిని దివ్యచిత్తమునకుఁ దేవలయును. ఇందలితప్పులు క్షమింపవలయును.

చిత్తగించవలెను.

ఇట్లు
పరమవిధేయ
కాంతిమయి.

ఆ సాధ్వి యిట్లుత్తరము వ్రాసి, దానిని ముడఁచియుంటించి, విశ్వాసపాత్రుఁడును, వివేకవంతుఁడును నగునొక సేవకునిఁబిలచి, ఇట్లు పలికెను "ఓరీవీరా! నీవీయుత్తరమునుజ్జయినికిఁగొంపోయి, రహస్యముగా మీబాబుగారికందిచ్చి వెంటనేవారినిటకుఁ దీసికొనిరమ్ము. వారు నిన్ను "మాయమ్మయెట్లున్నది" అనియడిగినచో "వారవసానదశలో నున్నారనియు బంధువులుగుంపులుగుంపులుగావచ్చి చూచిపోవుచున్నారనియు తెల్పుము" అనివానికిఁ గొంతపైకమిచ్చి "నీయజమానులకు సొమ్మక్కఱయున్నచో దీనినొసంగుము" అనిపంపెను.

వెంటనే యాకింకరుఁడుజ్జయినికేగి, స్తంభుఁడు బసచేసియున్నయింటికిఁబోయి, యాలేఖనందిచ్చెను. అతఁడాయుత్తరమును విప్పిచూచి, కరమునఁగాసులేమినో, దల్లినిఁజూడఁగోరికనో, యింటికేఁగఁదలంచెను కాని యాతనికడ బండికట్టించుకొనుటకుఁ గానికూడ లేకుండుటచే నేమిచేయుటకునుదోపక, యాయుత్తరమునట్టె చేతఁబట్టికొనినిలచెను. వీరఁడదికనిపెట్టి "అయ్యా! మాయమ్మ కాంతిమయిగారు మీకు

గావలసినచో సొమ్మిమ్మని నాచేతికిప్పైకమిచ్చినారు మీరుదీనిం జేకొని, వేగము గాబయలుదేరవలయును లేకున్నచో మీయమ్మగారిని జీవించి యుండఁగఁ జూచుటతటస్థింపనేఱదు." అని తాఁదెచ్చిన విత్తమాతనికిచ్చెను. స్తంభుఁడు దానిఁజేకొని, యొకగుఱ్ఱపుబండి నద్దెకుఁదీసికొని, దానిలోనెక్కి తారకడకేగక యే వీరనితోసాలగ్రామమునకు నాసాయంకాలమునఁజేరి, తిన్నగఁతనయింటికేగెను. అపుడత్తగారి పదములనొత్తుచున్న కాంతిమయి నిజకాంతునిజూచి నమస్కరించి మరణాయాసముచే గనులుమూసియున్నకమలను మెల్లగాతట్టిలేపిఇదిగో మీనందనులువచ్చియున్నారు చూడుడుఅనెను. ఆమాటవిన్నతోడనే మరణోన్ముఖియగు కమలతనయునిఁజూచి, కన్నులనానందాశ్రువులొలుక నిట్లు పలికెను,

కమల :—చిరంజీవీ! కుశలముగవచ్చితివా? తండ్రీ! నీముఖారవిందమును దిలకించు భాగ్యములేకయే ప్రాణముల విడతుననుకొంటిని. ప్రియనందనా! నేడేకాదశియగుటచే భగవంతుడు నన్నునీచేతులలో దీసికొనిపోయినచో ధన్యతనందుదును; అనిపలికి కాంతిమయివైపు పరికించి 'అమ్మా కాంతిమయీ! నేనికజీవింప నీవు నాసుతుని దుడుకుచేతలకు గిని యక, మనయింటిగుట్టు పరవారికిఁ దెలియరాకుండ గాపురమునుచక్కబరచికొనుము. దుఃఖనివారిణియగు శంకరునిరాణి నీకు సౌభాగ్యసంపద నొసగి కాపాడుగావుత అని తిరుగ స్తంభుని వైపుజూచి "నా తండ్రీ! మేము నీకుశత్రువులమైతిమా? యాకుటిలకులట నీకుహితురాలాయెనా? తనయా! నిష్కలంకానురాగభాసురయు, సకలసుగుణమణిభూషితయు, మృదుమధురభాషితచతురయు, నుత్తమకుల సంజాతయు సౌందర్యశ్రీవిలసితయు, వినయోదార చరితయు నగునీసతికాంతిమయిని మించినసుదతి యీపృథ్వీస్థలిఁబ్బకలదా? వివేకసాగరా? నీవిజ్ఞానమెటబోయె? ఈగృహమునుండి పావనులగు మీతండ్రిగారేగినటులనే నీహృదయమునుండి యశస్కరమగు వివేకమొగిరిపోయెనా? కటకటా! యెట్టి సచ్చరితుఁడ వెట్లయితివి?

బిడ్డా! బిడ్డా! యికనైన దుస్సంగత్యమునువీడి, యింటనుండి నీ వంశమర్యాదను గాపాడుము. నాపుట్టినిల్లు నానాలుక తడియారిపోవు

చున్నది. నాచూపులుసన్నగిలుచున్నవి ఇకనేమాటలాడజాల భగవాను డు మీయుభయులకు తిరుగనురాగమునసుసౌఖ్యగావుత! అనికళ్ళు మూసి మంచముపైఁబడిపోయెను. వెంటనే కాంతిమయి యాపెనుగట్టిగఁ బట్టుకొని ,, ప్రాణేశ్వరా! అపూజామందిరములో పంచపాత్రయందుఁదు లసీజలములున్నయవి వేగముకొనివచ్చి మీతల్లిగారినోటిలో రెండుమూ డుద్ధరణులజలములపోయుము అనస్తంభుడు కాంతిమయి తెలిపినటుల జేసెను అంతనామాధవకాంత నీరసస్వరములో మూసికొనిపోవుచున్న చూపుల తో గాంతిమయియాస్తంభులఁదిలకించుచుఁ శ్రీహరినిస్మరించుచు బ్రాణము లవిడిచెను.

స్తంభుఁడెంతదుష్టుఁడైనను గతజీవితయగు తల్లినిజూచి, దుఃఖావే గమునడ్డజాలక విలపింపఁదొడఁగెను ఆసమయమునఁగాంతిమయిధైర్యము పూని నిజనాథునిచేతఁ గాసులేమినిఁగనిపెట్టి నిజాభరణమును దాకట్టువె ట్టిసొమ్ముతెచ్చి యాధనమును భర్తకొసంగ నాతఁడు బంధుసహాయము నదల్లికిఁదహనాదికర్మలఁజేసి యెట్టెట్లో యాపన్నెండుదినములఁగడపెను. అప్పటికి ఆభూసురకుమారుని చరస్థిరరూపమగు నాస్తియంతయుదావా నలముచే భూరుహసంపద దగ్ధమగునటుల వేశ్యావ్యామోహముచే నాశ నమయ్యెను కానిస్తంభునికిమాత్రము వారకామినీవ్యామోహము మరల దాయెను.

## —♦ పంచమాధ్యాయము ♦—

## వివేకోదయము.

అటనుజ్జయినిలోఁదార స్తంభుఁడు రిక్తహస్తుఁడగుటను దెలిసికొని వేరొకసంపన్నుడగు నవరసికుని నిజానురాగపాశబద్ధునిగాఁజేసి ధన సంచయముల బిండనారంభించెను పాపమీభూసురకుమారుఁడా మోస మెరుంగక యాసారసాక్షి తానులేకున్న బ్రతుకజాలదనితలంచి, మాతృ కర్మముముగిసినతోడనే యుజ్జయినికేగి తారామందిరములోనికి బ్రవేశిం పఁబోవ, గుమ్మముకడనున్న యావేశ్యాసేవకులీవిత్తహీనుని లోనికిఁబో నియ్యరైరి. అందుచేస్తంభుఁడు కోపోద్దీపితుఁడై వాఁడివరకుఁదనసొమ్ము తిన్నవారగుటచే గట్టిగావారిని దిట్టమొదలిడెను అంతనావారకాంతచెంత

గోత్రగాఁజేరిన సరసుఁడు తనప్రియురాలికింకరుల నాబీదబాపఁడు తిట్టు చుండుటను సహింపజాలక తనపరాక్రమము వెలయాలికి వెల్లడియగున ట్లుస్తంభునిమెడఁబట్టి క్రిందికిగెంటెను పాపమాతఁడాప్రోపునకు నెత్తగు గుమ్మములపైనుండి వీధులలోనిలచియున్న బురదలోఁబడి యారథ్యాకర్ద మలేపముచే దేహమునవ్యాపించియున్న వేశ్యామోహతాపము చల్లార నాతఁడాబురదలోనుండి మెల్లగాఁలేచి తనప్రియురాలు కనఁబడునేమో యని వీధిలోనుండి దానిగుమ్మమువైపుచూడ మబ్బుచాటునుండి వెలు వడు వెన్నెలవలె కవాటపటము మరుగుననుండి తనపైఁబడుచున్న ఆకు లటయొక్క చిరునగవునుగాంచుటచే మానసముననిలచియున్న నీచాను రాగాంధకారము తొలఁగఁ తనలోనిట్లు చింతింపఁదొడగెను.

"ఆహా! ఎంతటిమోసమునకులోనైతిని! అతిచంచలమగు నీగణి కానురాగమునఁబడి, నాస్థిరచరార్థములనేకాక కులమర్యాదను, దేహా రోగ్యమునుగూడఁబోగొట్టుకొంటిని కట్టా! ప్రేమకల్పవల్లియగు తల్లిని నిరాదరించితినా? సుశీలయగు నిల్లాలిని దిట్టితన్నితినా? హితబోధకులగు బాంధవుల గసరితినా? ఇట్లిందరినికాదని నేసంపాదించిన సంపదయేమి? అమేయమగు పాంపసంచయము; అనంతమగునపకీర్తి అనివార్యమగు రోగప్రాప్తి ఇక నేనిపుడేమొగముపెట్టుకొని యాశ్రోత్రియాగ్రహారము లోఁ గాలిడగలుగుదును? నేనెట్లాసాధ్వియగు కాంతిమయివదనము నీక్షింతును?" అని యిట్లుచింతించి యర్ధరాత్రియగుసరికినిజనివాసముచేరి "సతిమణీ! కాంతిమయీ!" అని కేకవేసెను. ఆకేక యాయిల్లాలిచెవిని పడినతోడనే ఘననినదమునాలించిన కేకినివలె దేహముపులకలెత్త ప్రియ సమాహ్వానసంతోషశ్రీవిలాసము నిజవదనసరోజమునఁ దాండవింపఁబరు గిడివచ్చి తలుపుదెరచి దీపపుకాంతిలోఁ గాంతిమయి నిజకాంతునిగాంచి "ప్రాణేశా! దేహమాపాదమస్తకమీ బురదయెట్లువచ్చె? మీరుధరించి నవస్త్రములు కర్దములిప్తములైయున్నయవి మనోవల్లభా! ఈనడిరేయి ఈకారుచీకటిలోదారితప్పి ఏబురదదొరువులోనైన ప్రమాదవశమునఁ బడి తిరాయేమి? శ్రమచెందియున్నట్లున్న వారు స్నానమునకు వేడినీళ్ళుపెట్టుదు నా?ఉష్ణోదకస్నానముచే ప్రయాణపుబడలికసడలి మీయొడలుశుభ్రమగు

ను అని ఇట్లు ద్రాక్షాలిమధురములగు మురిపెంపుపలుకులచే దన్నుసంతసింపఁజేయుచున్న యిల్లాలినిఁజూచుటవలన తనవిచారమినుమడింపఁగొంచెముసేపు మూఁగవానివలెఁ బదులుపలుకక యొకవేడినిట్టూర్పు దీర్ఘముగావిడచి ఇట్లుపలికెను.

స్తంభుఁడు:—సాధ్వీమణి! నేను మాతృహంతకుఁడను కళత్రనిందకుఁడను కృతఘ్నుఁడను కులద్రోహిని. నేను నీచాతినీచయగు వేశ్యతోఁగూడి పావనచరితవగు నిన్ను బహువిధముల నవమానించితిని. నా పూర్వులుసంపాదించి నాకొసంగిన కీర్తిసంపద దగ్ధమొనర్చితిని కుమతులలోఁజేరి చేయరానిపనులజేసియుంటిని అట్టికలుషమతిని అట్టి పాపాత్ముడను అట్టిద్రోహిని అంతటికిరాతుఁడను. కావున సతీమణివగు నీచేనెట్లుపచారములఁజేయించుకొందును? ఎటుల నీపావనవదనారవిందమును నీక్షింతును?

సతీమణి! నాదేహమున నంటుకొన్నది బురదకాదు జ్ఞానచందనము గుణవతీ! నేగట్టినపుట్టముల నంటినది కర్దమముగాదు విరాగ కస్తూరీపంకము శీలవతీ! నీవన్నయట్లు గణికామోహాంధకారముచేఁ గన్నుగానక సన్మార్గమునుదప్పి, కుటిలానురాగ పంకపల్వమునబడితిని. చెడితిని సాధ్వీతిలకమా! నాకిదిపరాభవముకాదు. జ్ఞానోదయము నాకీవివేకోదయమైనవెంటనే యెవ్వరికంటబడకుండ నరణ్యమునకు బోనెంచితినికాని పరమపావనమగు నీవదనసరోజము నొక్కమారీక్షించి పోవనెంచి యిటకువచ్చితిని నిన్ను సందర్శించితిని కృతార్థుఁడనైతిని. ఇకపోయెద ననుజ్ఞనొసగుము. కాంతిమయి నిజనాథుని పరితాపోక్తులవిని యాతనిహృదయమేదియో మార్పునుచెందియున్నదని తెలిసికొని యిట్లుపలుకఁదొడగెను.

కాంతిమయి:—ప్రాణవల్లభా! ఏలయిట్లుమాటలాడుచుంటిరి? అర్ధాంగులవిడచి కాంతులొంటరిగఁ గాంతారములకేగదగునా? ఆర్యసతులు నిజపతులబాసి తామింటసుఖింపఁగోరుదురా? ప్రియవల్లభా! గడచినదానినిమరచి నాయుపచారములఁ జేకొనవలయును. "ప్రమాదోధీమతామపి" అనినట్లు ఎంతటిమేధావులును పెడదారులఁ బోవుట కానవచ్చుచున్నది. అనిపలికి వెంటనేయుష్ణోదకము సిద్ధముచేసి

నిజనాథునిస్నానమాడించి, ధౌతవస్త్రములఁగట్టనిచ్చి క్షీరముల త్రాగ నొసంగి ప్రక్కనిలచి మెల్లఁగ విసరఁదొడఁగెను. స్తంభుఁడా సహజావ్యాజోపచారములచే శాంతచిత్తుఁడై యిటులఁదెలుపఁదొడఁగెను.

స్తంభుఁడు:—కటా! సాధ్వీమణీ! నన్నేదియో పెనుభూతము పట్టి, నాబుద్ధిని పెడదారినిఁబెట్టి, నన్ను చెడఁగొట్టినది. అకటా! పావనామూల్యమగు కులకాంతయొక్క యనురాగసంపదనురోసి, చంచలమగు నీచపణ్యాంగనానురాగవ్యామోహాంధకారమునఁబడి కన్నుఁగానక, తిరిగితినేకాని స్వచ్ఛానురాగజీవనవాహినియగు నర్ధాంగినవమానించి, దురంతపరితపర్వతములఁ బెంచుచుంటినని తెలియజాలనైతిని. ఈగ్రామమునఁగల పిన్నపెద్దలెల్లరకు వెగటైతిని.

కావున నేను తెల్లవారకమున్నె యీ యగ్రహారమునువీడి పెద్దల కంటఁబడకుండ, ఏపుణ్యతీర్థమునకో వెడలిపోయెద నీవునాయపరాధములమఱచి నన్నుమన్నింపఁగోరెద. నాయెడబాటును సహించియుండుటను నేనిదివఱకేనీకభ్యాసము చేసియుంటిని. నాయట్టికృతఘ్నునకు సేవచేసి, పాపమునంపాదించుటకంటెఁ బావననాముఁడగు పరమేశ్వరునారాధించి సుకృతములసమకూర్చుకొనుట నీకుముఖ్యకృత్యము. నేనీవికృతస్థితిలో నింటనుండి నిన్ను బాధించుటకంటె నీకుదూరుఁడనై యుండుటయే క్షేమమనితలంపుము.

ఇకముందు అప్పులవాండ్రు తమసొమ్ముల రాఁబట్టుకొనుటకు మనగృహారామాదుల విక్రయింప మొదలిడుదురు. కావున మనమిటనుండుటతగదు. నీవును నీపుట్టినింటికేగుము. నీసోదరులు విశాలహృదయులు అందుచేనిన్ను ప్రేమించి గౌరవింపగలరు ఇక నేఁబోవనంగీకరింపుము.

కాంతిమయి:—ప్రాణేశ్వరా! మీరిటులకర్ణకఠోరముగాఁ బలుకుటన్యాయమా? మీరునన్నవమానించితిమని చింతింప జనదు. మీరు నన్నొకసేవకురాలినిగాఁ జేకొని, నాచేనుపచారములఁ జేయించుకొనుటకు మీకుహక్కుగలదు. నన్నుమీరుతిట్టవచ్చును కొట్టవచ్చును. మీకునాపైసర్వాధికారములునుకలవు, జీవితేశ్వరా! ఇటువినుఁడు కులకాంతలు తమగళమునమంగళసూత్రమును గట్టినపతులును, తమకమప్ర

లఁబుట్టిన సుతులును, నెంతటిదరిద్రులైనను ఇక నెంతటికురూపులైనను, ఎట్టిదురాచారులైనను, మఱెట్టిహింసకులైనను, సేవగింపక ప్రేమింతురు. ఇదివారికనివార్యమగు సహజస్వభావము దానిమరలింప భగవంతునికిఁ గూడఁ దరముకాదు.

కావున మీరెట్టిస్థితిలోనున్నను నాకానందసంధాయకులుగాను వందనీయులుగాను నుందురుకాని, దుఃఖదాతలుగాఁగన్పట్టరు. ఈయది త్రికరణశుద్ధిలోఁ దెలుపుచున్నవాక్కుకాని బూటకపు మాటకాదు. ఇందుకునాహృదంతర్యామియగు భగవానుఁడేసాక్షి. ప్రియవల్లభా! మిమ్మువీడి పుట్టినింటికేగి నేనుసుఖించుట యెట్లుపొసగును? ధీనిధీ! పతి విప్రయోగమున సతియన్నపానాదులవిడచి, కృశించునేకాని మృష్టాన్నములదిని సుఖింపఁగోరదు. మఱియు నార్యపుత్రా! సతులుపతులకు సౌఖ్యకాలమున నుపచారముల జేయనంతగా నవసరముండదు. నిజనాథుడు దుస్థితినిఁజెందియున్నపుడే వారికిసేవలఁజేయు మంచిసమయము కావుననన్ను వేఱుఁజేయఁదలంపక, నాహృదయపూర్వకములగు దాస్యములస్వీకరించి, నన్నానందింపఁజేయుడు సంపదయే సౌఖ్యహేతువనితలంపకుడు ప్రేమయే యానందకందమని భావింపుడు. సతి పూర్ణజీవితయగుటకు సాధనము సదానిజపతిసేవయేయని విశ్వసింపుడు.

ప్రాణేశ్వరా! మీరేకారణమునసనో నాయొడలితొడవులఁ జేకొనరైతిరి. మనమిపుడు వానినమ్మి యాధనములో నప్పులఁదీర్చి, కొంత యాస్తిని నిలువఁబెట్టుకొనవచ్చును. కావున నిలువనీడయుఁదినఁదిండియు మనకుండదని భయపడకుడు పతినీచసావస్థలోనుండ సతికినాభరణములతోఁ బ్రయోజనమేమి? సుగుణాలయా! మీరనినట్లు మిమ్ముతెలియరాని పిశాచమేదియో యావహించుటచేతనే వేశ్యాసాంగత్యమునకుఁ బాల్పడితిరి. లేకున్న మీయనుపమాన శీలకాంతియేడ? ఈయవినీతి తిమిరసంపర్కమేడ? దయానిధీ! క్రూరరోగములచే సుందరరూపము వికారమునుదాల్చునట్లు కులటానురాగములచే మానసవికాసము మాలిన్యమునొందును. మీరింతవేగముగ నీవేశ్యావ్యామోహనిద్రనుండి మేల్కొందురని నేదలంపలేదు. దైవము నాకనుకూలుఁడగుటచే రాహు

ముఖమునుండి చంద్రునివలె వేశ్యామోహమునుండి మిమ్ముఁవిడిపించి నాడు. మీరింతకుముందు నన్నేవగించుటకును ఇపుడుప్రేమించుటకును నాదురితసుకృతములే కారణములు.

స్తంభుఁడు:—సతీమణీ! నిజముగా నావిరాగమునకు ప్రధాన కారణము దైవముకాదు. వినుమునాకువివేకోదయమగుటకు ముఖ్య కారణము ప్రేయసీ! నేనునామాతృకరాస్యంతమున నిటనుండివేశ్యాగృహమునకుఁ బరుగిడిపోతిని. అదివఱకు నారాకలకై యెదురుచూచునా కులటాభటులు నన్నానాడు వారకామినీమందిరములోనికిఁ బోనియ్యక గుమ్మముకడ నన్నడ్డగింప వారలఁదిట్టమొదలిడితిని అంతనాజారిణీ నూతనకాంతుఁడు లోనుండిపైకివచ్చి "పేలకుము, పొమ్ము" అనినన్నుఁగ్రిందికి గెంటివేయ నేనువీధిలోనున్న బురదలోఁబడితిని నాపాటును కెరచాటు నుండి చూచుచున్న యావెలయాలు ననుఁజూచిమందహాసమొనర్చెను అదిగో యామందహాసప్రసారము పాలనుప్పువిరచునటుల నామోహమునువిరుగఁగొట్టినది. అట్టిదుర్భరావమానము సంప్రాప్తముకాకున్నచో నేనింకను మోహాంధకారమగ్నుఁడనై యుండువాడనే సందేహము లేదు. ఆబోగంపుమగువనగవేనావిరాగహేతువు.

కాంతామణీ! కంటివా? యావెలయాలిమోసము మిమ్ముదక్క వేఱొక్కపురుషునిఁబ్రేమించుదాననుకాను." అనినన్నునమ్మించి నాచేతనున్నధనమంతను దోచుకొని, తుదకుఁబరునిఁజేరి నన్నట్లవమానించినది యో అదినాపైఁజూపెడి యనురాగమునకంతులేకుండెడిది నిజముగానావియోగముచే నాచంచలాక్షి మరణించుననుకొంటిని అంతటివిశ్వాసముగల నారీమణి వేఱొకతెలేదనుకొంటిని కంటిని తుదకుదానితుంటరితనమును

కాంతిమయి:—హృదయేశా! ఇందువింతచెందఁదగినదేదియును లేదు. పడపుచేడియల వలపులకును మెరుపుతళుకులసొగసులకును నిలుకడయుండునా? కఠినపాషాణకుట్టిమమునఁ బద్మినీలతయు, కుటిలకులటామానససీమను విశ్వాసకాంతికయు నుద్భవమగునా?

స్తంభుఁడు:—సతీమణీ! ఆవెలయాలంత పెద్దవయసుది కాదు. కాని దానిచేతలతిప్రౌఢములు.

కాంతిమయి:—ఆర్యపుత్రా! వహ్నిశిఖలు చిన్నవిగానున్నను, పెద్దవిగానున్నను దాహశక్తి కలవిగానేయుండును. అటులనే వారకామినులు పిన్నవారైనను పెద్దవారైనను మోసకత్తెయలుగానే యుందురు ప్రాణేశ్వరా! అమిత్రబృందమేమాయె? దాగియుందెవరును మీకు సాయపడలేదా?

స్తంభుఁడు:—ప్రేయసీ! వారా! దేహమునఁగలరక్తమాంసాదుల సంగ్రహించి యాకంకాళమునుపీడి, వేశ్యాకకుణపముకడకేగు కాబంధులవలె రిక్తహస్తుఁడనగు నన్నువిడచి, వేఱొక్కధనికునికడకేగి యుందురు.

కాంతిమయి:— ప్రాణేశా! మిమ్ము మీతల్లిగారును నేనును ఆ దుండగీండ్రతోడి స్నేహమును మానుడనికోరితిమి కానియాదివసములలో మామాటలుమీచెవికెక్కవాయె ఇంతకును మనకర్మతంత్రమిట్లుండఁ బరవారిని దూరభావ్యముకాదు అని నిజనాధునికి సకలోపచారములఁజేయుచుఁ గాలముగడపుచుండెను.

ఇటులసమయము సాగుచుండ వజ్రసమమగు నావిప్రకుమారుని దేహము వేశ్యాసంపర్కజనితములగు రోగపరంపరలచే గృశించి వికారాకారమునొందె తుదకాతనిదేహమాతనికే యసహ్యముగగానరాదొడగెను కాని కాంతిమయికాతడు సుందరరూపుడుగనే కనుపించుచుండెను. ఆమె నిజనాధునికి చిత్తవిశ్రాంతికలిగింప మధురాహారముల సమగ్రుచు సత్కథలఁబఠించుచు వీణపై శ్రీహరికీర్తనల వాయించుచు యేసమయమున నెట్లుచేసిన నిజపతికి సౌఖ్యముగానుండునో యాయా యుపచారముల సంతోషముతో నెరపుచుండెను.

స్తంభుఁడు పాడురోగములపీడకుఁ దాళనేరక నిజకాంతనుజూచి యిట్లుపలికెను. దయావతీ! కులకాంతలు కంటగన్నీరుపెట్టునట్లు పురుషులు మసలినచో నాకులము వ్యాకులమై దారిద్ర్యమున కాలవాలమై చెడుననియు వారు దుర్భరదుఃఖములకు లోనగుదురనియు పెద్దలు తెలిపియు

న్నారు ఆయూహ్యోక్తి నాజీవితమున నిదర్శనమైనది అత్యుత్కట పాపము నకు ఫలమిహమునునే సంభవమగుట సత్యము క్షేత్రమున సస్యమొందిన పిమ్మట వర్షముపడినట్లు చేతధనముపోయినపిదప వివేకమేర్పడిన బ్రయో జనమేమి? బుద్ధిపూర్వకముగా సర్వస్వము పోగొట్టుకొని అంతయుదైవా ధీనమనుటసిగ్గులేనిమాట పాణేశ్వరీ! యికమీదట యమభటులు నీతో మాటలాడజోటియ్యరని తోచుచున్నది సాధ్వీమణీ నీపావనశీతలకరతల మును నాతలపైనిడి నాపాపసంతాపమును శాంతింపజేయుము అనుచుండ గుమ్మముకడ నిలచి దేసలుడను మునివరుడు "భవతిభిక్షాందేహి" అని కేకవేసెను. కాంతిమయి యామాటనువిని మునికెదురేగి నమస్కరించి మునీంద్రునిలోనికిగొనివచ్చి యామహర్షిపాదములు బళ్ళెరమునసుంచి ప్రక్షాళనమొనర్చి యాపూతజలములదెచ్చి తనపతికి త్రాగనిచ్చెను ఆ పాదోదకమాతని లోనికేగినతోడనే హృదయమాలిన్యములొలగ నాత (డు శ్రీహరినిధ్యానింపమొదలిడెను కాంతిమయియు నిజపతికినుపచార ములజేయుచు శ్రీహరిని స్మరించుచుండెను.

పిమ్మట గొన్నిదివసములలోనే స్తంభుడు సుఖరోగపీడితుడై ప్రా ణములవిడచెను కాంతిమయి పతివియోగదుఃఖితయై భర్తకు దహనాది సంస్కారముల బంధువులచే (జేయింపించి ప్రాయోపవేశమున బరమేశ్వ రుని ధ్యానించుచు జీవితమునుత్యజించి దివ్యలోకములకేగెను.

## —॥ షష్ఠాధ్యాయము ॥—

## పునర్జన్మము.

ప్రచేతసుడను మునీంద్రునకు శాంతియను సతియందుబదుగురు కొడుకులుపుట్టిరి వీరియందు గడగొట్టుబొట్టిపేరు కేశవుడు ఈతడు పూ ర్వజన్మమున గాంతిమయిభర్తయగుస్తంభుడే కేశవుడు పుట్టిననాటినుండి యు మిగతతోబుట్టువులవలె విద్యాభ్యాసపరుడుకాక దుష్టులతోగూడి పాడుపనులజేయుచుండెడివాడు తల్లియుసోదరులును ఈతని దుడుకుచేత లు ప్రచేతసునకు దెలియరాకుండజేయుచుండెడివారు క్రమక్రమముగా గేశవుడు పదియారేండ్లప్రాయమునవాడై జారచోరులతో(గలిసి విచ్చల విడిగా తిరుగదొడంగెను.

ఆసంగతి ప్రచేతసునకు దెలిపినతోడనే కేశవుని రాబిలిపించి బహువిధముల మందలించెను కాని కార్యములేకపోయెను అంతఁబ్రచేతసుఁడు కుపితుఁడై కేశవుని వెంటనే యిల్లువిడచి వెడలిపొమ్మని ఆజ్ఞాపించెను కేశవుఁడు ఆయాజ్ఞకురోషియై వెంటనేయింటిని బాసి యొంటరిగా నడవులఁబడి గమ్యోద్దేశములేకయే యేగుచుండెను.

ఇటులుండ నాటవికులగు బిల్లజాతిచోరులు వానిదృఢశరీరమును జూచి వీడుమనకు మూటలమోయనక్కరకు వచ్చును అనివానిచేరదీసి పోషింపదొడంగిరి.

కేశవుఁడును వారితోఁగూడి తిరుగుచుఁ గొలదికాలములోనే విలువిద్యయందును కత్తిసామునందును నిరుపమానప్రావీణ్యమును గడించి సింహవ్యాఘ్రాది వనమృగముల నవలీలగా వేటలాడుచు గ్రమముగా దొంగవిద్దెయందుగూడ బెద్దయై తుదకాభిల్లపల్లికి వల్లభుఁడై కోయలచే దారులగొట్టించియు గోటలముట్టడించియుఁ బట్టణములదోపించియు ధనములనార్జించుచుఁ గొంతకాలమునకొక బోయచేడియను బెండ్లియాడిదాని యందుఁ బుత్రపుత్రికాది సంతానమునుబడసి యాసంతతికిఁ బరిణయములనొనర్చి కోడండ్రతోడను నల్లురతోడను మనుమల్తోడను మునిమనుమలతోడనుగూడి తనయిల్లు పాలవెల్లివలె ముచ్చటగొలుప బంధుపరివృతుఁడైయుల్లాసముగాఁ గాలము గడపుచుండెను.

అతఁడాబంధుబహుళమగు కుటుంబమునకు సౌఖ్యమును సమకూర్పధనములకై యెందరినోచంపించియు మరెందరినో వికలాంగులనుగా జేయించియు స్త్రీశిశుబాలవృద్ధహత్యలకు వెనుదీయక పాపపుణ్యములన్నవన్నమాటయే యెఱుఁగక మత్తేభమువలె జిత్తమువచ్చినట్లావిపిన భూములదిరుగఁజొచ్చెను ఆయరణ్యాదేశమున కేశవునిపేరు యమునిపేరుకంటెను భయంకరమై వినవచ్చుచుండెను.

ఇటులుండ సప్తమహర్షులు పుష్కరతీర్థమునకుఁబోవు నుద్దేశములో నాయడవినిబడి దారితప్పివచ్చుచుండ, కేశవుఁడు నిజపరివారముతో వేటకుఁబోయి యనేకమృగముల వధియించి వానిని దనసేవకులచే మోయించుకొని నిజావాసమునకుఁబోవుచు గంటికి మిఱుమిట్లుగొలుపు

దేహకాంతులతోడను బంగరుతీగెలవలె నలరారుజడలతోడను బాలసూర్యులభాతి భాసిల్లుచు వచ్చుచున్న యామునులనవలోకించి "ఎటుబోయెదరాగుడట" అని మేఘముగర్జించునటులనరచెను వారాయరపునకు వింతచెంది నడకొండవలె తమవైపువచ్చుచున్న యాభీకరాకారునిజూచి యుటంగదలక నిలచిరి.

అంతవాడు వారిచెంతకేగి "మీయొద్దనున్న సొత్తులక్రిందంబెట్టుడు కౌపీనధారులై దూరముగనిలువుడు. అట్లుచేయకున్న మీకపాలములు కపిత్థఫలములవలెం బగులంగలవు" "సేవకులారా! చూచెదరేమి! వీరిచంకలనున్న సంచులలాగికొనుడు," అన వానిధైర్యమునకును, రూపమునకును, మునులెల్లరు సంతసించి, యిట్లనుకొనిరి. "ఈమృగయుండెవ్వండో యంతర్లీనమైన దివ్యతేజముతో వెలయుచున్నవాడు. ప్రస్తుతమీతండు క్రూరుడైయున్నను, మునుముందు లోకోపకారకార్యనిర్మాత కాంగలడని తోచుచున్నయది. కావున వీనిమానసమున జ్ఞానభానూదయమును గావించి, వీనిహృదయకంజము నావరించియున్న యజ్ఞానతుహినవివహముం దొలిగించి దానినివికసింపచేతము.

"పరోపకారసమర్థుండగు సోదరుండిట్లు వ్యగ్రుండగుచుండ గనులారగాంచి యూరకపోరాదు" అనినిశ్చయించి యిట్లు కేశవునితో సంభాషింపందొడంగిరి.

మునులు:—సోదరుడా! త్వరపడకుము మాసంచులనీకొసంగుదుము వేటనాడియాలసియున్నటుల కానవచ్చుచున్నవాడవు మేమును మార్గాయాసముచే బడలియున్నవారము కావున నీమర్రిచెట్టునీడను కొంచమువిశ్రమింతము. అననామునులమాటలచే పాషాణాతికఠినమగు వానిహృదయము కొంచెము మెత్తనాయెను. అందుచేనాతండు వారితో గలసి చెట్టునీడను గూర్చుండనంగీకరించెను. అంతవారందరును వటతరుఛాయనుపవిష్టులైరి పిమ్మటం గుంభసంభవుండిట్లా వ్యాధునిగూర్చి ప్రశ్నింపందొడగెను.

అగస్త్యుడు:—తమ్ముండా! నీవెవ్వండవు? నమ్మోంగుదునిమిత్తము

డ్డగించుచుంటివి ? నీకుఁగావలసినదేమి? అనవాఁడు తనపరిచారకులవైపు జూచెను. అంతవారిలోనుండి యొకకోయబంటు లేచియిట్లుపలికెను.

కోయ:—చెసదారులారా! ఈయయ్య మాకోయసామి ఈతని పేరు కేశవుఁడు ఈయడవినేలయంతయు నీయేలిక యేలుబడికి లోఁబడి నదియే మాదొరయానలేక ఏమానిసియు నిందుఁజేరుటకుఁగాని యిందుం డివెడలుటకుఁగాని వలనుకాదు. మాయొడయుని డాకకుఁబుడమిదొరలెల్లరు గడగడవడఁకుచుందురు. కావున, మీరుబ్రతుకఁదలచితిరేని మాతో మాటాడక, మీకడనున్న సొమ్ములనొసంగి మాసామికడ సెలవుఁజేకొని వెడలిపొండు లేకున్న మనఁజాలరు."

అత్రి:—సోదరులారా! మేము మీప్రభువునకు విధేయులము కాని విరోధులముకాము మాసొత్తుల మీదొరయధీనము చేతుము మీ సామియానకానిదే యీకోనదాటి పోవువారముకాము కానితమ్ములారా మీప్రభువరుని దివ్యరూపమును జూచినతోడనే, మాకానందముదయించినదికాని, భయమొదవలేదు. కావునఁగొంచెము మీయేలికతో మాటలాడుభాగ్యము మాకుఁగలిగింపుడు అనఁ గేశవుఁడాయగస్త్యాదిశ్రేష్ఠులకానందించి ఇట్లుపలికెను.

కేశవుఁడు:—ముసలితపసులారా! మీరునాతోనేమి మాటలాడఁదలంచితిరో జాగుసేయక తెలుపుడు చాలప్రొద్దెక్కెనది నాకొఱకై నా బంధువులు వేచియుందురు వారునేనేగినగాని నోటఁగూడిడరు.

కశ్యపుఁడు:—ఓకోయరేడా! నీవదనారవిందసౌభాగ్యలక్షణము చూడ నీవు ముందుసకలలోకవంద్యుఁడవగుదువని తెలియవచ్చుచున్నయది మేము కాలత్రయవేదులమగు మహర్షులము తమ్ముఁడా! మామాటలవిందువా నీవుతప్పక నరులకేకాక దేవతలకుఁగూడ పూజనీయుఁడవగుదువు. సందియములేదు. సోదరుఁడా! నీవుప్రాణులమడియఁజేసి గడించినపాపములు పర్వతాకారముగాఁ బెరుగుచున్నయవి. నీకంటికి నవికనుపడుటలేదుకాని మేము యోగులమగుటచే మాకంటికిస్పష్టముగా గన్పట్టుచున్నయవి. మిత్రుఁడా! నీవాపాపౌఘముల నెట్లుతరింపగలవా! యనిజాలికలుగుచున్నయది సోదరుఁడా! నీవాపాపసంచయమును బాపు

కొనకుంటివా దురంతరదుఃఖముల ననుభవింపవలసినవాడవగుదువు. కావున నీక్షేమమును గొంచెమోర్పుతో నాలోచించికొనుము మూసలితనము నిన్నుముట్టడింపకమున్నె పున్నెము తెన్నుఁగనుగొనుము. వార్ధకము పైఁబడినచో నీబంధుసంఘమేకాదు నీకరచరణాద్యంగసంచయము కూడ నీకుస్వాధీనముకానేరదు కావున బొందెశిథిలముకాకముందే సంసారబంధమునుండి తప్పించుకొనఁ బ్రియత్నింపుము.

కేశవ:—పాపమా! అదినాకెప్పుడును కనపడలేదే! నాకంటబడినచో దానినినల్లినివలె నలిపివేసియుందును. క్రూరములగు సింహశార్దూలాది మృగములనేలపైఁబెట్టికొట్టునాకు పాపమొకలక్ష్యమా? కావున పిచ్చితపసులారా పాపమునకుభయపడకుడు.

భరద్వాజుఁడు:—తమ్ముఁడా! పాపము కంటికగపడునదికాదు. దానికిరూపములేదు కానిదానిశక్తి యనివార్యము దానిమూలముననే ప్రాణులకు జరామరణాది దుర్భరదుఃఖములేర్పడుచున్నవి.

కేశ:—రూపములేనిదానిని సంహరించుటయెట్లు? అందుకుసాధనమేమి?

విశ్వామిత్రుడు:—దానిని పుణ్యఖడ్గముచేఁ దునియలుగాఁజేయవచ్చు వైరాగ్యానలముచే దహింపవచ్చు ఇకవేఱెట్టిప్రయత్నముచేతను ఛేదింపశక్యముకాదు.

కేశ:—పుణ్యమా! ఏమి యీక్రొత్తమాటలు! ఆర్యా! దాని స్వరూపమెట్టిది?

గౌతముడు:—తమ్ముఁడా! అదియుఁజూపునకుఁగానరాదు దానికి నాకారములేదు కాని దానిమూలముననే పాపసంచయము పటాపంచలగుచున్నయది దివ్యానందముసమకూరుచున్నయది.

కేశ:—ఈపాపపుణ్యములు ఎట్లుకలుగుచున్నవి?

వసిష్ఠుఁడు:—ప్రాణిహింసచేఁ బాపమును జీవసేవచేఁ బుణ్యమునుపుట్టుచున్నది.

కేశ:—అట్లైన నిత్యమును పరహింసచేయునాకుఁ బాపమే కాని పుణ్యములేదన్నమాటయే?

అగ:—అగును అటులనే నీకిపుడు చేకూరియున్నదంతయుఁ బాపసంచయమే యావగింజయంత పుణ్యముకూడ లేదు.

కేశ:—మునివరా! ఇదినిజమా? ఇక నాపాపమెట్లు తొలంగునో తెలుపుడు.

అగ:—సోదరుఁడా! ఒకబరువైన పెద్దరాతిబండను ముక్కలు ముక్కలుగాభాగించి పదుగురు పంచుకొనినచో దానిభారముతగ్గునటులనే, నీచేఁబోషింపఁబడుచున్న నీయాప్తులు నీవొనర్చిన పాపసంఘమును బంచుకొన్నచోఁ బాపము తేలికయగును.

కేశ:—అట్లగుచో నాబంధుగులెల్లరు నామాటకడుగుదాటు వారుకారు నాయందమితగౌరవముతోనున్నవారు వారునేగోరినతోడనే నాపాపములఁబాల్గొందురు.

అగ:—పిచ్చివాడా! ఎంతపొరబడుచుంటివి నీవారు నీపాపము నెంతమాత్రముఁ బంచుకొనరారు పోయికనుగొనుము తెలియును బంధువులయందము

కేశ:—సంయమివరా! నాచుట్టములగుట్టు మీకేమి తెలియును. నేవారిని రాజకుమారులట్ల గౌరవించుచుంటిని కష్టమంతయు నాది సుఖమంతయు వారిది అట్టిస్థితిలో వారునాదురితములఁ జేకొనుటలో సందేహముండఁబని లేదు.

అగ:—ఓ! కోయమన్నీడా! ఈబంధుతంత్రము నీకంతగాఁదెలియదు కావుననే ఇట్లు పిచ్చినమ్మకముతో నమాయకుఁడవై బాంధవమును ప్రశంసించుచుంటివి తమ్ముడా! చుట్టములజేరి పాపవిభాగమునుగూర్చి పలికి చూడుము అపుడుబంధుగుల పొందులోని పసందు తేటపడును. అనవాడు వెంటనే ఇంటికేగెను

## — సప్తమాధ్యాయము —

### బంధుసంభాషణము.

కేశవుఁడు తిన్నగానింటికేగి బంధువులనందరఁ జేరఁబిలిచి యిట్లు పలికెను.

" నాప్రియబాంధవులారా! మీరెల్లరు నాచేసుఖముగా బోషింప బడుచున్నవారలుకదా? ఇపుడు మీరునాకు గొంచెము సాయపడవలసిన సమయమువచ్చినది కావున నేనుగోరినట్లు మీరు చేతురా?

బంధు:—భిల్లసార్వభౌమా! మీయాజ్ఞలకు మేమెన్నడేని మా రాడియుంటిమా? నేడేల యిట్లువింతగా మాట్లాడుచుంటిరి మేమునెరవే ర్చవలసిన పనియేదియో తెలుపుడు చేతులుకట్టుకొని దానినెరవేర్తుము

కేశ:—వింకులారా! మిమ్ముబోషింప నేననేక ఘాతుకకృత్యము లుజేసియుంటిని; అందుచే పాపముపెక్కుపెరిగి. పర్వతాకారముతో గ న్పట్టుచున్నది దానిని మనమందరము సమభాగములుగా బంచికొనవలసి యున్నది ఇదియే మీరుచేయవలసిన సాహాయ్యము.

బంధు:—ఓబోయ తేడా! ఈలోకములో( బాపముల బంచుకొను భాగస్వాములు ఇదివరకుబుట్టలేదు ముందుబుట్టబోరు చుట్టములు తమ వారికి సాధ్యమగుసాయముచేతురు కాని, పరలోకభంజకమగు పాపము నుబంచుకొందురా? మఱియు నీవుగృహయజమానివగుటచే మమ్ము( బోషించుట నీకువిధి నీవు వ్యవసాయముచేసి పోషింతువో వర్తకము సాగించిరక్షింతువో లేక చౌర్యమొనర్చి పాలింతువో మాకు(దెలియదు అయ్యా ఇదివరకు నీవుచేసినవ్యాపారము పాపజనకమగుచో ఇకముందు మంచిమార్గమున సంచరించి మముబోషింపుము మేము నిన్నుపాపముల జేసిరక్షింపుమనికోరలేదే నీకును మాకును సంబంధముకలదు కాని నీదు రితములతో మాకెట్టిసంబంధమును లేదు మరియు పాపమెన్నడును పంచి కొనదగిన పదార్థముకాదు అదికర్తనంటియుండునుగాని వానివిడచి ఇత రులకడకేగదు".

కేశవుడు(డాబంధుభాషణములకని చింతచెంది తనపుత్రికల సం బోధించి ఇట్లుపలికెను. నందనలారా! మనయింటచేరి, మనధనముల( గొల్ల(గొట్టి, తినుచున్న ఈకపటబంధువేషధారులు కార్యకాలమున సాయపడక, నన్నునిర్లక్ష్యము చేయుచున్నవారు కంటిరే! వీరిదుర్నయ ము వీరెప్పుడును మనకు(బరులే మనకుమేలుసేయనొల్లరు. కావున

మనకుమానమే సాయపడవలయును మీరునాకనుంగు కూతులగుటచే నాపాపములఁ బంచుకొనుఁడు.

పుత్రికలు:—తండ్రీ! నీవుమమ్ముఁ బరులకొసంగి, వేరుచేసితివి తండ్రిగడించిన సంపదలోఁ బుత్రికలకు దాయభాగములేదని ధర్మశాస్త్రములు వాకొనుచున్నవి. అందుచే జనకునిసొత్తంతయుఁ దనయులకు జెందునుకాని కూతురులకుఁ జేరనేరదు. కావున నీధనసంచయమునకుఁ గానిఁ నీపాపసంఘమునకుఁగాని మేముదాయాదినులము కాజాలము ఆమాటలువిని కేశవుఁడు పుత్త్రులఁజూచి యిట్లుపలికెను.

కేశ:—ఆత్మజులారా! వింటిరా! మీసోదరీమణులయుక్తులఁ దనయులారా! నేఁబరలోకమున కేగినఁ దిలోదకములనొసంగి నాకుసాయపడవలసినవారలు మీరే కావున నందనులారా! నాపాపములలోఁ బాల్గొనినాకానందమును కలిగింపఁగోరుచున్న వాఁడను.

పుత్త్రులు:—ప్రియజనకా! లోకమునఁదండ్రులు సుతులనభివృద్ధిలోనికిఁదెచ్చుట ఫలాపేక్షచేఁగాదు. కేవలవాత్సల్యమే యందులకుఁ గారణము నీవు మమ్ముచక్కఁగఁ బోషించుచున్నమాట నిక్కువము. తండ్రియెన్నఁడును పుత్త్రులబాగునే కోరునుగాని, తాఁదెచ్చికొన్నపాడు రోగములను తాగడించిన పాపౌఘములనునందనులకంటగట్టగోరఁడుఅట్టి స్థితిలో నిహపరములఁ జెడఁగొట్టుపాపములు మాకేలయంటగట్టఁ గోరుచుంటివి? ఇదివఱకు నీవొక్కఁడవే మముఁబోషించుచుంటివి. అందువల నకలిగినపాపములనుగూడ నీవొక్కఁడవే భరింపవలయును. ఆమాటల విని యాబోయతేఁడు వెరగంది నిజకాంతను చేరఁబిలిచి, ఇట్లుప్రశ్నించెను.

కేశ:—ప్రియసీ! చూచితివా! మనవారికృతఘ్నతల రారాజులవలె మనధనములతో సుఖముగాఁబెరిగి తుదకు నేవీరిసాయమపేక్షింప నెట్లునిరాకరించుచున్నవారలో ఈమోసగాండ్రతో నాకుఁబని లేకనది. నీవునాకర్థాంగివగుటచే మనమిరువురముకలసి పాపమును సమభాగముగా జేసికొందము పతికిసతియు, సతికిఁబతియుఁ,గతి కావున రమ్ము వీరివిడిచిపోదము.

భార్య:—నేస్తకాడా! జీవులు సుఖాసక్తిచేఁ గలయఁగోరుదురు దుఃఖభీతిచేఁ దొలఁగిపోదురు ఈయది సకలప్రాణిసాధారణధర్మము నీవు నన్ను సుఖానుభవమునకై చేరఁదీసితివి కాని, దుఃఖప్రాప్తికిఁ గాదు కదా? అటులనే నేనును సౌఖ్యానుభూతికై నిన్నాశ్రయించియుంటిని కాని దుఃఖసంపాదనమునకై కాదు. ఇదియే సంసారమునందలి కలయికలకుఁ బ్రధానకారణము కావున నీకిష్టమున్న నాకైకష్టపడుము లేకున్న నన్ను విడిచి వెడలిపొమ్ము అంతియకాని పాపవిభాగమునుగూర్చి పల్లెత్తుమాటపలుకకుము నిన్నెవ్వరో సంసారదూరులు మానుండి విడఁదీయఁ జూచుచున్నవారు వెఱ్ఱివేదాంతము తలకెక్కించుకొని మమ్ము విడచి వెడలిపోవకుము ఇకముందు ముసలితనము రానున్నది యొంటరిగా నుండఁజాలవు యోజించుకొనుము మనము కలిసిరాలేదు కలసిపోనేరము ఎడబాటులేని కలయిక యిలపైని లేదు, ఈరహస్యమును దెలిసికొనుము ఆకోయరాణిపలుకులు విన్నతోడనే ఆబోయయొడయునిగుండె ఝల్లుమన దీర్ఘముగా వేడియూర్పువిడచి యొక్కపరుగున మహర్షులయొద్దకువచ్చి వారిపాదములకడ సాష్టాంగముగాఁబడి యిట్లుపలికెను.

కోయ:—సర్వజ్ఞులారా! గురువరులారా! నాయూహయంతయు గల్లయైనది నేను నావాళ్ళు అనుకున్నవాళ్ళు పట్టకూళలుకాని హితులెంతమాత్రముకారు ఇకనాకోయరాణియో ఏమవాణి దయామయులారా ఇకమీరే ఈదీనసోదరునకు సంసారబంధమోచనము చేయదగుదేశికేంద్రులు నన్ను దాసునిగా జేకొని నేయొనర్చిన యపరాధముల క్షమియించి రక్షింపుఁడు మిమ్ముఁజూచినది మొదలు నాచిత్తమేదియో దుర్జ్ఞేయమగు పరితాపమొందుచున్నయది మున్నెన్నఁడు నాకిట్టిహృత్తాపము జనింపలేదు నాకు సుదివసములు రానున్నవని తోచుచున్నయది మీదర్శనమగుటచే నాపూర్వపుసొంపు తెలియవచ్చుచున్నయది మహర్షులారా మొదట నేనొక విప్రకుమారుఁడను. దుర్జనసహవాసదోషముచే నిట్లు క్రూరాతిక్రూరుఁడనుగా మారితిని. దివ్యజ్ఞానసంపన్నులరగు మీకు నాజీవితమును గూర్చి తెలుపనగత్యములేదు నన్నీదురంతచింతాసాగరములోనుండి ఎట్లుకాపాడుదురో మీదే భారము అనికన్నీరువిడువఁదొడఁగెను.

అగ:—తమ్ముఁడా! నీవింతకుముందుజన్మమున నతిలలామయగు నీకులకాంతను అవమానించుటచే నీకీకిరాతభావము సంప్రాప్తమాయె. నీకాసాధ్వి తుదికాలమున నొసంగిన పావనమునిపాదోదకప్రభావముచేఁ గిరాతభావముపోయి వైరాగ్యోదయమయ్యెను. విచారింపకుము నిన్ను సన్మార్గమునకుఁ ద్రిప్పుటయే మాయభీష్టము సోదరుఁడా! నీచుట్టాలపస దెలిసెనా? నీచిత్తమిపుడు విరాగమునొందియుండెనా?

కేశ:—మునివరా! తెలిసె సంసారసారము. సూర్యోదయముచేఁ జీకటి ఎగిరిపోవునట్లు మీసందర్శనముచే సంసారవ్యామోహాంధకారము తొలగిపోయినది ఇదిసత్యము.

అగ:—అటులయిన నీవానదీజలములస్నానమాడి రమ్ము నీకు మంత్రోపదేశముచేతును. అనఁగేశవుఁడామహర్షివాక్యములవిని హర్షవికసితమానసుఁడై యచటియాపగలో నవగాహనమొనర్చి మునికడకు రాగా వాకుంభసంభవుఁడు వానిచెవిలో "మరా" యను మంత్రమును పదేశించి "ఓవిరాగీ! మేముతిరుగ వచ్చువఱకు శీతవాతాదులకు జంకక ఇటనిలచి తదేకదృష్టితో "మరామరా" యని యెడతెగకుండ స్మరింపవలయును. ఈమంత్రమే నిన్నుఁ బరమపావనునిగాఁజేయును మేమిటనుండఁగనే జపప్రారంభముచేయుము అనిబోధింప ధృడసంకల్పుఁడగు నాకేశవుఁడు సప్తర్షులకుఁ బ్రదక్షిణనమస్కారములొనర్చి, యుత్తరాభిముఖుఁడై చేతులుజోడించి చిత్తమునేకాగ్రముగాజేసి మంత్రముజపించుచు నగమువలెఁజలనములేక యన్నపానాదులపేక్షింపక తపమాచరింపఁదొడంగెను. మహర్షులును వానినిశ్చలధ్యానసమాధికి సంతసించి తమయుపదేశము ఫలించునని విశ్వసించి వెడలిపోయిరి.

"ఆహా! సజ్జనచిత్తవృత్తులెంతటి దయావిలసితములు ఉత్కృష్టులగు మహర్షులు కూ్రజనములఁజూచి జాలిచెందుదురేకానివారినిందింప మొదలిడరు. సర్వప్రాణుల నాత్మసమముగా నాదరించి ప్రేమింతురేకాని ద్వేషింపరు. కావుననే కఠినహృదయుఁడగు కేశవునిఁ గృపానిధులగు మునులుకౌర్యరహితుఁడైసంసారవిరాగియై నిశ్చలసమాధినిష్ఠుఁడై

తపమునాచరించునంతటి వానినిగామార్చిరి. సాధువులు లోకమున కుఁజేయుమేలు సామ్రాజ్యములు కూడ నెఱపఁజాలరు."

"రజోగుణాంచితులగు రాజేంద్రులు తమ్మాశ్రయించువారలఁ గాపాడుదురు. తమకువ్యతిరేకముగా సంచరించువారల సంహరింపఁగోరుదురు. సత్వగుణభాసితులగు సాధుచంద్రులన్ననో నిజపరభేదము లేక ప్రాణికోటినంతను బ్రేమించి బాగుసేయనభిలషింతురు."

## —: అష్టమాధ్యాయము :—

### శ్లోకోదయము.

కేశవుఁడట్లు కొన్నివేలసంవత్సరము లేకాగ్రచిత్తవృత్తితో నన్య మెఱుఁగక "మరా, మరా," అని స్మరించుచుఁదపమాచరించెను. సప్తర్షులును సకలతీర్థములసేవించి తిరుగఁగేశవుఁడున్న యరణ్యమునకువచ్చి చూడనాతఁడుకానరాఁడాయె. అంతనాతాపసులు వానికై వెదక మొదలిడి రొకపుట్టకడకురాగా నావామలూరు రంధ్రములనుండి "మరా,మరా" అనునాదము వినరాఁదొడంగెను. వారానాదము నాకర్ణించి యావల్మీకముకడకేగి యందుఁగేశవుఁడున్నాఁడని నిశ్చయించి కమండలువులతో నదీజలము దెచ్చి యాపుట్టపై గుమ్మరింపఁదొడంగిరి యాశీతలోదకధారలచేఁ బుట్టమట్టియంతయుఁ గరుగ నటనిశ్చలసమాధినిష్ఠుఁడైయున్న నిజశిష్యుని దేహము విద్యుత్కాంతివిలసితమగు జలదముమాడ్కి మెఱయుచుఁగానవయ్యెను.

మునులాదివ్యరూపునిఁజూచి తాముచేసిన యుపదేశము ఫలించినందులకు సంతసించిరి. అపుడగస్త్యుఁడు కేశవునిచెవిలో "రామా, రామా, రామా," అనిబిగ్గరగాఁ జపించెను. ఆపావనరామనామనాదము శ్రోత్రకుహరమునఁ బడినతోడనే స్థాణువువలె నిశ్చలుఁడైయున్న యా కేశవుఁడు మెల్లగాఁగన్నులువిప్పి, కట్టెదుటనిలచియున్న మునివరులఁగనుఁగొని "వందేగురుబ్రహ్మభ్యః" అని వారిపాదములకు సాష్టాంగముగా వందనమొనర్చెను. వారాతనిపైఁ గమండలూదకములఁబ్రోక్షించి "మహాత్మా! పావనోదారచరితుఁడవైతివి. నీవువల్మీకములోనుండి వెలువడుటచే నిదిమొదలు నీకు వాల్మీకియని పేరుప్రసిద్ధముకాఁ

గలదు. తాపసోత్తమా! ముందు శ్రీహరి నీవుజపించిన రామనామ మునలో లోకసంరక్షణార్థము నరుఁడుగాఁ బుట్టనున్నవాడు. మేమా పురుషోత్తముని పావననామమును దివ్యదృష్టిచేఁగనుఁగొని, నీకుఁ దారుమారుచేసి 'మరా'యని నీయప్పటిస్థితినిఁబట్టి యుపదేశించితిమి. అదియేసంతతావృత్తిచే 'రామ'యను శ్రుతిసుఖదమగు పదముగా మారినది. భగవంతుఁడు నాదస్వరూపుఁడగుటచే నన్ని పేరులాతనినే బోధించును. అజ్ఞులు నాదరహస్యమును దెలియనివారగుటచే భగ వన్నామములఁగూర్చి తగవులాడుదురు. కాని తత్వమునుదెలిసికొనఁ జాలరు.

ఇకముందునీవు పూతాత్ముఁడవగుటయేకాక నిన్ను స్మరించిన వారినిఁగూడ, పుణ్యాత్ములనుగాఁ జేయుదువు. సోదరుడా! మేముపోయి వచ్చెదము సెలవొసంగుము" అన వాల్మీకి వారిమంత్రోపదేశముచేతను వారి పవిత్రపాత్రోదకసేచనముచేతను, దివ్యజ్ఞానసంపన్నుఁడై సకల విద్యలొక్కపెట్టున స్ఫురింప, విద్వద్వరేణ్యుఁడై యామునిసార్వభౌము లకుఁ బ్రదక్షిణనమస్కారములొనర్చి "గురుచంద్రులారా! మీకటా క్షముచే ధన్యజీవితుఁడనైతిని దయాసాగరులారా! ఇకముందు నేనే కార్యము చేయమొదలిడినను మీకువందనమొనర్చి కార్యారంభమునకు గడంగుదును. మిమ్ములవినా నాకు వేరుదైవతములులేరు"

"ఆహా! కృపానిధులారా! నల్లరాతికంటెనుకఠినమగు నాహృద యమును నవనీతాతిమృదులముగా మార్చితిరే! కాటుకకొండవంటి నాపాపసమూహమును అనలలవము దూదిపింజనువలె దహించితిరే! మీరు నాకొనర్చిన యుపకృతికిఁ బ్రత్యుపకారముచేయ నాకుశక్య మగునా? మీరుసదా నన్నాశీర్వదించుచు నాక్షేమమును గనుగొను చుండవలయునని ప్రార్థించుచున్నవాడను."

మునులు:—తపోనిధీ! మనమిపుడభేదభావము కలవారమగుటచే నాత్మస్వరూపులముకాని, గురుశిష్యులముకాము కావునమమ్ముఁ బ్రా ర్థింపఁబనిలేదు. నీవును మానంటివాడవే మేము పోయివచ్చెదము. నీవు సచ్చిదానందస్వరూపుఁడవై జీవన్ముక్తుఁడవగుదువు" అనివెడలిపోయిరి.

వారు వెడలినపిదప నావాల్మీకి సురభికుసుమలసల్లతావితానసుందరమై స్వాదుఫలభరనమ్రితరుపాళీపరికలితమై కలకూజితరాజితశుకపికాదిద్విజకులసంకులమై, సకలప్రాణిలోకసౌఖ్యావహమై, పావనగమసానదీజలప్రవాహభాసురమై యొప్పు నొకమనోహరవనప్రదేశమున నాశ్రమము నిర్మించుకొని, యందునివసించుచు ప్రేమకళాభాసితుఁడై, ద్వేషతిమిరదూరుఁడై అహింసయే మోక్షసాధనమనియు, పరహింసయే నిరయహేతువనియుఁ, దపోవనము మారుమ్రోగునట్లుల బోధించుచుఁ గ్రమముగా లోకవిఖ్యాతనాముఁడై తేజరిల్లఁదొడంగెను.

ఆవాల్మీకిసంయమీంద్రుని లలితబోధలు మునికుమారుల నాకర్షింపఁ గొంతకాలమున నామహర్షి తపోవనము వటుకదంబబంధురమై విలసిల్లెను. వాల్మీకి ముందావిద్యార్థిబృందములను శీలసంపన్నులనుగాఁజేసి, పిమ్మటవిద్యల నుపదేశింపఁదొడఁగెను "నిజమే కన్నున్నను వెలుతురులేనిచో నిరర్థకమగునట్లు నీతిలేకున్నచో విద్యయుండియు, వ్యర్థమగును. కావుననే యార్యవిద్యాభ్యాసము సదాచారముపై నాధారపడియున్నయది. ఆర్యదేశికులు శీలములబరీక్షించి శిష్యులఁజేర్చుకొనెడివారుకాని యనాచారుల నాచార్యులు చేరదీసెడివారుకారు.

ఆతపోవనమునఁగల యంతేవాసులలో భరద్వాజుఁడను శిష్యుఁడు వాల్మీకిమునీంద్రునకుఁ బ్రియతముఁడుగానుండెను. ఇటులుండ నొకనాటిరేయి వాల్మీకికిఁగలలో శంఖచక్రవనమాలావిభూషితుఁడగు శ్రీమన్నారాయణుఁడు ప్రత్యక్షమై యటుపిమ్మట నీలోత్పలదళశ్యామసుందరుఁడగు నరుఁడుగామారి నిజకృపావలోకనముల నతనిపైఁబ్రసరింపఁజేసి "ఓయీ భక్తవరుఁడా! నేనీరూపముతో భూలోకమున నవతరించియున్నవాఁడను." అనిపలికి యంతర్ధానమాయెను. వెంటనేయాఋషి మేల్కాని నలుగడలఁబరికించి ఎక్కడను ఆమోహనాకారుఁడు కానరాకుంటచే ఖిన్నుఁడై, స్వప్నావలోకితమగు నాస్మితసుందరరూపమును దనమానసమున నిడికొనిధ్యానించుచు నాదివ్యరూపుఁ డెచ్చటనున్నవాఁడోయని తలంచుచు, వ్యాకులచిత్తుఁడైయుండ, నారదమునీంద్రుఁడు పాపహారములగు శ్రీహరిలీలల మనోహరముగ వీణపైవాయించుచుఁ దనదివ్యగా

నము చే శతనాచేతనపదార్థములన్నియు నిశ్శబ్దము లైనిలువ, దివము నుండి తిన్నగా వాల్మీకి తపోవనమునకు వచ్చెను.

అంతనాపుట్టచూలి యావేల్పుజడదారికెదురేగి యర్ఘ్యపాద్యాదులచేనర్చించి, పర్ణశాలలోనికిఁగొనివచ్చి దర్భాసనాసీనునిగా జేసి వినయమ విూర నిట్లుపలికెను. "ఓసతతతపస్స్వాధ్యాయనిరతా! నారదమునీంద్రా! బంధురాంధకారమునఁ బడియున్నవానికి దీపముకానవచ్చినట్లు తెన్నుగానక చిత్తవ్యాకులములోనున్న నాకు నీవుప్రత్యక్షమైతివి.

యతిపుంగవా! దివ్యమానవసృష్టియందు నీకుఁదెలియరాని దేదియు లేదు. అందుచే నాసందేహమును దీర్చిసంతోషమును సమకూర్పఁ బ్రార్థించుచున్న వాడను.

నారదుడు—మునివరా! నీసందేహమేమి ?

వాల్మీకి:—చతురాననందనా! ప్రస్తుతమీభూలోకమున సకల కల్యాణగుణభాసురుఁడును, సమస్తజీవసమ్మోహనాకారుఁడును, ఆర్త జనావనదీక్షాసంపన్నుఁడును, అనన్యసామాన్యపరాక్రమ భాసమానుడును నిత్యసత్యవ్రతపరాయణుఁడును, అగునరుఁడెవ్వఁడైనకలఁడా? అట్టి ఘనోదారపావనచరితుఁడున్న చో నెచ్చటనున్నవాడు? మునీంద్రా! మొన్నరాత్రి నాకట్టిదివ్యపురుషుఁడు స్వప్నమున దర్శనమొసంగి తానీభూలోకమున నవతరించియుంటినని బోధించి యంతర్థానమైనాఁడు నాటినుండియు ఆనరోత్తముఁడెచ్చటనున్నవాడాయని చింతించుచుంటిని కానియింతవఱకా పురుషవరేణ్యునిగూర్చి బోధింపఁదగిన దివ్యజ్ఞానసంపన్నులు కానరారైరి ఇపుడు నాసుకృతపరిపాకవశమున మీరునాకు దర్శనమొసంగితిరి. కావున నాయఁదుదయయుంచి నాకానరవరుని చరితమును వివరింపుడు. అనిప్రార్థింపఁ ద్రిలోకసంచారియుఁ ద్రికాలవేదియు నగు నాత్రిదశముని వాల్మీకిహృదయపరితాపమును గ్రహించియిట్లుపలికెను

నార:—వాల్మీకిమునీంద్రా! నీవుతెలిపిన కల్యాణగుణములన్నియు సామాన్యముగా మానవునియందుండుట దుర్లభము. కాని నీవడిగిన కళ్యాణగుణాకరుఁడగు నరుఁడిపుడు కోసలదేశమున నిక్ష్వాకువంశమునందు దశరథునకు పుత్త్రుఁడై రామాభిధానములో రాజ్యమేలుచు

న్నవాడు అని యా శ్రీరాముని దివ్యచరితమును సంగ్రహముగా బో ధించెను. వాల్మీకి యాచరితమునువిని సంతుష్టాంతరంగుఁడై నారదుని బహువిధముల స్తుతించెను. నారదుడును వాల్మీకిచేఁ బూజితుఁడై భగవ న్నామసంకీర్తనము చేయుచు దివి కేగెను.

వాల్మీకి నారదాభివర్ణితమైన శ్రీరామచరితమును వినుటచే హర్షోత్ఫుల్లహృదయుఁడై భరద్వాజుఁడు వల్కలకమండలులఁ బట్టికొని, వెంటరాగా మాధ్యందినసవనార్థము తమసానదీతీరమున కేగి, "భరద్వా జా! చూచితివా! ఈతమసా వాహిని! ఎంతమనోహరముగాఁ గన్పట్టు చున్నదిరో! చక్రవాకబకముగాఁ గన్పట్టుచున్న తెల్లనియిసుక రేవుల తోడను, సజ్జనమానసములవలె వినిర్మలములై ప్రవహించుచున్న పావన నీరపూరములతోడను, ప్రఫుల్లారవిందసౌరభసుందరములగు శీతవాత పోతములతోడను, హృదయంగమములగు జలవిహంగమకలకూజితము లతోడను తీరలతానికుంజపుంజమనోహరములగు తరుసమూహముల తోడనుగూడి చేతోహరమై ఈశ్రోతోవహము తేజరిల్లుచున్నయది.

ఈతమసాతరంగిణీ నిర్మలజలముల స్నానమాచరించి మధ్యాహ్న కర్మకలాపమును ముగింతును. కావున బిడ్డా! నీచేతనున్న స్థాలినీపులిన స్థలినుంచి స్నానవసనముల నొసంగుము" అనభరద్వాజుఁడు అవగాహ నచేలములఁ జేతికందిచ్చెను. అంతనాపుట్టపట్టి యాట్టఁగట్టికొని తీర మునుండి తీర్థములోనికిదిగుచుఁ జెవులకింపుగొలుపు విహగకూజితము నువిని, తలపైకెత్తి చూడ బార్శ్వస్థమగు నశ్వత్థవృక్షముపైఁ గవగూడియు న్న గువ్వలజత కానవచ్చెను ఆపావురపుజంటను ఆజటాధారి చూచు చుండ జీవహింసయే జీవనాధారముగాఁగల దయావిహీనుఁడగు వేట కాడొకఁడు వాడికోలచే నాగువ్వలజతలోనుండి మొగపిట్టను నేలబడఁ గొట్టెను. అపుడు తన్నుపీడి రక్తసిక్తమైనదేహముతో నేలపైఁబడి కొట్టు కొనుచున్న తనమొగపులుగుఁజూచి, కొమ్మపైనుండి కూడికకాని పా టునకు దీనముగాఁ గూయుచున్న యాగువ్వపెంటిని చూచినతోడనే దయామయుఁడగు నావల్మీకభూలి జాలిగొని కన్నులశోకవారిక్రమ్మ గోపమునుబట్టఁజాలక, యట్లన్యాయముగా సుఖపరవశమైయున్న క్రౌం

చమును జంపిన యాకూళనుజూచి తిట్టఁబోవ, వాల్మీకివదనమునుండి శ్లో॥ మానిషాదప్రతిష్ఠాంత్వంమాగమః శాశ్వతీస్సమాః। యత్క్రౌంచమిధునాదేకమవధీః కామమోహితం॥ అని యప్రయత్నముగా నొకయపూర్వగీర్వాణశ్లోకవాణి వెలువడెను. అట్లప్రయత్ననిర్గతమైన కరుణరసవాహిని వెలికివచ్చినతోడనే వాల్మీకి యానూత్నఛందస్సునకు వింతచెంది, చెంతనిలిచియున్న భారద్వాజునితో నిట్లుపలికెను.

వాల్మీ:—పుత్రా! భరద్వాజా! ఏమి! యీవిచిత్రఛందఃప్రసారము గగపతియై విలపించుచున్న క్రౌంచశకుంతినిఁజూచి శోకతప్తుడనై పలికినశాపోక్తి తంత్రీలయసమన్వితముగా గానముచేయఁదగు శ్లోకముగామారినది. నేనిట్లుపలుక నెట్టిప్రయత్నముచేయలేదే! మఱియు నేనెన్నడిట్టి హృద్యమగు పద్యమునువినియుండలేదే! ఆహా! భరద్వాజా! కంటివా? యీఛందస్సుయొక్క చందమును!

భర:—గురుసార్వభౌమా! నిజమే కేవలమామ్నాయఛందోమంత్రముల వినునాచెవులకీ యపూర్వశ్లోకము మనోహరముగా వినవచ్చినది. తపోనిధీ! మీహృదయకుహరాంతర్లీనమైన గానరూపిణియగు వాణి మీముఖారవిందమునుండి యిట్టిశ్లోకరూపమున వెలువడియుండును. కవిత్వమప్రయత్నముగా నావిర్భావమైనపుడే సహజసుందరశైలితోడను మనోహరభావసంపదతోడను గూడిశోభించును సహజకవితకున్నసొగసు కృత్రిమకవనమునకుండనేరదు. అనిపలికి తిరుగ గురుకృతశ్లోకమును స్వయముగాఁబఠించెను వాల్మీకిభరద్వాజుఁడొనర్చిన పద్యగానమునువిని పరమానందభరితుఁడై తమసాజలములస్నానమాడి సంధ్యావందనాదులఁదీర్చి, కలశహస్తుఁడై శ్లోకమునుబఠించుచు భరద్వాజుఁడు తనవెంటరా నావామమునకు రుసముద్భవుఁడు అప్రయత్నముగాఁ సంప్రాప్తమైన నవీనపద్యభారతీసాక్షాత్కారమునకు మాటిమాటికి విస్మయమందుచు నిజాశ్రమమునుచేరెను

## —♦ నవమాధ్యాయము బ్రహ్మసందర్శనము ♦—

అచటివటువులాశ్లోకము నొకరినుండియొకరువిని సంతోషములో దానిఁగానముఁజేయుచుండఁబ్రాచేతసుఁడు విస్మయానందభరితుఁడైయా

శ్లోకవిర్భావమునకుఁ గారణమేమయియుండునా! యనియాలోచించు చుండ, సకలజగన్నిర్మాతయగు విధాతసత్యలోకమునుండి వాల్మీకిమహర్షి యాశ్రమమునకు మరాళవాహనముపై వచ్చెను ఆచతురాననునిఁజూచి వాల్మీకి బ్రహ్మానందమొంది ప్రత్యుద్ధానవందనములొనర్చి, కరపుటము లునంఘటించి నిలువ నానలువ నలుమోములనుండి చిరునగవులుప్రస రింప వాల్మీకినవలోకించి యిట్లుపలికెను

బ్రహ:—మునివరా! నీవదనమునుజూడ నీవేదియో క్రొత్తవిం తనుగని వెఱగందియున్నటుల తెలియవచ్చుచున్నయది నీవెఱగునకుఁ గారణమేమి?

వాల్మీ:—భారతీరమణా! నీకుఁదెలియనిదేదియుండును; అయిన నువినుడు మనవిచేసెదను. కమలాసనా! నిన్ననేనొక విషాదకరమగు నిషాదకృత్యము నవలోకించి ఖిన్నుఁడనై క్రూరుఁడగునావ్యాధునిఁ దిట్ట బోవ నప్రతత్నముగా నవీనఛందస్సొకటి నానోటినుండివెలువడినది. దా నిందలంచి వింతచెందియుంటిని. అని యాశ్లోకమును పఠించెను.

శ్లో॥ మానిషాదప్రతిష్ఠాంత్వం మాగమః శాశ్వతీఃసమాః।
యత్క్రౌంచమిథునాదేకమవధీః కామమోహితం॥"

బ్రహ్మ:—కవివరా! నాప్రేరణముచే సరస్వతి నీవదనసరసిజము నుండి, ఈనవీనశ్లోకరూపములో నావిర్భవించినది సందియములేదు. ఈశ్లోకరాజమున పైకినిషాదపరమగుశాపోక్తియు లోపలమానిషాదపర మగు మంగళోక్తియు నిగూఢముగానిమిడియున్నవి. వినుము మొదటి భావమును "ఓనిషాదుఁడా! కామమోహితమగు క్రౌంచమిథునము నుండి మగపిట్టను గొట్టిచంపితివికావున నీవచిరకాలములోనే నశింతువు గావుత." రెండవభావము "ఓరమారమణా! కుటిలస్వభావముగలరాక్షస మిథునమునుండి పురుషుని సంహరించితివి. (అనగా ఓసీతాసహచరా! రామా నీవు మండోదరీరావణులలోనుండి కుటిలాశయుడగు రావణుని కూలనేసితివి కావునశాశ్వతకీర్తినంది యీవసుంధరఁ జిరకాలముండువు కావుత!) అని యిట్లుచింతితముగాఁ చింతితార్థప్రదమగు మంగళార్థము గూడ నీపద్యమందువెలయుచున్నది. కావున నీవీశ్లోకరత్నములతోఁ

పావనమగు శ్రీరామచరితమును విరచించి యాదికవివై ప్రఖ్యాతినందుము మున్ను నీకు రామకథను నాయాజ్ఞచే నారదుఁడుబోధించి యున్నవాడు మఱియు నాయనుగ్రహముచే జానకీజాని చరితమంతయు నీకుఁ గరబదరసదృశమై కానవచ్చును. నీవువిరచించిన రామాయణకావ్యము భువమునఁనగసముద్రాదులును, దివమునసూర్యచంద్రాదులును, యున్నంతకాలము లోకానందసంధాయకమై తేజరిల్లగలదు. పాపహరమగు శ్రీరామునిపావననామ ముచ్చరింపబడునంతవఱకు నీవు నాలోకమున బ్రహ్మానందముగా నివసింపఁగలవు మున్నునీవొనర్చిన యఖండరామనామతపమునకు ఫలముశ్రీమద్రామాయణకావ్యమునకుఁ గర్తవగుటయే. నీవుకలలోఁగన్న నీరదసుందరాకారుఁడగురాముఁడే ఈమహాకావ్యమునకు నాయకుఁడు పూతచరితయగు సీతయేనాయిక కావునమునివరా! కాలహరణమొనర్పక వెంటనేకావ్యనిర్మాణమునకుఁ బూనికొనుము. అనియావిరించి వచించి, యంతర్ధానమాయెను.

సరసిజాసనుఁడేగినపిదప ముదితమానసుఁడగు నాప్రాచేతసుఁడు మొదటఁగలలో నీలనీరదశ్యాముఁడగునరుఁడు ప్రత్యక్షమగుటను, అవెనుక నీరదమండలమునుండి నారదుఁడు తనకడకువచ్చుటను, పిమ్మటఁ గ్రౌంచీకరుణావలోకనజనితశోకము శ్లోకముగాఁ బరిణమించుటను అవెంటనే చతురాననసందర్శనమగుటను అపరమేష్టి తన్ను రామాయణమొనర్ప నాజ్ఞాపించుటను దలంచివిస్మితుఁడై శిష్యులెల్లరు దానుచ్చరించిన శ్లోకమును చై్చెస్స్వరముల తోశ్రుతిసుఖముగా గానమొనర్చుచుండ బులకితగాత్రుఁడై యారాత్రియంతయు శ్రీరామచరితమును హృదయమున బ్రత్యక్షముచేసికొని, యరుణోదయమునకు ముందుగానే స్నానసంధ్యాదివిధులనెరవేర్చి దర్భాసనాసీనుఁడై సప్తర్షివందనమొనర్చి శ్రీహరిని ధ్యానించి శ్రీమద్రామాయణమును హృద్యములగు పద్యములతోవిరచించెను.

ఁ నవరసకిసలయదలవిలసితమై లలితపదసుమసముదయశోభితమై మంజులభావామోదమేదురమై సుమధురార్థఫలకదంబబంధురమై శ్లోకకోకిలకలరవనాదసుందరమై పాపతాపాతపవారక శీతలచ్ఛాయావృతమై పుణ్యసంపాదనానుకూల మూలవిరాజితమై గీర్వాణభాషాలవాలమునవే

ష్ఠితమై సకలాభీష్టసంపాదనానుకూలమై, వెలయు రామాయణపారిజాతమహీరుహమును సృష్టించి వాల్మీకిమహర్షి శాశ్వతకీర్తి నిఁబడసెను. భారతదేశము సారస్వతవిషయమునను సర్వదేశాతిశాయియై చెన్నొందుటకు రామాయణకావ్యమే ముఖ్యకారణము. ఈకావ్యసుధానిధి కరుణరసవర్ణనములచేఁ బాషాణములఁగూడఁ గరిగింపఁజేయును. సీతికథావివరణములచే నాయసమానసములనుగూడ రసవంతములనుగా నొనర్చును. ప్రేమవైభవప్రకటనములచే శర్కరారాశులనుఁగూడ నొక్కముద్దగాఁ జేయఁజాలును. శౌర్యప్రతాపప్రచారములచేఁ దృణలవములనుగూడఁ దేజోవంతములనుగాఁ బరిణమింపఁజేయును. క్రౌర్యవర్ణనములచేఁ గ్రవ్యాదులనుగూడ సిగ్గుపడఁజేయును. పెక్కులమానవసంఘమును మార్తాండమండలమువలెఁ దేజోవంతమునుగాఁ జేయసమర్థమైయున్నయది.

కవులెల్లరిందరి కల్పనాచమత్కృతులను భావౌన్నత్యములను, నవరసవిలాసములను ప్రకృతివర్ణనములను తమకావ్యముల నింపియున్నవారు జనులలో వర్షధారలఁదడవనివాఁడును, పూర్వకవులలో రామాయణసారము నాస్వాదింపనివాఁడును లేఁడు. చక్కనియుపమానములనిచ్చుటలో వాల్మీకియే యుపజ్ఞుఁడు. "ఉపమా కాళిదాసస్య" అనులోకోక్తి సారచేతసునకుఁ బిమ్మట అని తెలుపవలసియున్నది.

వాల్మీకి యిట్లుమనోహరమగు నపూర్వకావ్యమునువిరచించి దీనిని హృద్యముగా గానమొనర్పఁదగినవారెవ్వరా! అనిపరికింపసాగెను. ఇట్లు నిజకావ్యగానార్హులగు ధీశాలురకై నిరీక్షించుచుండ గానకళాకోవిదులును కింనరకంఠులునగు కుశలవులువచ్చి పాదములకువందనమొనర్చి వినయావనతవదనులైనిలువ వాల్మీకిమహర్షి హర్షనిర్భరహృదయుఁడై, ఆకవల నవలోకించి వీరలే రామాయణగానార్హులని నిశ్చయించి వారికి నిజకావ్యమునుబోధింపనెంచి అస్త్రీతానందనులచే స్నానమాడించి నవవల్కములఁగట్టించి తూర్పుముఖముగాఁ గూర్చుండఁబెట్టి మహర్షుల ధ్యానించి సాకల్యముగా రామాయణమునుబోధించెను.

అసమానమేధాసంపన్నులగు సీతానందనులు సీతాచరితసుందరమగు రామాయణమును కంఠపాఠమొనర్చి విపంచీనాదములతో నిజ

కంఠస్వరముల మేళగించి మహర్షులమ్రోల హృద్యముగా గానమొన
ర్పఁదొడంగిరి.

ఆజగన్మోహనగానము కర్ణపుటములబడినతోడనే మునివరేణ్యు
లెల్లరు సమాధులఁజాలించి, సభకూడి శ్రీరామకల్యాణగుణకీర్తనమును
వీనులొగ్గివిన మొదలిడిరి కుశలవులును మహర్షులకానందమభివృద్ధియగు
నట్టుల వీణవాయించుచు రామాయణమును బాడనారంభించిరి ఆపావన
గానమునకు సంయమీంద్రులు వింతచెంది ఓహో! యేమియీగానమా
ధుర్యము, ఆహా! యేమియీపద్యరచనాచాతుర్యము అయ్యారే! యేమి
యీగాయకనైపుణ్యము ఔరా! ఈలలితకంఠస్వరులు స్వరూపసంప
దచేతను వీణానినదమాధుర్యముచేతను నిజకోకిలకంఠస్వరములచేతను
మానవమానసములనేకాక తిర్యగ్జంతుహృదయములఁగూడ మోహపర
వశముల్గనుగా జేయుచున్నవారలు అనిప్రశంసించుచు గానాంతమున
మునులు వారలదీవించి ముద్దులిడి సంతోషముతో నొకముని కమండ
లువును వేఱొకతాపసి వల్కలములను ఇకనొకజడదారి జన్నిదమును
మఱియొకసంయమి కృష్ణాజినమును ఇకనొక్కకావిగట్టు మొలనూలును
ఇట్లువారివారికింపగు వస్తువులనొసంగిగారవించిరి.

క్రమముగా నామైథిలీసుతులు వాల్మీకియాజ్ఞపైని ఆరామాయ
ణమును జానపదసంఘముల, ముంగలను నాగరజనసమూహముల
మ్రోలను స్త్రీసమాజములయెదుటను గానముసేయ మొదలిడిరి ఆకుశ
లవులొకనా డుత్తరకోసలదేశరాజధానియగు సాకేతనగరమున రాజవీ
ధిని సీతాచరితమునుగానమొనర్చుచు దిరుగఁజొచ్చిరి. అపుడాహృద
యావర్జకమగు జనకజాకుమారగానము చెవినిఁబడినతోడనే అయో
ధ్యాపురజనులు నిజకృత్యములప్రైపరిత్యజించి స్త్రీబాలవృద్ధము గుం
పులుగుంపులుగాఁజేరి యాగానమును వినఁదొడంగిరి.

భరతాగ్రజుఁడగు రాముఁడామనోహరసంగీతనాదముు రాజ
మందిరములోనుండి యాకర్ణించి, లక్ష్మణునిబంపి, యాసోదరగాయకుల
నిజసభామందిరములోనికిరప్పించి మణిమయకాంచనాసనములనొసంగి
యాదరించి, బంధుమిత్రామాత్యాదులు పరివేష్టింపఁగొలువుదీర్చి నీలో

త్పలదళశ్యామసుందరులగు నాచిన్నియన్నదమ్ముల సోయగమునకు లోసంతసించి, నిజానుజులకు నాయములరూప సంపదనుఁజూపి యిట్లు పలికెను.

శ్రీరాముఁడు—ప్రియసోదరులారా! సుందరాకారులగు నీకవలు తమకంఠస్వరముల వీణానాదములతోఁ జొనిపి పాడుచున్న యీమనోహర కావ్యగానము నామానసమును సంమోహింపఁజేయుచున్నది కావున ఈబాలురబాగుగా గానమొనర్ప నేర్పాటుచేయుడు. అనభరతుఁడు; మునిబాలకులారా! మొదటినుండియు మీనేర్చినగేయమును గానమొనర్పుడు ఈకోసలసార్వభౌముఁడు మీపాటనుసావకాశముగా వినఁగుతూహలియై యున్నవాఁడు అని తెలుపఁ, కుశలవులు వీణలశ్రుతి చేసి శ్రోత్రానందజనకముగా రామాయణమును గానమొనర్పమొదలిడిరి. ఆగానమునువినుచున్న సభాసదులెల్లరు చిత్రార్పితరూపములవలె నిశ్చలులై యాకర్ణింపఁదొడగిరి.

సభాస్తారులట్లగుటలో వింతయేమున్నది. ఇప్పటిదికాక యుగాంతరములజరిగినదైనను, కవిదివ్యజ్ఞానసంపన్నుఁడుకాక, యేకతిపయపదవేదియొ యగుసామాన్యుఁడైనను వాణిపావనగైర్వాణికాక, యేకోయభాషయైనను, గాయకులుకింనరకంఠులుకాక యేమోటుపాటకాండ్రైనను, శ్రుతివీణకాక యేతోలుతిత్తియైనను గానస్థలిమహారాజమందిరముకాక యేరచ్చచావిడియైనను, శ్రీరామకథ, వినునపుడు జనసమూహముల నానందపరవశములనుగాఁజేయుచుండ, ఆత్రేతాయుగమున శ్రీరామచంద్రసభామంటపమున వాల్మీకిమునిచే గ్రొత్తగావిరచింపబడి, విపంచీశ్రుతితోఁగూడి, కుశలురగు కుశలవులచేగానమొనర్పఁబడుచున్న రామచరితము సాకేతవాసుల నిశ్చేష్టులనుగాఁజేసియుండదా? అట్లుభరతునిచే నియుక్తులై కుశలవులిట్లు రామకథను బాడమొదలిడిరి

## దశమాధ్యాయము.

### —♦ కుశలవగానము ♦—

శ్రీమంతంబగు నార్యావర్తంబున మధురపావనజలపూరితము లయిన సరయూనదీప్రవాహములతోడను సర్వసస్యశోభితములైన

కేదారనివహరములతోడను, వివిధరుచ్య ఫలభాసుందరములయిన రమ్యోద్యానవనములతోడను సంపన్నజనపూర్ణగ్రామసముదాయముల తోడను, విరాజితమై ఉత్తరకోసలమనుజనపదము త్తరదిశకలంకార ముగా వెలయుచున్నయది.

నిస్తులానందరంజితమగు నాదేశమునకు మనురాజేంద్రునిచే నిర్మితమై, పండ్రెండుయోజనములుపొడవును మూడుయోజనములువెడల్పునుగలిగి అయోధ్యయను పట్టణము రాజధానియై తనరారుచున్నయది ఆపురవీధులన్నియు విశాలములై తిన్నగాఁగనుపట్టుచుండును. వానికిరుప్రక్కల మిన్నొరయు మేడలవరుసలు మూసనుఁబోసి యచ్చుదీసినటుల యొక్కపోలికతోఁ గానవచ్చుచుండును. ఇరుకులేక విడివిడి గఁగట్టఁబడిన యాపణపంక్తులతోఁగూడి విపణిమార్గములు సకలవస్తు రత్నసంపూర్ణములై చూపుల నాకర్షించుచుండును ఆనగరరాజవీధి యతివిశాలమై వంకరలేక యాతాయాతజనసంఘములతో నిండినడువ నశక్యమైయుండును. ఆరాజమార్గము పొడుగునఁ బరాగపటలము పైకెగురకుండ పన్నీటితోఁదడుపఁబడి, సుమమాలికాచ్ఛాదితమై తెల్లగాఁదారాపథమువలెఁ గనుపట్టుచుండును.

మఱియు నాపురముననొకదిశను యజ్ఞశాలలనుండి వెలువడు ధూమమును, వేఱొకదిక్కున యంత్రాగారములనుండి వెలికివచ్చు పొగయు నేకమైఘనశ్రేణులతోఁగలయఁ బైకేగుచుండును. ఆనగర రాజమార్గపువెలయు లలితకళామందిరముల సంపదలనవలోకించునపుడు చూపరులు తామేదేవేంద్రాది దివ్యభవనములలోనో యున్నయటుల భావింతురేకాని భువమునఁదిరుగుచున్నటులఁదలంపరు.

ఆరాజధానియందుగల యదృశవిశేషమేమన నచ్చటి కలా శాలలయందుఁ జదువుకొనువిద్యార్థులకు నివసించనముదక్క భోజన వేతనాది వ్యయములతో నిమిత్తములేదు. వానినన్నిటిఁ గోసలాధిపతియే కనిపెట్టుచుండును. ఆసాకేతనగరమున నిర్మితములైన నాటకసౌధముల కేగి వానియందుఁ గుశీలవులచేఁ బ్రదర్శింపఁబడు నిజదేశరూపకముల నీక్షించునపుడు సభ్యులు తామాగాథలు జరిగినసమయమున నాయా

పాత్రలతోఁగలసి యున్నటులనే తలంతురు కాని నాటకముల నవలో
కించుచున్నటులఁ దెలియఁజాలరు. పరదేశములనుండి యయోధ్యాపట్ట
ణమునకు వచ్చు యాత్రికులకు మర్యాదలతో సకలసౌకర్యముల సమ
కూర్చు ధర్మప్రాసాదము లెన్నియో యానగరమునఁ గలవు. మఱియు
నాపురమునఁ గాపురముండు ప్రతిగృహమేధియు నతిథుల దైవతముల
వలె భక్తితోఁ బూజింపనెంచువాఁడె, అపుటభేదనమున వంటపూటి
యిల్లు కంటికగుపడదు. ఎంత వెదకినను ఇతరపట్టణములయందువలె నా
నిగమమునఁ గంచుకాగడాలు వేసి వెతకినను వంచకుఁడు కానరాడు. సృష్టి
యందుఁగల పదార్థములన్నిటి నాపీటఁ జూడవచ్చును కాని యస
త్యము జాడమాత్రము కానరాదు. ఆపురనారీమణుల సౌభాగ్యసంప
దలఁ దిలకించి సురకాంతలు స్వర్గముఁ దిసి సాకేతమునఁ గాపురముండ
గోరుచుందురు. నిజమారయ నయోధ్యాపట్టణమును జూచినపిదప దేవ
రాజధానియగు నమరావతీపట్టణము నిర్మింపఁబడినదియో లేక సుపర్వ
పురమును జూచినపిమ్మటఁ సాకేతనగరము కట్టఁబడినదియో తెలియదు

ఇటుల సకలసంపదలతోఁ దులదూగు నాసాకేతనగరమున శౌ
ర్యౌదార్యాది గుణకలితుఁడగు దశరథుఁడను నృపాలుఁడు ధర్మకంచుక
ధారియై న్యాయఖడ్గముచేఁబూని ప్రజలఁ బాలించుచుండెను. ఆరవివంశ
శేఖరుని పాలనమున మంత్రులు మొదలు సేవకులవఱకునుగల రాజో
ద్యోగులందఱు ప్రజాసేవాపరాయణులై నిజపాలకయశమునకై స్వప్రా
ణములఁగూడ సమర్పింపఁ జూచుచుందురు. ప్రజలన్నినో రాజశాసన
ముల కడుగుదాటక భయభక్తులతో సంచరించుచుందురు. ఇట్లు దశర
థుఁడసమాన యశోవిరాజితుఁడై కోసలదేశమును చక్కఁగాఁ బాలించు
చుండెను.

ఒకనాఁడా కోసలరాజమౌళి మృగయావినోదాభిలాషియై పరి
వారజనము వెంటరానడవికేగి ధనుర్బాణములఁజేకొని మృగములసంహ
రించి శిబిరమునకు మరలివచ్చుచు నెదుటనొక యాసలేడికానరా దానిం
గొట్ట వింటనలుగునుదొడిగి యాతురంగిపైకేగ నామృగి రెండవ దండ

ధరునివలెఁ దనవైపువచ్చుచున్న దశరథునీక్షించి, పరువిడఁజాలక మను ష్యవాక్కులతో నిటులఁ పలుకఁదొడఁగెను.

నృపసార్వభౌమా! నన్ను మీనిశితబాణముచే హతమొనర్పకుడు కరుణించి వినుడు నానుడువుల దయామయా! నేను నిన్ననే ప్రసవిం చిన బాలెంతరాలను. ఆకలిబాధచే నీదివసమున నేబచ్చిగరికిపోచలఁ గొరికి తినవచ్చితిని. పాపము నాశిశువులాకటిబాధ కోర్వజాలక పాల కైనేనేగిన దిక్కునకుఁ జూపులఁబరపి, నారాక కెదురుచూచుచుందురు ఆపసికూనలు లేతగడ్డిపరికలఁగూడఁ గొరకనేరవుసరికదా! మీయట్టి కృపాళువులు జాలిగొని మృదులతృణలవకబలముల నోటికందించినను తిననెరుగవు. కావున, నేనేగి వానికిబాలిచ్చి యాకలితీర్చి మీసన్నిధికిఁ దిరుగవత్తును. అప్పుడుమీరునన్ను మీయిష్టానుసారము చేయవచ్చును నన్నువిడుచుట మీకంగీకారముకాదేని, మీకు కావలసినది మాంసము కనుక నాపొదుగుతక్క తక్కినదేహమునుండి యామిషమునంతను జే కొని, ననువిడువుడు నేఁబోయి యాలేకూనలకుఁ బాలనిచ్చి ప్రాణముల విడుతును.

రాజేంద్రా! సంతానముఁగన్నవారు నిజసంతతి సంరక్షణమున కెంత శ్రమచెందుదురో యెంతపరితపింతురో యాసంగతిని సంతానహీ నులగుజీవులు తెలిసికొనఁజాలరు. దయానిధీ! బిడ్డలఁగన్నవారి దారుల కును సంతతిలేనివారి త్రోవలకును బోలికయేకుదురదు, ఆరెంటికిని కరి కరమునకును, దోమతొండమునకు నున్నంతభేదముండును. తనయులఁ గన్నవారి మానసములు నవనీతకోమలములై యలరుచుండును. సుతులు లేనివారి హృదయములు పాషాణాతికఠినములై దనరుచుండును. మహా రాజా! ఈలోకమునఁగల చేతనజాలమంతయు సంతానతంతువులచే నం టఁగట్టఁబడియున్నది. అట్టిసంతతిపాశమే లేకున్న యెవరికివారేకాని యొకరికొకరు కానేరరు.

కావున భూపవరేణ్యా! నాపలుకులకుఁ గినియక నాపై దయ యుంచి, నన్నుఁ బ్రస్తుతమువిడిచి, కల్హార నాళాబకములఁ గాంచుభా గ్యము నాకు సమకూర్పుడు. అని కన్నీరుపిడుచుచు తనయెదుట నిలచి

యున్న యాలేడినిమాచుటచేఁ జాలియుఁ దాని మానవాలాపముల వినుటచే విస్మయమును నిజమానసమున నంకురింప దశరథుఁడా హరిణకాంతనుజూచి యిట్లుపలికెను.

దశరథుడు:—ఓకురంగీ! నీకభయమొసంగితిని నీవిట్లు మానుషభాషతో మాటలాడుట యెట్లు సంప్రాప్తమాయె? నీవృత్తాంతమెయ్యది? అన నాయాడలేడి భయమువీడి, యిట్లు బదులుపలికెను.

లేడి:—రాజేంద్రా! వినుము నాదీనోదంతము వివరింతును. కృపాళూ! నేఁదొలిజన్మమున నుజ్జయినిని నివసించు తారయను వేశ్యను. నేనాజన్మమున స్తంభుఁడను విప్రకుమారుని మోసగించి, యాతనిసర్వస్వము నపహరించి, కష్టకాలమున నాద్విజోత్తముని నవమానించినందుకుఁ బిమ్మటిజన్మమునఁ గిరాతాంగననై పుట్టితిని.

ఆవిప్రనందనుఁడగు స్తంభుఁడును, రెండవజన్మమునఁ బ్రచేతసునకుఁ గేశవనామమునఁ బుత్రుఁడుగాఁబుట్టి, నిజధర్మములవిడనాడి, క్రూరుఁడై కోయలలోఁగలసి, క్రమముగాఁ బ్రబలుఁడైనన్ను బెండ్లియాడెను నేనాతనివలన సంతానవతినై, యాతనిచే సౌఖ్యముగాఁ బోషింపఁబడుచుంటిని ఇటులుండ నామగఁడొకనాఁడు నన్నుఁబిలిచి, పాపవిభాగమున నాసాహాయ్యమునుగోర నేను వానిమాటలవినక, నిరాకరించితిని. అందుచే నా కేశవుఁడు సంసారవిరక్తుఁడై యెచ్చటికో వెడలిపోయెను.

సంపాదకుఁడును, సాహసికుఁడునునగు నాపతి యేఁగినపిదప నా కోడండ్రును, నానందనులును, నన్నీసడింపఁ దొడంగిరి. అంత నేను వారు నాపైఁజూపు ననాదరముచేఁ బశ్చాత్తప్తనై, పతి యవమానమునకు ఫలము సంప్రాప్తమైనదని తలంచుచు, నాభర్తను వెదకుచు నరణ్యమునఁ గేశవా! కేశవా! యని పిలుచుచుఁ దిరుగ మొదలిడితిని. కాని యావిప్రోత్తముఁడు ఎక్కడను గానరాకుండెను. అటులఁదిరుగుచు నేనొకనాడు వేసవికాలపు వడగాడ్పునకుఁ దాళఁజాలక, యొకచెట్టునీడను జేరి యటనిలచితిని. అపుడా మధ్యాహ్నతీవ్రాతప సమయమున నెఱ్ఱని గిరిరేణుమధ్యమునఁబడి భగ్గుమని కాళ్లుమండుచుండ నందుండి కదుల నేరక దుఃఖపడుచున్న శంఖుఁడను ముసలితపసి దూరమునుండి నన్నుఁ

జూచి "ఓయమ్మా! నన్నీ మండుటిసుకలోనుండి యాచెట్టునీడకు జేర్పుము. నీకమితపుణ్యము చేకూరఁగలదు" అనియఱచెను.

నేనావృద్ధతాపసుని సంతాపమునుజూచి, యాతని యార్తవాదమునకు జాలిచెంది, నేఁదొడిగియున్న పాతచెప్పులఁ జేతఁబట్టికొని యాయాతపతప్తరక్తసైకతదేశమున నిలచియున్న మునికిముందఁ బడునట్లు వడిగా విసరితిని. దైవానుకూల్యముచే నాపాదుకలు మునిచేతికందునట్లు పడినవి.

ఆసంయమీంద్రుఁడా యుపానహములఁ దొడిగికొని, యాసికతాస్థలినుండి నాయొద్దకువచ్చి తోడనే మూర్ఛనొంది నేలఁబడిపోయెను అంత నేనాతనిచేతనున్న సొఱబుఱ్ఱనుజేకొని, తమసానదీజలములఁ గొని తెచ్చి, యామునిపైజల్లి లేజిరుజొంపములఁ జేఁబూని విసరితిని ఆశైత్యోపచారముచే శంఖుఁడు కొంతయలసటతీర నావైపు చూచి మెల్లగా నిట్లుపలికెను.

శంఖుఁడు:—తల్లీ! నీవు నాప్రాణములఁ గాపాడితివి. నీవు నాకాసమయమునఁ బాదుకాదానమొసంగకున్న నేనాకాలినయిసుకలోఁబడి, మాడి మడిసియుందును. అమ్మా! చూడుము. నాయరికాళ్ళెట్లు బొబ్బలెక్కియున్నవియో యని, పాపమాముదుసలి తనపాదతలములఁ జూపెను. నేను మఱ్ఱిపండ్లవంటి యాయెఱ్ఱని వ్రణములఁజూచి, భీతిల్లి వెంటనే యింగుదీతైలమునుదీసి, యాపుండ్లకుఁబట్టించితిని నాసేవకా మునివరుఁడు సంతసించి తిరుగ నిట్లుపలికెను.

శంఖుఁడు:—తల్లిరో! నాపైనీకింత దయవచ్చుటకుఁ గారణమేమి ఓయవ్వా! నీవిట్లొంటరిగా నుంటకు హేతువేమి? నీవృత్తాంతమేమి? అని ప్రశ్నింప నేను నాయప్పటిచరితమును వివరించితిని నాగాథనువిని, ఆ యోగిపుంగవుఁడు యోగదృష్టిచే నాభూతభావిజన్మముల గాథలఁ దెలిసికొని నాకిట్లు బోధించెను.

శంఖుఁడు:—సోదరీ! నీవు పూర్వజన్మమున వేశ్యగానుండి పావనచరితుఁడగు భూసురకుమారు నవమానించుటచే నీజన్మమునఁ గోయపూబోడివై పుట్టి నీభర్తను నిర్లక్ష్యముచేయుటచే, ముందుజన్మమున

న్నాడు లేడివై పుట్టుచున్నవు. ఇపుడు వృద్ధతాపసుఁడనగు నాకుఁ జెప్పవలనొస్వఁగ్రి, కాపాడుటచే మృగీజన్మమునకుఁ బిమ్మట శబరనారీమణివై పుట్టి, బ్రహ్మచారిణివై మునులసేవించి, యాజీవితాంతమున నరరూపుఁడగు శ్రీహరిని దర్శించి, యాపురుషోత్తముని బూజించి, పునరావృత్తిరహితమగు మోక్షమునందఁగలవు ఈజన్మమున నీకునాథుఁడైన కేశవుఁడు లోకవంద్యుం డగు మహర్షిపుంగవుఁడు కాఁబోవుచున్నవాఁడు నీవాతనిఁ జూడఁజాలవు కావున నీవీదినము మొదలు దయాశౌచాదులతోఁ గూడి, కామక్రోధాదులవీడి, శ్రీహరిని ధ్యానించుచు దేహయాత్రను ముగింపుము. నాకృపచే నీకు రాఁబోవు లేడిపుట్టువునందుఁ బూర్వజన్మస్మృతియు, మానుషవాక్కును జేకూరఁగలవు. అనిబోధించి తమసాజలములస్నానమాడి వెడలి పోయెను. ఆపిమ్మట నేనామహర్షి బోధించినరీతిని నాజాతికి సహజమగు జీవహింసాదులవిడనాడి శ్రీకాంతుని స్మరించుచుఁ గిరాతీదేహమును జాలించి ఈహరిణీరూపములోఁ బుట్టితిని. ఆయతివరుని కటాక్షముచే నాకీ మానవవాణియు, గతజన్మస్మృతియు, సమకూరినవి మహారాజా! ఇయ్యది నాజన్మపరంపరావృత్తాంతము అని తెలిపెను.

దశరథుఁడా లేడిమృదువులవిని, తానొనర్చుచున్న జీవహింసకు వగచి, సంతానమునుగూర్చి యాహరిణి పలికిన మనోహరోక్తులచే మనసు కరఁగఁ దనకంతవఱకు సంతతిలేమిస్ఫురణమునకు రాఁగా ఖిన్నుఁడై యాకురంగిని విడచి వ్యాకులచిత్తుఁడై వెంటనే మృగయావిముఖుఁడై యయోధ్యకేతెంచి, ప్రబలమగు సంతతిచింతచే నన్నపానాదులఁ జేకొనక కృశింపఁదొడంగెను.

—: ఏకాదశాధ్యాయము. యాగప్రయత్నము :—

ఇట్లుండ సుమంత్రుఁడొకనాఁడు దశరథమహారాజును సందర్శింపఁగోరి, యారాజేంద్రుని ప్రాసాదమునకేగి, చిక్కి ప్రక్కపైఁ బఱుండియున్న దశరథునిఁ జూచి, చనువుగలవాఁడగుటచే నిట్లు ప్రశ్నించెను. "కోసలరాజేంద్రా! భూలోకమున నిస్సపత్నుఁడవై, నాకలోకమున సురేంద్రాభయప్రదాతవై వెలయుచున్నవాఁడవు నీవిట్లున్నావో నిత్య

మంగళములతోడను పచ్చనితోరణములతోడనుగూడి, సంతోషసాగరమున నోలలాడుచున్న వారలు. సకలసుగుణసంపన్నులును, అసమానపాతివ్రత్యకళాకలితలునగు ముగ్గురు రాణులు సహధర్మచారిణులై సేవించుచుండ సకలక్రతువులొనర్చి, దీనులపాలిటి చింతామణివని ప్రసిద్ధిగాంచియుంటివి. ఇఁకనీకోశములనున్న ధనసంపద, కుబేరునినవనిధులయందుఁగూడ నున్నదియో లేదో. ఇట్లుసకలైశ్వర్యములతోడను సమస్తానందములతోడనుగూడి వెలయుచుండియు నిట్లుకృశించియుండుటకు. గారణమేదియో తెలియవచ్చుటలేదు. సామాన్యముగా నృపాలురఁగృశింపఁజేయు వ్యసనములు నీకు స్వప్నమునందుఁగూడఁ గలుగనేరవుకదా! ఇఁకనీకార్శ్యమునకుఁ గారణమేమి? రాజేంద్రా! ఈకోసలప్రజలు నీదర్శనము లేకుండుటచే బెంగటిల్లుచున్నవారు విధేయులమగు మేమెల్లరమువిూయాజ్ఞల నెరప సంసిద్ధులమైయుండ మీరిట్లుమీయభిమతమేదియో మాకుఁదెలుపక పోవుట ధర్మముకాదు.

దశరథుఁడు:—మిత్రుఁడా! సుమంత్రుఁడా! సంతతిలేనినాడన్ని సంపదలున్ననువ్యర్థములే. వానివలననావంతయు సంతోషముకలుగనేరదు. ప్రియసఖుఁడా! నాకుసంతానముకలుగుభాగ్యములేదు. అందుకనువగు వయసేగి చాలకాలమాయెను. ఇఁకనాకుఁబుత్రులుకలుగుటయెట్లు? ఈసూర్యవంశమభివృద్ధిచెందుటయెట్లు? నామానసమును సంతతిలేదనెడి సంతాపము, బాధించుచుండుటచే నిట్లన్నపానాదులురుచింపక సన్నగిలుచుంటిని. అంతియకాని నీకుఁదెలుపరానిమఱెట్టివ్యసనమును నామానసము నాక్రమించియుండలేదు.

సుమంత్రుఁడు—కోసలరాజవర్యా! మీరుసంతతికై యింతవిచారింపఁబనిలేదు మీకచిరకాలములో లోకకల్యాణముల సమకూర్పసమర్థులును, సౌందర్యజితకందర్పులును, సౌభ్రాత్రకళాకలితులును సకలలోకవిఖ్యాతకీర్తులునగు నలుగురు నందనులు కలుగఁగలరు ఇందుకుసందియములేదు. కావునరాజేంద్రా సంతాపమువీడిసంతోషమును జెందుము

దశరథుఁడు—పిచ్చివాడా! మేఘములులేనిమింటనుండి ఘననీరధారాసంపాతముకలుగునా? పుణ్యహీనులయింటనుండి నందనసంపద

సంభవమగునా? సహృదయులాప్తులఁ దమప్రియవచనములచే సంతాప విరహితులనుగా జేయఁజూతురు ఇదిసన్మైత్రీలక్షణము.

సుమంత్రుఁడు—దశరథసార్వభౌమా! సూర్యవంశ్యపాలితులిచ్ఛకములాడి ప్రభువులమెప్పులఁ బడయఁగోరువారుకారు కోసలరాజ్యమున నచేతనములుగూడ "సత్యంవద,ధర్మంచర" అనిబోధించునుకాని బొంకనేరవు ఇయ్యది ఇనకులరాజ్యవైభవచిహ్నము రాజేంద్రా! వినుడు నేఁదెలుపుసత్యమును.

దశరథుఁడు—ఆప్తుఁడా! శ్రుతిసుఖదమగు నాసువార్తామృతము నాపీనులనింపి నాహృదయతాపమును జల్లార్పుము.

సుమంత్రుఁడు—రాజేంద్రా! వినుఁడు మున్నొకతఱి సనత్కుమారుఁడు మహర్షులతోఁబ్రసంగించుచు మీకు ఋష్యశృంగుని యనుగ్రహముచే నలుగురు లోకోత్తరులగు సుతులుదయింతురని తెలిపియున్నాఁడు నేనాసమయమునసటనుండుటచే నాసువార్తనువింటిని కావున మీకులగురువులగు వసిష్ఠమునీంద్రులతో నాలోచించి, విభండకసుతుని దోడ్కొనివచ్చి 'పుత్రికామేష్టి'గొనర్చి సంతతిసంపద నందగోరుచున్నవాఁడను.

దశరథుఁడాశ్రుతిసుఖదములగు సుమంత్రివచనములనాలించి, వెంటనేవసిష్ఠుని రాఁబిలిపించి యిట్లుప్రార్థింపఁ దొడంగెను.

దశరథుఁడు:—గురుచంద్రా! వసిష్ఠమునీంద్రా! సంతతికై సంతాపమందుచున్న నాకీలోకమంతయు శూన్యముగాఁ గానవచ్చుచున్నయది జాగ్రత్స్వప్నసుషుప్తి సమయములందంతటను పుత్రముఖావలోకనకాంక్షయే కాని వేఱొండుకోరిక కలుగకున్నయది కావున సర్వసమర్థులగుమీరలు నాకుఁ బుత్రప్రాప్తి యెటులకలుగునో యోజింపుఁడు. లేకున్న నేఁబ్రజాహీనుఁడనై కోసలప్రజలఁ బాలింపఁజాలను గురూత్తమా! ఈసుమంత్రుఁడు విభండకనందనుని సాహాయ్యముచే నాకు నలుగురునందను లుదయింతురని యొకయితిహాసమును దెలిపియున్నవాఁడు, మీరు యోగదృష్టిచే నదియెంతవఱకు నిజమోకనుఁగొనుడు.

వసిష్ఠుఁడు:—దశరథక్ష్మాపాలచంద్రా! చింతిల్లకుము. నేనంతయుఁ

తెలిసికొంటిని. మానవమనోరథములీడేరుటకు భగవదనుగ్రహము కూడ తోడ్పడవలయును. ఆదివ్యసాహాయ్యము లేనిచో మానవప్రయత్నము లూషరక్షేత్రోప్త బీజములవలె వ్యర్థములగును కాని ఫలింపనేరవు. కావున నీవు భగవత్ప్రీతికై విధివిధానానుసారము అశ్వమేధయాగమును భక్తిశ్రద్ధలతో నాచరింపుము. ఆయాగాంతమున నీకుఁ జింతితార్థసిద్ధి చేకూరఁగలదు ఈసుమంత్రుఁడు తెలిపినది సత్యము కావున నీవంగదేశమున కేగి, వినయప్రపత్తులతో విభండకసుతునిఁ దోడ్కొనిరమ్ము యాగసంభారముల సమకూర్ప మంత్రుల నాజ్ఞాపింపుము

దశరథుఁడు:—మునీంద్రా! నన్ను నిమిత్తమాత్రునిఁగా నిలువఁబెట్టి మెట్లొనర్చిన నీక్రతువు నిర్విఘ్నముగాను, నిరుపమానముగాను, నెఱవేఱునో యాభారమంతయు మీరే వహింపవలయును సుమంత్రాదిసచివులెల్లరు మీయాజ్ఞలకుబద్ధులై యుందురు నేనిపుడే యంగరాజధానియగు చంపావతీనగరమున కేగి, ఋష్యశృంగమునీంద్రుని శాంతాసహితముగాఁ గొనివత్తును.

వసిష్ఠుఁడు:—రాజేంద్రా! నీవినయమర్యాదలకు సంతసించితిని. అధ్వరకార్యములకనాహూతుఁడైనను నేగవలయునని, శాస్త్రము తెలుపుచున్నది అట్టితఱినిట్లు నీచే ప్రార్థితుఁడనైన నాకుఁ గ్రతుకార్యముల సాహాయ్యపడుట విధియైయున్నది. కావున నీవుఋష్యశృంగునిఁ దోడ్కొనివచ్చినతోడనే, నాకుఁగబురంపుము నేఁదిరుగవత్తును. నీకుసుపుత్రప్రాప్తియగుగాక! అనివెడలిపోయెను.

దశరథుఁడు వెంటనేయంగదేశమున కేగి, ఋష్యశృంగుని భార్యాసహితముగా సమాధ్యకుఁజేసికొనివచ్చిపూజించి, నిజమందిరమునవసింపఁజేసి యామహర్షికడసెలవుగైకొని వసిష్ఠునియొద్దకేగి, శాంతాపతి రాకనెఱింగింప, నాయరుంధతీకాంతుఁడు దశరథునితో సాకేతమునకు వచ్చి సుమంత్రునిఁబిలిపించి యిట్లుపలికెను.

వసిష్ఠుఁడు:—మంత్రిపుంగవా! మనకోసలసార్వభౌముఁడొనర్చు నశ్వమేధమునకు భూవలయమునఁగల చక్రవర్తులనందఱిని గౌరవపురస్సరముగాఁ బిలిపింపుము. నీవుస్వయముగా మిథిలాధిపతియగు జనక

రాజేంద్రుని నాహ్వానింపుము. మునుదా రాజచంద్రునితో సీతయజనంద నునకు బంధుసంబంధమేర్పడనున్నయది అని తెలుప సుమంత్రుఁడావసిష్ఠశాసనమును శిరమునదాల్చి వెడలిపోయెను. వసిష్ఠుఁడు సాయంసంధ్యావందనాకాంక్షుఁడై దశరథునివీడి, సరయూనదీతీరమున కేగెను. దశరథుఁడును ఈసువార్తను నిజకాంతలకుఁ దెలుప నంతఃపురమునకుఁ జనెను.

ఇటులుండ గ్రీష్మతాపముచేఁ బీడితులగు పాంథులు ఛాయావహీరుహమూలము నాశ్రయించునట్లు రావణప్రతాపానలముచేఁ బరితపించుచున్న దేవతలు క్షీరోదధితీరమున చేరి వినమ్రమౌళులై కరపుటములసంఘటించి ఇట్లుప్రార్థింపఁదొడంగిరి.

దేవతలు:—ఓక్షీరసాగరశయనా! నీరజనయనా! అవాఙ్మానసగోచరమగు నీమహిమమును మేమెట్లు తెలిసికొనఁగలము. నీవుభక్తవత్సలుఁడవగుటచేఁ దివ్యమూర్తిరూపము లఁదాల్చి, సృష్టిస్థితిలయశక్తులతోఁగూడి ప్రత్యక్షమగుచుందువు. లేకున్న నిన్ను ధ్యానించుటయెట్లు? సగుణములగు పాంచభౌతికపదార్థములను మాత్రమే తెలిసికొన సమర్థములగు నింద్రియములు నిర్గుణుఁడవును నిరూపుఁడవును నగునిన్నెట్లు గుర్తింపఁగలవు?

ఓకరుణాసాగరా! నీవుకర్తవగుటకుఁగారణము నిజభక్తత్రాణాపేక్షయే అంతియుకాని నిరీహుఁడవగునీకుఁగావలసినదేదియున్నది ? సుధామయునిచంద్రికకు శైత్యముగుణమైనటుల, దయామయుఁడవగు నీకృపకు దీనావనములక్షణము. లోకమునఁ గలసమస్తమతములును నిన్నుఁజేరి యానందించుటకు వేఱువేఱుమార్గములఁ జూపుచున్నయవి. యాత్రోవలన్నియు వివిధమార్గములనేగు నదీప్రవాహములు సాగరమునఁగలియునట్లు నీయందేలయమగుచున్నయవి. విరాగులగుయోగులు సంతతాభ్యాసనిరుద్ధవృత్తిగల మానసములతో నానందస్వరూపుఁడవై హృత్పుండరీకకర్ణికాంతరమున వెలుగుచున్ననిన్ను గాంచుచున్నవారు. సరాగులగుసంసారులు నీయవతారరూపముల కాలయముల నిర్మించి, నీప్రతిమల గంధపుష్పాదులచే నర్చించుచున్నవారు ఇవెవ్వ

యు నెరపఁజాలనిపామరజనులు నీపావననామముల స్మరించుచున్నవారు. నీవువారివారియోగ్యతకుఁ దగినరీతిని వివేకసంపదలనొసంగి, కాపాడుచున్నవాఁడవు.

ఓజగద్రక్షకా! మేమాపన్నులమై నీపాదారవిందములకు మ్రొక్కులిడి మాయాపదలఁ బాపికొనవచ్చితిమి. కావున నోకృపాసాగరా! లెమ్ము శేషతల్పమునుండి రమ్ము మముఁ బాలింప ఆలింపుమీనిలింపుల మొఱల ఓచక్రాయుధా! రావణకుంభకర్ణాదిదైత్యవీరులు మహాబలగర్వితులై, దయాదాక్షిణ్యములఁ బాటింపక, విచ్చలవిడిగాసంచరించుచు జీవకోటుల హింసించుచున్నవారు. వారినరికట్టువారుచూపట్టరు. వారికి లోఁబడనివారు కానరారు.

ఓపురుషోత్తమా! నీచుఁడగురావణుఁడు సజ్జనులసంహరించుచు సతీమతల్లులఁ జెఱఁగొనుచు, మునివరులబాధించుచు, ముల్లోకముల నొక్కరీతిని వేధించుచున్నవాఁడు.

ఆనిశాచరుఁడు మమ్ముఁగింకరులనుగాఁ జేసికొని మాచేసేవలనందికొనుచున్నవాఁడు. మాకాంతలఁగొంపోయి వారిచేదనయింట నూడిగములఁ జేయించుచున్నాఁడు. ఇట్లుస్త్రీపురుషాదులమందరము నాత్మగౌరవముల విడనాడి, వానికడదాస్యములఁ జేయుచున్నను ఆయవ్యవస్థితచిత్తుఁడు మదిరామాంసాదులమెక్కి మత్తెక్కి మమ్ము బాధించుచున్నవాఁడు మాయవస్థలిట్లున్నయవి

ఇదివఱకు సురసార్వభౌముఁడై సౌఖ్యమేకాని కష్టమన్న నెట్టిదియో కలనైనఁగాంచియెఱుంగని త్రిదివచక్రవర్తియగు నీయుపేంద్రాగ్రజుఁడు చెందుచున్నయవమానపరంపరలకుదరిలేదు. వియల్లోకనందనోద్యానావని రావణునకు పానకేళీవిలాసనిలయమైనది. తఱచువాడటకువచ్చి చేయునభాగ్యచేష్టలఁ దలంపసిగ్గగుచున్నది. దివ్యలోకవాసులగతియేయిట్లుండ భూలోకనివాసులమాటచెప్పనేల? పరాత్పరా! పలుబాసలేల? యాకసమునసంచరించు చంద్రసూర్యులుగూడ వానియిచ్చవొప్పున వచ్చుచుఁబోవుచు నుండవలయునేకాని కాలానుసారముగా నుదయాస్తమయముల నందవలనుకాదు. భూమిపైనుండు నగసముద్రా

దులు నిలకడగానొక్కచోటనుండవలనుకాదు. వానియూహానుగనిపెట్టి తాలుమాలగుచుండవలయును. ఇట్లుప్రకృతికూడ వానికిగడగడ లాడుచున్నయది. ఓకృపాజలనిధీ! ఇట్లెంతకాలము మమ్మువానిక్రూరపాలనమున నుంపఁదలంచితివి? ఓదీనావనా! యనన్యగతికులమై నీపాదసరసీరుహములపైఁబడి ప్రార్థించుచున్నమమ్ముఁ గాపాడఁప్రార్థించుచున్నారము సర్వజ్ఞుఁడవగు నీకుమేము మాకష్టములఁదెలుపవలెనా? ఐనను పురుషకారముఁజూపకున్న నీకుదయకలుగనేరదేమో యనుభావముచే నిటకుఁబ్రార్థింప వచ్చితిమి.

భక్తవరదా! మున్నునీవు వామనరూపుఁడవై యదితికశ్యపులకుఁ బుట్టినపుడు నిన్నుగన్న యదితి నీమోహనవామనరూపమును వీడఁజాలక, నిన్నావటురూపముతో గొంతకాలమాపెయొద్ద నుండఁగోరెను. అంత నీవాసాధ్వీమణితో "ముందుజన్మమున నీకునందనుఁడనుగాఁబుట్టి నీసంతోషమీడేర్తునంటివి" అపుడచ్చటనేయున్న యదితి సవతులగు కద్రూవినతలుకూడ నవనతవదనలై నిన్నుఁబుత్రునిగాఁబ్రార్థింప, భక్తపరాధీనుఁడవగునీవు వారిమనోరథములఁగూడ నీడేర్తునని వరములనొసంగి యంతర్ధానమైతివి.

ఇపుడాకశ్యపుఁడు భూతలమున సూర్యవంశమునందు దశరథుఁడనుపేరితోఁ బుట్టియున్నవాడు. ఆయదితీ కద్రూవినతలు కౌసల్యాకైకేయీసుమిత్రా నామములతోజన్మించి, యాదశరథనృపాలునకు రాణులై, నీరాకకెదురుచూచుచున్నవారలు. కావున కామితార్థప్రదుఁడవగునీవు వారికినందనుఁడవైపుట్టి యాసతీమణుల మనోరథముల నీడేర్చి, రాక్షససంహారమొనర్చి, నీకరుణావలోకనకాంతులచే నిశాచరబాధాతిమిరమునుండి లోకములనుద్ధరింపుము. అనియిట్లు పరీతాపపక్వమానసులై దేవతలుప్రార్థింప ఆనవనీతకోమలస్వభావుఁడగు శ్రీహరి దీనాతిదీనులై సాలకడలిదరిని నిలిచియున్న సురలనవలోకించి, నీలేంద్రమణిపర్వతతటమునఁ బ్రకాశించుచంద్రికవలె నీలనీరదసుందరమగు నిజవదనమండలమునఁ జిరునగవువెలయ ఆమాధవుఁడు సుధామధుర

ధారాసముల గు వాక్కుల నాక్షీరసాగరతరంగమధ్యమునుండి ప్రతి ధ్వనింపఁజేయుచు నిట్లుపలికెను.

విబుధవరులారా! భయమందకుఁడు పాపాత్ముఁడగు నారాత్రిం చరరాజును సపరివారముగాసంహరించి, లోకములకు సౌఖ్యములసమ కూర్తును. నేనిదె మానవలోకమున భానుకులాలంకారుఁడగు దశరధ భూపాలునిరాణులగర్భములందుఁ జతుర్విధనరరూపములతో జన్మింపఁ బోవుచున్న వాడను. మీరును నాకుసహాయులుగ వానరరూపములతో భూమియందవతరింపుఁడు. అని యానిగమాంతవిహారి యంతర్ధాన మయ్యెను. అంత నాసుపర్వులు ఆమురహరిగిరములవిని యలరి దశర ధుఁడుచేయు నశ్వమేధమునకు వెడలిపోయిరి.

## —' ద్వాదశాధ్యాయము :—

## కుమారజననము.

అంత సకలజంతుసంతతిసంతసజనకమగు వసంతసమయమురాఁగా నటసరయూనదికుత్తరతటమున నిర్మితమైన యజ్ఞవాటికయందు వసిష్ఠము నీంద్రుఁడు దశరధరాజేంద్రునిచే నశ్వమేధసంకల్పముఁ జేయించెను.

పాపహనోదకములగు నాక్రతుకలాపములఁజూచుటకు నన్నిది క్కులనుండియుఁ జాతుర్వర్ణ్యసంజాతులగునార్యులు సాకేతమునకువచ్చి దశరధునిచేనాదరింపఁబడి యాగవిధానముల సావధానముగాఁ దిలకించు చుండిరి. ఆక్రతుదివసములయందు ఆమ్నాయసారవిదులగు ఋత్విజులు సామగానమొనర్చి దేవతలనాహ్వానింప దివ్యతేజోమండలభాసితులగు విష్ణ్వాదిదేవతలు యజ్ఞవాటికలోనికవతరించి స్వయముగా నిజభాగము లఁ జేకొనుచుండిరి.

ఇఁక నాయజ్ఞసమయమున జరిగినమహోత్సవములకు మితిగానరా కుండెను. అట్టిమహాధ్వరము నెన్నడు నేచక్రవర్తియుఁ జేయ లేదని దేవతలే స్తుతింపఁదొడంగిరి. ఆయాగముముగిసినతోడనే దశరధుఁడు కోసలరాజ్య మును కొన్నిభాగములుగఁజేసి ఋత్విక్కులకు దక్షిణగానొసంగఁబోవ నిరీహులగునాయాజకులు వదాన్యుడగునాదశరధునితో నిట్లు తెలిపిరి. "దశరధసార్వభౌమా! ఈకోసలరాజ్యసీమను నీవుపాలించుచుండుటచే

సిరికాటపట్టై సౌఖ్యములకునికిపట్టై వెలయుచున్నయది. ఈరీతిని ధరాత్రయమును బాలింపనీవేసమర్థుఁడవు రాజేంద్రా! మాకీరాజ్యమువలను. దక్షిణలియ్యకున్న క్రతుఫలము సమకూరనేరదు కావునఁ గొంచెముధన మొసంగి యాగఫలమందుకొనుము దశరథుఁడువీతరాగులగు ఋత్విక్కులమాటలాలించి వారికమితధనమునొసంగి సత్కరించెను.

ఆయశ్వమేధాంతమున దశరథుఁడు వసిష్ఠానుజ్ఞాతుఁడై ఋష్యశృంగునిట్లుప్రార్థించెను. "శాంతావల్లభా! మాసూర్యవంశనందనమున నందన మాదారములుదయించుటకై నాచేఁబుత్రేష్టినిఁ జేయింపఁబ్రార్థించుచున్నాఁడను. విభాండకసుతుఁడాదశరథోక్తులనాలించి కనులుమూసి క్షణకాలముధ్యానించి యిట్లుపలికెను.

ఋష్యశృంగ:—దశరథరాజేంద్రా! భానుకులదీపకులగు నలుగురునందనులు నీకుకలుగుదురు అని తెలిపి పుత్రకామేష్టిని బ్రారంభింపఁజేసి అగ్నియందాజ్యహోమములఁజేయ తూర్పుసముద్రమునుండి బాలసూర్యునిపగిది యాయగ్నికుండమునుండి ప్రాజాపత్యపురుషుఁడు పైకివచ్చి దశరథునిఁజూచి యిట్లుతెలిపెను.

ప్రాజాపత్య:—కోసలేంద్రా! భక్తిశ్రద్ధలతో నీవొనర్చిన యాగమునకుఁ బరమేశ్వరుఁడు సంతసించి నీకుసంతానముకలుగుటకీదివ్యపాయసమును నాచేఁబంపినాఁడు. కావున సుపుత్రప్రదమగు నీసువర్ణపాత్రమునను న్న చరువుఁజేకొని నీరాణులకొసంగుము. అని ఆపాయసపాత్రమునొసంగ నానరేంద్రుఁడు నమస్కారపూర్వకముగా నాపాయసభాజనమును జేకొనెను. తోడనేయజ్ఞపురుషుఁడంతర్థానమాయెను.

అంతనాదశరథుఁడు పరమాన్నప్రాప్తిచేఁ బరమానందభరితుఁడై వసిష్ఠర్ష్యశృంగులయనుమతిని ఆపాత్రమును భార్యలకొసంగనేగుచు నిట్లువితర్కించెను "సుమంత్రుఁడులోనగువారు నాకునలుగురుపుత్త్రులు కలుగుదురని తెలిపియున్నారు. ఈపాయసభక్షణమునఁగదా సంతతికలుగుట దీనిమూఁడుగాఁజేసి నాపత్నులకిచ్చినచో ముగ్గురుపుట్టుదురుగాని నలుగురెట్లుకలుగుదురు. ఇఁకనీచరువును నాల్గుభాగములుగాఁజేసి యిద్దఱికినొక్కొకభాగమునుమిగిలినరెండుభాగములు వేఱొక్కతెకునునిచ్చిన

మొదటివారికిఁ గోర్కెసుతుఁడును మూఁడవయామెకిద్దఱు నందనులుఁ బుట్టుదురు.

కాని యట్లు హెచ్చుతగ్గుగాఁ బాయసము నొసంగినచోఁ గుమారులుపుట్టుటకుముందు గృహకలహములుదయింపవచ్చును. కావున నేనీ పాయసము రెండుగాభాగించి కౌసల్యా కైకేయులకిచ్చెదను వారిరువురును సుమిత్రకుఁ దమభాగములలోనుండి కొంతభాగముతీసి తప్పకయొసంగుదురు ఇట్లుచేసిన సుతోత్పత్తియు సంతోషప్రాప్తియు సమకూరఁగలవు. అనినిశ్చయించుకొని రాణులకడ కేగెను.

పాయససంప్రాప్తి సువార్తనువిని దానికై యెదురుచూచుచున్న యాకాంతలుముగ్వురు దశరథున కెదురేగి నమస్కరింప నాతఁడు పాయసప్రభావమును వారికెఱింగించి సగముపాయసమును కౌసల్యకును మిగిలినసగపాలు కైకేయికినొసంగెను ఆరాణులిరువురు తమనాథుఁడొసంగిన పాయసభాగముల సంతోషముతో నందికొని ఇంగితజ్ఞలగుటచేఁ దమభాగములలోనుండి సగముపాలుసుమిత్రకు మైత్రితో నొసంగిరి. సుమిత్ర వారొసంగిన పాయసభాగములరెంటిని జేకొనెను. అంతనారాజకాంతలు ముగ్గురునుశ్రీహరినిస్మరించుచు నాపరమాన్నమును భక్షించిగర్భవతులైరి.

దశరథపత్నులు సీమంతాదిసంస్కారకలితలై నెలలునిండి పండ్రెండవనెలప్రవేశింపఁ త్రేతాయుగమున విళంబినామసంవత్సర చైత్రశుద్ధనవమీబుధవారమునఁ బునర్వసూనక్షత్రయుక్త కర్కటలగ్నమందు మధ్యాహ్నసమయమున సర్వగ్రహానుకూలమగు సుముహూర్తమున శ్రీహరి కౌసల్యాగర్భమునసర్భకుఁడై జనించెను. దయామయుఁడగు నారమాపతి పుట్టినంతఁ గౌసల్యకు దివ్యదృష్టినొసంగి నిజరూపముతో దర్శనమొసంగెను.

ఆపుణ్యాత్మురాలు నీలేందీవరశ్యామసుందరమును, పీతాంబరచ్ఛాయావిభాసితమును, సరసిజారుణనేత్రశోభాకలితమును, నవరత్నకుండలమండిత గండభాగవిలసితమును, శంఖచక్రగదావనమాలా విభూషిత చతుర్భుజవిరాజితమును, స్మితసుందరవదనారవిందశోభితమును, కో

టిసూర్యప్రభాభాసమానమునగు నాదివ్యరూపమును జూచి నిశ్చేష్టయై నిలిచి పిమ్మట నిట్లు స్తుతింపఁదొడఁగెను.

కౌసల్య:—ఓసచ్చిదానందస్వరూపా! నీమహిమముల నిగమాంతములే వర్ణింపనేరకున్నయపుడు నాయట్టియబల యేపాటిది? ఓప్రపన్నార్తిహరా! నీకు భక్తులయెడ నెంతవాత్సల్యముకలదో నేడు తెలిసికొంటిని. మున్నెన్నఁడో నేఁగోరినవరమును జ్ఞాపకముంచుకొని నేడు నాకడుపున పుత్త్రుఁడవై పుట్టితివి. ఇయ్యది వాత్సల్యలక్షణముకాదా? ఓపతితపావనా! సంసారసాగరమగ్నయై పతిసుతాదులయందు మమతచెంది యీర్ష్యాసూయాదులచే నితరులహింసించుచు సంచరించు సామాన్యబుద్ధి కలదానినిగాఁ జేయక సదాసుధాసమమగు నీపాదారవిందభక్తి మధుపానమత్తచిత్తనై విహరించు వివేకముకలదానినిగాఁ జేయుము. ఓయఖండతేజస్స్వరూపా! నేనిఁక నీదివ్యతేజమును జూడఁజాల. ఇంతటితో నీదివ్యరూపమును జాలించి ప్రాకృతశిశురూపుఁడవై నీబాలలీలలచే నాముద్దుముచ్చటలఁదీర్పఁగోరుచున్నదానను. ఓకరుణానిధీ! నీనడకల సోయగమునుఁజూచుటకును, నీబాలభాషితముల నాలించుటకును, నీనీలాలకముల దిద్దుటకును నీలేబుగ్గలముద్దిడుటకును, బాలిచ్చి నిన్ను జోకొట్టుటకును, నాహృదయము వేగిరపడుచున్నయది, ఈదివ్యప్రభారూపమును జూడఁజాలకున్నయది కావున నన్నుఁదల్లినిగాను నిన్నుఁ దనయునిగాను మార్చి నరనాటకసూత్రధారివై నామనోరథమీడేర్పుము అని యిటుల నాకౌసల్య ప్రార్థింప అనంతరూపుఁడగు నాపరమపురుషుఁడు కౌసల్యకుఁ బ్రాకృతదృష్టినొసంగి తనదివ్యరూపమును జాలించి మానవడింభరూపుఁడై పురిటింటఁగారుకారుమని యేడ్వదొడంగెను. కౌసల్యయు ప్రాకృతచిత్తయై యాశిశురోదనమును విని యానందపరవశయయ్యెను.

"ఆహా! అమేయశక్తిసంపన్నుఁడును, దిక్కాలాద్యనవచ్ఛిన్నుఁడును, నిర్వికారుఁడును నగుపరాత్పరుఁడు పరిమితదేశమగు సూతికాగృహమున మానవశిశురూపుఁడై రోదనముచేయుట భక్తవాత్సల్యము కాకమఱేమి యున్నది? తల్లులు సామాన్యముగాఁ బుత్త్రులుదయిం

చుటకెన్నియో పుణ్యములఁజేసి యుండవలయును. ఇఁకనిట్టి దివ్యకుమారులఁగనుటకు వారిపుణ్యము లెంతలై యుండవలెనో తెలుపఁదరమగునా? దీనింబట్టిచూడఁ బుణ్యమునకు సాధ్యముకాని కార్యమేదియును లేదని స్పష్టమగుచున్నయది. సురవందితుఁడగు గోవిందుఁడు మానవస్త్రీకి నందనుఁడై జన్మించునట్లుచేసిన దీ సుకృతముకాదా?"

అట్లుకౌసల్యకు శ్రీహరిపుత్త్రుఁడై పుట్టినపిదపఁ గైకేయి యానాఁడే నవమివెళ్ళిన దశమీఘటికలలోఁ బుష్యమీనక్షత్రయుక్త మీనలగ్నమునందుఁ గుమారునిఁ బ్రసవించెను. అపిమ్మట ఆశ్లేషానక్షత్రయుక్త కర్కటకలగ్నమున సుమిత్ర నిరువురసుతులఁగనెను.

ఇట్లు శ్రీమన్నారాయణుఁడు నిజాంశములచే దశరథమందిరమునఁ జతుర్విధరూపములతో నవతరించినతోడనే దివినుండిదేవతలు దుందుభిధ్వానములుచెలరేఁగ సుమవర్షములఁగురిసిరి. పరిమళభరితములగు చల్లగాలులు మెల్లగాఁబ్రసరించెను. కోకిలాదివిహంగములు చెవులకింపుగాఁ గూసినవి. గోకదంబకములు వత్సలకుఁబాలఁజేపినవి. తరులతాదిభూజములు ఫలకుసుమములతో నిండిపోయినవి. గంగాదినదీనదములు నిర్మలజలప్రవాహములతో నలరారినవి. దిక్కులన్నియుఁ బ్రశాంతములైనవి. ఇట్లు శ్రీహరిజననదివసము చేతనాచేతనవస్తు మోదావహమై వెలసెను.

దశరథుఁడు తనపత్నులుమువ్వురును సుఖముగా సుతులఁ బ్రసవించిరనువార్త విన్నతోడనే పులకితగాత్రుఁడై నేత్రములనుండి యానందాశ్రుబిందువులు జారఁదిన్నగా సూతికాగృహములోనికిఁ బరుగిడి నలుగురుకుమారులఁ గన్నులారఁగాంచి సంతృప్తుఁడై పురిటింటినుండి పైకివచ్చి జాతకర్మలజరిపించి సుస్నాతుఁడై మహావైభవముగాఁ బుత్త్రోత్సవముల నెఱపెను.

ఆనాఁడు కోసలప్రజలసంతోషమునకును, వారొనర్చిన మహోత్సవములకును మేరకానరాదయ్యె. పట్టణమెటుచూచినను నవీనసౌభాగ్యకళాకాంతులతో నలరారఁదొడంగెను. బాలుఁడు మొదలు వృద్ధుఁడు వఱకును గల పురజనులెల్లరును ఆబాలరూపుఁడగు పరాత్పరునిఁజూడ

గుంపులుగుంపులుగా రాఁదొడఁగిరి. ఆశిశురూపములఁజూచి తమకుఁ గన్నులున్నందుకు సార్థకములాయెనని తలంచి యానందించిరి.

దశరథనరపాలుఁడు పురుడువెళ్ళినతోడనే వసిష్ఠమహర్షి నాహ్వానించి నిజసుతులకు నామకరణోత్సవముల జరిపింపుఁడనిప్రార్థింప ఆవసిష్ఠభగవానుఁడు కౌసల్యానందనునకు రాముఁడనియు, కైకేయీసుతునకు భరతుఁడనియు, సుమిత్రాపుత్రులలో పెద్దవానికి లక్ష్మణుడనియు, చిన్నవానికి శత్రుఘ్నుఁడనియునామకరణములఁ జేసెను.

"ఓహో ! కాలత్రయవేదియగు వసిష్ఠమునీంద్రుఁ డేనాఁడు రాముఁడని నామకరణమొనర్చెనో యాదివసముమొదలు నేటివఱకు ఆపావననామము శ్రీదమై, సుఖదమై, దుఃఖనుదమై, కలుషహరమై, ప్రణవస్వరూపమై, సకలలోకళ్యాణ సంధాయకమై, భక్తజనమనోరథ సంధాన సంతానకమై, క్రూరదానవకులాటవీ దావానలమై, సతీజన మానసతాపనివారక మలయానిలమై భూమ్యంతరిక్షములు మారుమ్రోగునట్లు భారతదేశమంతటను స్మరింపఁబడుచున్నయది.

ఓసోదరీసోదరులారా! స్మరింపుడు పాపహరమగు రామనామమును లిఖింపుడుశుభప్రదమగు రామనామమును పఠింపుడుజ్ఞానసంధాయకమగు రామచరితమును ఈరామనామమునుమించిన పావననామము శ్రీహరినామములలో వేఱొంటులేదు దీనికిదేసాటి. భారతదేశము భాగ్యవంతమగుటకును కీర్తియశోవిరాజితమగుటకును ఈశ్రీహరినామమే ముఖ్యసాధనము.

## గ్రయోదశాధ్యాయము

## —♦ బా ల లీ ల లు ♦—

నామకరణోత్సవములు ముగిసినవెనుక దశరథుఁడు చీటికిని మాటికిని "రామా రామా" యనిహృదయముప్పొంగఁ బుత్రునిఁబిలువఁ దొడంగెను. ఆకోసలేశునిరాణులును నొక్కమనస్సుతో నొకమందిరముననే నివసించు నిజశిశుసుకుమారవిదములఁదిలకించి యానందించుచుం డెడివారలు.

ఆ రామాది బాలకులు క్రమక్రమముగా నెదుగుచు మణికుట్టిమ ప్రదేశములపైఁ బ్రాకుటకుఁ బ్రారంభించిరి. వారితల్లులు ఆ బాలకుల ముందు బంగరుబొంగరములను మణికందుకములను బడవేసి వానివానికై వడివడిగఁ బ్రాకుచుండుటను చూచిసంతసించి చంకలనిడికొని ముద్దులిడుచుండెడివారు మరియునాబాలకులు చంద్రకాంతోపలభాగములపైఁ బ్రాకునపుడు ఆఫలకములఁ బ్రతిబింబించిన నిజరూపములఁ జూచి వానినరచేతులతో దట్టుచుఁ దల్లులవైపుబోసినవ్వులతోఁ జూడ నా రాజకాంతలు పక్కుననవ్వి వారినెత్తికొని గట్టిగఁ గౌగలించి లాలించెడివారు అటుపిమ్మట ఆబాలురు తప్పటడుగులచేతను లేయొగరుమాటలచేతను దమ్ముఁగన్న వారిని సంతసింపఁజేయఁదొడంగిరి వారలబాలలీలలు సాకేతవాసులకు నిత్యోత్సవజనకములై వెలయుచుండెను.

క్రమముగా నాదశరథకుమారులు పంచవర్షీయప్రాయులై తోడిబాలురతో నాడుకొనుచుండ నారదమునీంద్రుఁడు నరకుమారరూపుఁడగు నరహరినిదర్శింపఁగోరి బ్రాహ్మణభిక్షుకరూపముతో నెడమచేతదంబురను కుడిచేతఁజిఱుతలనుజేకొని హరినామసంకీర్తనము చేయుచుసాకేతరాజవీథినిరాఁదొడంగెను.

అపుడాపురవాసులెల్లరు నారదహరిగానమోహితులై యెక్కడిపనులక్కడనేవిడచి గుంపులుగుంపులుగా బిచ్చగానివేసమునుదాల్చి వచ్చుచున్ననారదమునివెంట నేగఁదొడంగిరి. "నిజమే శ్రీహరిలీలాగానసుధావాహినికున్న మనోమోహనశక్తి వేతెట్టిలలితగానమునకును లేదు."

ఇట్లాపౌరులు ఆబాలవృద్ధముఁదనవెంటరా నారదుఁడు సాకేతదుర్గద్వారముదాటి కౌసల్యామందిరము ముందరనిలచి రమామనోహరుని విలాసముల సింపుగాగానముసేయఁదొడంగెను. అపుడు తమ్ములతోఁగలిసి తల్లులమ్రోల నాడికొనుచున్న రాముఁడు నారదసంగీతరవమునువిని నిజానుజులువెంటరా గుమ్మముకడకుఁబరుగిడివచ్చి యాకపటవిప్రయాచకునకు నమస్కరించి కటితటమునఁగరములనునిచి యొయ్యారముగానిలచెను.

అపుడు నారదుఁడు అనాద్యనంతదేశకాలవ్యాపియగు విశ్వరూ

పుడమైదేండ్లకుట్టుడైనదుమునఁ జేతులుంచికొని నిజానద్భుతలావణ్యమును జూపులనుగాంచి తనివితీరనాజగన్మోహనుని యొయారమును దిలకించి యంతరంగమున బ్రహ్మానందరసము తరంగీకరింప నిట్లుప్రస్తుతించెను.

"ఓవరేందీవరదళశ్యామసుందరా! ఇందిరామానసచకోరవసుధాకరా! నీవిపుడుతాల్చియున్న మోహనాకారముయొక్క సొంపును ఇంతకుఁబూర్వంపు టవతారములయందు జూపవైతివి. మఱియు నీవు వైకుంఠమున బరిపూర్ణరూపములో నున్నపుడుకూడ నింతటిసొగసును వహింపవైతివి.

ఆహా! వందారుజనకామితమందారా! నన్ను నీలోఁగూడ నీద శరథమందిరమున నీకుఁదమ్మునిగాఁకుంటెమాని సఖునిగానైన కాదు, కాదు, దాసునిఁగానైన నేలనిలపైఁబుట్టింపవైతివి? నేజేసికొన్నపాప మేమి? దయాళూ! దాసులపైనీకింత మోడిపాడియా? కాదు. నినుగేలిసేయరాదు ఏమన నీవునాకీదాసరివేసమువేయ మనసుపుట్టింపకున్నచో నేనునీదగు ముద్దురాపట్టిసోయగమును జూడగలిగియుందునా?" అని పైకిట్లుపలికెను.

"ఓముద్దుబిడ్డలారా! నాకుబిచ్చమిడరా?" అనరాముడిట్లుపలికెను.

రాముఁడు:—విప్రోత్తమా! నిలచియుండుడు మేములోనికేగి మాయమ్మలనడిగి బిచ్చములదెచ్చియిత్తుము. అని తమ్ములతోఁదల్లుల కడకేగి ఆమాయామానుషబాలకుఁడు "అమ్మలారా! ఒకబీదపాఱుఁడు మనగుమ్మముకడనిలచి బిచ్చమడుగుచున్నవాడు. కావున మాకేవైననొసంగుడు మేమువానినిగొనిపోయి ఆవిప్రోత్తమునకొసంగుదుము" అన నారాణులు వారిముద్దుపలుకులనాలించి సంతసించిరి. తోడనే కౌసల్య తనతనయుఁడగురాముని దోసిలియందు నిండ్రనీలమణులఁబోసెను. కైకేయి తననందనుడగు భరతునియంజలియందు నాణెముత్తెములనింపెను. సుమిత్ర తనసుతులలో లక్ష్మణునికరపుటమునఁ గెంపులను, శత్రుఘ్నుని హస్తపద్మములఁ బచ్చలనునిడెను. అంతనాబాలురు తమమాతలువెంటరా ద్వరితముగనారదునిపజ్జకువచ్చి రతనములనిడఁబోవ నావేల్పుతపసి నవ్వి యిట్లుపలికెను.

"సార్వభౌమనందనులారా! నాకీయుచేలనములగు రత్నములక్కఱలేదు. నిగమాంతవాక్యసారతండులములుఁ గొనితెచ్చియుందు." అన రాముఁడు "భూసురోత్తమా! బాగుగఁజూడుడు. ఇయ్యవి చిత్కళావిలసితములగు బియ్యములుకాని రత్నములుకావు." అని నిజాంజలిపుటముఁ జూప వారిదోసెళ్ళనిండఁ దెల్లనితండులములు కానవచ్చెను.

అంతనామిన్నుదారిజడదారి యారతనములు బియ్యముగామారుటనుజూచి యచ్చెరువంది సంతోషముతో "నాతండ్రులారా! రండు, రండు. తండులముల నాజోలినిండఁబోయుడు. ధన్యుఁడనైతిని." అన రాముఁడు మోమునలేనగవొప్ప ననుజసహితుఁడై యాపేదబాపనదానరిసంచిలో బియ్యముఁబోసి నమస్కరింప నానారదుఁడు "సకలలోకములకును దానవబాధలుతొలంగి సౌఖ్యములుసమకూడుగావుత." అనిదీవించి తిరుగఁగళ్యార నాదివ్యసుందరాకారుఁడగు బాలరామునిఁ జూచి ఇట్లుస్తుతించెను.

"ఓయఖండాద్వితీయచిదానందస్వరూపా! నీవు భక్తాభీష్టసంపాదనమునకై దేహావిరహితుఁడవయ్యు, ననంతరూపుఁడవై, నామరహితుఁడవయ్యు, సకలపదాభిధానుఁడవై నిర్గుణుఁడవయ్యు, ననంతకల్యాణగుణనిలయుఁడవై నిరీహుఁడవయ్యుఁ, బ్రవృత్తిమగ్నుఁడవై అవాప్తనిఖలకాముఁడవయ్యు యాచకుఁడవై సమస్తజగజ్జనకుఁడవయ్యుఁ బరకుమారుఁడవై ఇట్లు నీయనంతకరుణావిలాసములను కనుపఱచుచుందువు. అనసీకుసుమ శ్యామసుందరుఁడవగు నీవెవ్వరిమానసముల స్మరింపఁబడుదువో యట్టిపవిత్రులకుఁ బరపరాభవదుఃఖములెట్లుకలుగును. అట్టినీభక్తులకు ఘనవిభవములెట్లు చేకూరకుండును ? ఓజగన్నాటకసూత్రధారీ ! శ్రుత్యంతవిహారీ! శీఘ్రముగాఁబెద్దవై క్రూరరాత్రించరానీకములఁదునుమాడి ధర్మసంస్థాపనమొనర్చి లోకములఁగాపాడుము" అనిభగవన్నామగానముచేయుచు వెడలిపోయెను

దశరథరాజకాంతలావిప్రరూపుఁడగు నారదుని మనోహరగానమునువిని సుందరాకారులగు సుతులమోములనుదిలకించి ఆవదనముల యందుఁ గొత్తవిన్నాణమునుగాంచి అబ్బురమంది అమితానందముతో

సుతులనెత్తి చంకలనిడికొని ముద్దులిడిదీవించుచు మందిరములోనికి వెడలి పోయిరి.

అట్లుబాలలీలావినోదములతో ఆరాజపత్నులు సంతోషముగాఁ గాలము గడుపుచుండ క్షీరాబ్ధిద్వాదశివచ్చెను. ఆనాఁడాసతీమణులు శ్రీహరినిఁబూజింపఁదలంచి రామాదినందనులకు నాటబొమ్మలను, పప్పుబెల్లములనొసంగి "బిడ్డలారా! యింటనాడుకొనుచుండుఁడు. ఇపుడేవత్తుము" అని తెలిపి దాదులఁబిలచి "పిల్లలనిటునటుఁబోకుండ జాగ్రత్తగాఁజూచుచుండుఁడు. మేమునోములనోచికొని వేగముగావత్తుము." అని యాజ్ఞాపించి సరయూనదికేగిస్నానమాడి కౌసల్యాభవనమునకు వచ్చి నూతనకౌశేయాంబరధారిణులై నుదుటఁగుంకుమతిలకములఁబెట్టికొని మంగళాలంకారకలితలై మణిమయ స్తంభములచేతను, మౌక్తిక తోరణములచేతను, బంగరుసెమ్మెలచేతను నవరత్నసింహాసనములచేతను నలంకృతమై కుందమందారకురవకాది కుసుమశోభితములగు సువర్ణభాజనములతోడను, కర్పూరాగరుచందనాది సుగంధద్రవ్యభాసురములగు నవరత్నకరండములతోడను గూడి లక్ష్మీనిలయమువలె నొప్పుపూజామందిరమునకేగి, కాయలతోఁగూడియున్న యుసిరికకొమ్మలుకల బంగరుతులసికోటనందుంచి, కాంచనాసనాసీనలై, ధాత్రీతులసీసమేతుఁడైన శ్రీహరినిబూజింప మొదలిడిరి.

కాని వారిమానసములు పూజలుపైనిలువక నిజనందనులవైపేగఁ దొడంగెను. ఇట్లు తల్లులుపూజలుజరుపుచుండ రాముఁడు తమ్ములతోఁ గూడి పరుగిడి పూజామందిరముకడకువచ్చి తమయమ్మలు చూచుచుండఁ బూజామందిరములోనికిఁ జొరబడి, సోదరులతోనాడఁదొడంగెను. అంతమడిగట్టియున్న యారాణులు "బిడ్డలారా! మైలబట్టలతో దేవతామందిరములోనికేగరాదు. కావున మాతండ్రులారా! పూజాద్రవ్యములనంటక వెంటనేపైకిరండు మీకుఁజేతులనిండఁ గండచక్కెరల్లఁబెట్టెదము మీరు మామాటలువిని రాకున్నఁగొట్టెదము" అనిరి.

అంతరామాభిధానుఁడగునరహరి తనతల్లులకు నిజమహిమలఁ జూపఁదలంచి వారుచూచుచుండఁగనే యనుజులతో నాపూజామందిర

మున నదృశ్యుఁడాయెను. వారుతమబిడ్డలఁగానరాక వారేమాయిరని కలవరపాటుతో నాదేవాగారమును గలయఁజూడఁదొడంగిరి కానియందు నిజనందనులు కానరారైరి. ఇట్లువారు తెగఁజూండి చూచుచుండఁగనే ఆమందిరమునందలి మణిస్తంభములనాల్గింటిని బట్టికొని, గిరగిరఁదిరుగుచుఁ దమ్ములతోఁ రాముఁడు కానవచ్చెను. అదిచూచి వారచ్చెరువంది "బొట్టెలారా! ఇట్లుగొంటుచేతలఁ జేయఁదగునా? రండిపాటిఁజై." అనవారు పకపకనవ్వుచు రాకుండుటచే నాసాధ్వులు విశ్వరములనున్న పువ్వుల వారినిగొట్టలోనివిసిరి. ఆసమయమున రాముఁడుసోదరులతోఁ గలసి శేషశాయిగామారి శ్రీ, భూ, నీలాసేవ్యమాన చరణారవిందుఁడై సనకసనందనాది దివ్యసూరివందితుఁడై సర్వలోకానందజనకములగు మందహాసములతోనొప్పు నిజముఖేందీవరకాంతు లామందిరమునవ్యాపింప శంఖచక్రాదిదివ్యాయుధధారియై తల్లులకుఁబ్రత్యక్షమాయెను.

దశరథకాంతలు ఆదివ్యమంగళమూర్తిని సందర్శించినతోడనే నిజప్రాకృతవ్యామోహములతొలఁగ దివ్యజ్ఞానసంపన్నలై రామతత్త్వమును తెలిసికొని చేతులుజోడించి యిట్లుప్రార్థించిరి. "ఓయమేయాఖండశక్తి సంపన్నా! ఆపన్నజనదుఃఖహరణా! హరిహరబ్రహ్మాదిదేవతులే నీమాయలకులోనై నీస్వరూపసంపదలఁ దెలియఁజాలక దిగ్భ్రమజెంది తిరుగుచుండ మానవదేహధారిణులై సంసారకర్దమమునఁ బడియున్న మాబోటి యబలలగతి యేమని తెలుపవలయును? ఓయన్నా! మాయందుఁగరుణాళుఁడవగుటచే నిట్లుమాకుప్రత్యక్షమైతివి. ఈయది నీనిర్హేతుకదయామానకటాక్షలక్షణము కానిపరమాత్మా! ఈనీదివ్యతేజోరూపమును ధ్యానింపఁదగినమనోబలము మాకులేదు. మేమజ్ఞానముచే నీవునిగమాంతవేద్యుఁడవగు శ్రీహరివని యెఱుంగఁజాలక మాకడుపునఁబుట్టిన నందనుఁడవని భావించుటచేఁ బ్రత్యక్షదైవమవగునిన్ను విడచి మేమునీవిగ్రహములకుఁ జేయుచున్నపూజలకుఁగోపింపక మాయందనుగ్రహముంచి తిరుగఁగుమారరూపములతోఁ బ్రత్యక్షమై మాతృబుద్ధితో మాచేయు నుపచారములఁ గైకొని మాకునందనానందము సమకూర్పుము." అనిప్రార్థింప భక్తవత్సలుఁడగు నరహరి వారికి వెనుకవైపునఁ దమ్ములతోనిలచి

మడికట్టియున్న తల్లులు తాముముట్టినఁ గోపింతు రేమోయను భయమును నటించుచు మెల్లగా "అమ్మలారా! మేముమిమ్ముముట్టికొనవచ్చునా? తల్లులారా! మాచేఁగూడఁబూజలఁ జేయింపరా?" అనిపలుక అమ్మో హానకంఠనాదము చెవులఁబడినతోడనే యూరాణులు వెఱగంది వెనుకకుఁ దిరిగిచూడఁ జేతులుజోడించుకొని భయభక్తులతో నిలిచియున్న రాముఁడు సోదరులతో వారికిఁగానవచ్చెను.

అపుడు పుత్త్రప్రేమవశంవదలైన యాసతీమణులు "మాతండ్రు లారా! యుడుపులవిడచి రండు ముట్టుకొండు" మన రాముఁడు తమ్ముల తోడుస్తులఁదీసి వారికడకేగ నాకాంతామణులు కనులనానందాశ్రుప్రు లుక్రమ్మ వారినిచేరఁజేరిముద్దులిడి తొడలపైఁగూర్చుండఁబెట్టికొని పూజ లఁబూర్తిసేయమొదలిడ రాముఁడిట్లుప్రశ్నించెను.

రాముఁడు:—మాతృదేవతలారా! ఇపుడు మీరుచేయుచున్న వ్రతముపేరేమి?

కౌసల్య:—నయనాభిరామా! రామా! ఈయదిలక్ష్మీరాధ్యవ్రతము.

లక్ష్మణుఁడు:—మాతలారా! దీనివలనఁగలుగులాభమేమి?

కైకేయి:—సుగుణనిలయా! దీనివలనసకలసంపదలు సమకూరును

భరతుడు:—జనయిత్రులారా! మనకన్నిసిరులున్నవే? ఇకనీవ్రతము చేయనేల?

సుమిత్ర:—ముద్దుబిడ్డా! ఇంతకంటెను హెచ్చుసిరివచ్చుటకు.

శత్రుఘ్నుఁడు:—జననులారా! అట్టిపేరాశతగునా?

తల్లులు:—బిడ్డలారా! వికటప్రశ్నలచే మాపూజలకడ్డురాకుఁడు నోములుముగిసినపిమ్మట మీప్రశ్నలకు బదులుతెలుపుదుము.

శత్రుఘ్నుఁడు:—అట్లైన ఆబంగారుగిన్నెలోని పాయసమును మాకొసంగుఁడు. మాటలాడము.

సుమిత్ర:—తండ్రీ! పాయసము భగవంతునకు నివేదింపనిదే ముందుమీకిడఁకూడదు.

లక్ష్మణుఁడు:—అమ్మా ! ఆభగవంతుఁడెక్కడనున్నాఁడు ?

కైకేయి:—కుమారరత్నమా ! ఆతఁడు జగమంతటను నిండి యున్నాఁడు.

భరతుడు:—అట్లైనమాయందునుకలఁడా ?

కౌసల్య:—వివేకనిధీ ! అందుకుసందేహమేమి? మీయందును మాయందును, దోమయందును, తుదకు ఇసుకనలుసునందును, కూడఁ గలఁడు.

రాముఁడు:—అట్లైనఁబాయసమును మాకేలనివేదింపరు ?

సుమిత్ర:—రవికులజలధిసోమా ! రామా ! వ్రతవిధిననుసరించి పూజలముగించినతోడనే మీకొసంగుదుము త్వరపడకుడు.

కుమారులు:—తల్లులారా ! అట్లైననతిశీఘ్రముగ నోముల ముగింపుడు మాకాకలియగుచున్నయది. అన వత్సలలగు నాతల్లులు వేగముగాఁబూజలబూర్తిచేసి తమసుతులకు భగవన్నివేదితములగు పాయసాదులనొసంగి యానందించిరి.

## —: చతుర్దశాధ్యాయము :—

### గురుకులవాసము.

కోసలచక్రవర్తి రామాదినందనులకు నైదవయేట నక్షరాభ్యాసముచేయించి వారికయ్యవారులచే విద్యలనేర్పింపఁదొడంగెను. ఆబిడ్డలొజ్జలు చెప్పుటయేతడవుగాఁ బాఠములనొప్పచెప్పఁదొడంగిరి. ఇట్లాస్పసుతులు కొలదికాలములోనే బడిచదువులయందుఁ గృతార్థులైరి. పిమ్మటవారికిఁబదియవయేడు రాఁవెంటనే కోసలాధిపుఁడు వసిష్ఠమహర్షిని దోడ్కొనివచ్చి యుపనయనములజరిపించి బ్రహ్మోపదేశమొనర్చెను.

అపుడాబ్రహ్మచారివేషధారులగు రాజనందనులు గురునియజ్ఞానుసారము వారివారితల్లులకడకేగి "భవతిభిక్షాందేహి" అని కాంచనపాత్రములఁ జేతులఁబట్టుకొని భిక్షావందనమొనర్ప ఆతల్లులు నూతనయజ్ఞోపవీతములతోడను, మృగాజినములతోడను, ముంజమేఖలలతోడను పంచశిఖలతోడను పచ్చగోచులతోడను మఱియాషాఢదండములుగాఁ జేకొని తమముందర నిలిచియున్న నిజనందనవటురూపములఁ దిలకించి

యానందకళాకలితవదనలై నవరత్నములతో వారిచేతులనున్న బంగరుగి న్నెలనింపి, దీవించి, సువర్ణాక్షతల వారిశిరములపై వేసిరి.

ఆక్షత్రియబ్రాహ్మణాచారులు తమమాతలొసంగిన మణిగణముల వసిష్ఠమునీంద్రునకొసంగి నమస్కరింప నాతఁడామణిస్తోమముల సాకేత వాసులగు భూసురవరులకు సమర్పింపఁజేసెను. దశరథుఁడు వటువులకు మేధాజననసంస్కారములు ముగిసినవెంటనే వేదాదివిద్యల నభ్యసింపఁ జేయుటకుఁ దనకుమారుల వసిష్ఠాశ్రమమునకుఁబంపనెంచి వారిఁజేరఁ జీరి యిట్లుబోధించెను.

దశరథుఁడు:—కుమారులారా! మీరువసిష్ఠమునీంద్రులతో గురుకులమునకేగి యామ్నాయవిద్యల నభ్యసింపవలసియున్నది. కావున గురువులయాజ్ఞలకుబద్ధులరై వినయవిధేయతలతో మెలంగుచు గురువుల యాశీస్సులకుఁ బాత్రులగుచుఁ బ్రాజదవులఁబ్రాజ్ఞులరై వేగముగారా వలయు మిమ్మెడఁబాసి నేనుండఁజాల అన వారుచిత్తమని తండ్రికినమస్క రించి తల్లులకడకేగి యిట్లుపలికిరి.

పుత్రులు:—అమ్మలారా! మానాయనగారి యాజ్ఞానుసారము గురుకులమునకేగి వసిష్ఠభగవానులకడ వేదవిద్యలనేర్చికొని వేగముగా వత్తుము మాకుసెలవొసంగుడు అన ఆదశరథకాంతలు కన్నులవెంబడి గాఱుఁ బాష్పములు సెరఁగులతోఁ దుడిచికొని సుతులముద్దిడి యిట్లు పలికిరి.

తల్లులు:—మాతండ్రులారా! నమ్మువిడనాడి, యేగెదరా? బిడ్డలారా! ఇటబడిపంతుళ్ళకడఁ జేసినకొంటెపనుల అటమునీంద్రుల కడఁజేయక వినయసంపన్నులరై విద్యలనారితేరి వేగముగారండు. మిమ్ము వీడి క్షణకాలముకూడ నుండఁజాలము. అని తెలుప రాముఁడిట్లుపలి కెను.

రాముఁడు:—వాత్సల్యామృతతరంగిణులారా! తల్లులారా! మేమిట బడిపొజ్జలకడఁ జేసినయాగడముల దేశికేంద్రులగు మహర్షులసన్నిధిని జేయనగునా? కొలదిజలములుగల కుల్యలనుదాటనగునుగాని అపార జలతరంగభీకరములగు మహార్ణవముల లంఘింపనగునా? కావునఁ

దల్లులారా! భీతిల్లకుడు మేముజాగరూకులమై వేదవేదాంగముల నేర్చి కొందుముకాని కొంటిచేతలుచేసి తాపసులకుఁగోపములఁ దెప్పింపము. వారికుపచారములుచేసి దీవనలనందికొందుము. అన ఆరాణులు మువ్వురు రాముని వినయోక్తులకానందించి సుతులదీవించిపంపిరి.

వసిష్ఠమహర్షి రామాదుల వెంటనిడికొని తపోవనమునకేగి యచటివిద్యార్థులలోఁగలపి యారాకొమరులకు విద్యలబోధింప ఆ రాజసూనులతివేగముగా నాలుగువేదముల సాంగముగాగ్రహించిరి. గురువరుఁడలరి సకలకళలనభ్యసింపఁజేసెను ఆరాజనందనులును గురువులుచేయుపరీక్షలయందుఁ గృతార్థులగుటయేకాని తెలివోవుటనెఱుంగరు. మఱియు నాసార్వభౌమనందనులు రాజసముచూపక వినయముతో గురుశుశ్రూషలనెరపుటయకాక సహపాఠులగు ద్విజవటువులకుఁగూడ నుపచారములఁజేయుచు ఆగురుకులమునందలి విద్యార్థిమండలికి వినయమర్యాదలఁగరపుచుండిరి.

అట మున్నువిద్యల నభ్యసించుచున్న బాలకులు రామాదుల తోఁగలసి చదువనారంభించినదిమొదలు తమకునవమేధలుదయింప ననాయాసముగా గురుబోధలగ్రహింప సమర్థులైరి అందుచేవటుజనశత్రువగు వేత్రమువారినేత్రములకుఁ గానరాకుండెను. "సత్సహవాసములచే సౌఖ్యములుచేకూరుటయు దుఃఖములుదూరమగుటయు సహజమేకదా".

ఆయరుంధతీవల్లభుఁడట్లు విన్నమాత్రముననే తమ్ములతోఁగలసి విద్యలగ్రహించుచున్న వటూత్తముఁడగు రాముని దివ్యరూపము తనమానసమునాకర్షింప బ్రహ్మానందపరవశుఁడై నోటమాటరాక నిశ్చలుఁడుగానున్న సమయము లెన్నియోకలవు. "లోకమునఁబ్రాజ్ఞులగుబాలురకు విద్యలఁగరపునపుడు వారితెలివితేటలఁగని యొజ్జలుప్పొంగుచుండ అట్టి యపారికృతద్యుమణిగళవిగ్రహుఁడును, వివేకసాగరుఁడునగు పటపత్రశాయి, వటురూపధారియై తనయొద్దవిద్యల నేర్చునపుడుపాధ్యాయుఁడైయున్న యావసిష్ఠునిభాగ్యమెన్నఁదరమగునా? అతని యానందమునకుమేరయుండునా?

వసిష్ఠుఁడట్లా మ్నాయవిద్యలనన్నిటిని సంపూర్ణముగా వారికి నేర్పి యారాజసూనుల నసమాన విద్యాకోవిదులనుగాఁ జేయుచు నొకనాడు రామలక్ష్మణభరతశత్రుఘ్నులఁబిలచి "చక్రవర్తి నందనులారా! ఈనాడు మీసోదరులు నలువురును విడివిడిగా నాశ్రమకార్యముల నెర వేర్పవలసి యున్నది. నేడు మీవంతగుటచే బ్రహ్మచారి ధర్మానుసారము గురు సేవలఁ జేయవలయును." అన రాముఁడిట్లు పలికెను.

రాముఁడు:—గురూత్తమా! శిష్యులు గురుదైవతములకు వినమ్రులై, సేవల నెరపకున్న నిహపరముల రెంటను నింద్యజీవితులగుదురు గురుశుశ్రూషయే విద్యార్థులనున్నతస్థితికిఁ దేగలదుగాని స్వేచ్ఛావిహారముకాదు. కావున మమ్ముసార్వభౌమపుత్రులగు దురభిమానులనుగాఁ దలంపక కింకరులనుగా భావించి మేము చేయవలసినపనుల విధింపుఁడు.

వసిష్ఠుఁడు:—రామచంద్రా! నేఁడు మీరు చేయవలసిన కృత్యములవినుడు. రామా! నీవిటనుండి యరణ్యమున కేగి సాయంతనహోమమునకు సరిపడు పలాశసమిధలఁ దేవలయు. లక్ష్మణా! నీవు నదీజలముల ఘటములతోఁ గొనితెచ్చి యాశ్రమవృక్షకముల యాలవాలములనింప వలయు భరతా! నీవు ఇటకుసమీపముగానున్న విప్రగ్రహారముల కేగి కులకాంతలయాచించి మధుకరములఁగొని రావలయు. శత్రుఘ్నా! నీవు నందినీధేనువును దోలికొనివెళ్ళి నదీతీరములఁజక్కగ మేపి సంధ్యాకాలమునకు తిరుగఁదోడ్కొనిరావలయు అని యాజ్ఞాపింప నాచక్రవర్తితనూభవులు తలలువంచి "చిత్త" మనినమస్కరించి తమతమవిధుల నెరప వెడలిపోయిరి.

రాముఁడు తన కాచార్యుఁడు విధించిన ఇంధనాహరణమునకై ధనుర్బాణములఁ కైకొని యరణ్యమధ్యమున కేగి హోమార్హములగు పలాశసమిధల వెతకుచుఁ గొంతముందున కేగి కావలసిన సమిధల నేరి కట్ట గట్టఁదొడంగెను.

—♦ పంచదశాధ్యాయము ♦—

గుహచరితము.

పూర్వము వసిష్ఠపుత్రుఁడగు మహోదయుఁడు "విశ్వామిత్రమ

హర్షి, పంచముఁడైన త్రిశంకుని స్వర్గమునకుఁబంప యజ్ఞమును జేయింప బోవుచున్నవాఁడు. మిమ్మందరఁదోడ్కొని రమ్మనినాఁడు" అని కౌశికశిష్యులు తెలుప పక్కుననవ్వి "ఒకమాలవాఁడు జన్నముసేయునా? వేఱొక రాచవాఁడు యాజకుఁడుగానుండునా? ఆయాగమునకు జేజేలువత్తురా? ఆమాలకూటిని తిన్నవారు బాపలగుదురా?" అనిపరిహసించెను. విశ్వామిత్రశిష్యులు వానినిందావచనములఁ దమగురుని కెఱింగింప నాగాధేయుఁడు కోపోద్దీపితుఁడై "నన్నుబరిహసించిన మహాపాపుఁడగుమహోదయుఁడు ద్విజత్వమువీడి నిషాదుఁడుగాఁ బుట్టుగాక" యని శపించెను.

వసిష్ఠనందనుఁడాశాపమును తెలిసికొని తండ్రికడకేగి జరిగినగాధను నివేదించిఖిన్నుఁడై "తండ్రీ! తాపసేంద్రా! నన్నీశబరజన్మమునుండి గాపాడవా?" అని ప్రార్థింప నావశిష్ఠభగవానుఁడిట్లు బోధించెను.

వసిష్టుఁడు బిడ్డా! కౌశికశాపమనుభవింపక తప్పదు కాని నీకాశబరజన్మమున రామనాముఁడగు రమాపతి ప్రాణదానమొసంగును. అది మొదలు నీవాపురుషోత్తమునకు బ్రాణసఖుఁడవై యారామావతారాంతమున శ్రీహరితో వైకుంఠమునకేగఁగలవని బోధించెను మహోదయుఁడు విశ్వామిత్రశాపానుసారము శృంగబేరపురాధిపతియగు రోహునకు గుహుఁడనుపేరఁ బుత్రుఁడైపుట్టి పరమభక్తుఁడై తండ్రియనంతరము నిషాదరాజ్యైశ్వర్యకులోచితవృత్తిని కాలముగడపుచుండెను.

ఆగుహుఁడొకదివసమున వేటకై రాముఁడు సమిధలఁ జేకొనుచున్న విపినమునకువచ్చి కొన్నిమృగముల వేటాడి యామృగముల సేవకులచే శృంగబేరమునకుబంపి వేటయలసటచే నొకచెట్టునీడకేగి యాతరుచ్ఛాయను విశ్రమింపఁగొంచెము నిదురపట్టెను. ఆస్వప్నములో నాగుహుఁడు భగవంతుఁడు తన్నుద్ధరింపసిద్ధముగానున్నయట్లు కలఁగని లేచి కలలోఁగాంచిన దివ్యరూపుని ధ్యానింపఁదొడఁగెను.

ఆసమయముననే కొందరుమునిబాలకులు లేగదూడలమేపుచుండ దూరమునుండి తోడేళ్ళగుంపులు ఆయావుకోడెములపైకి రాఁదొడఁగెను లేగలావృకసమూహముల రాకనుగనుగొనితోడనే తోకలఁ బైకెత్తి బెదరుపాటుచూపులతోఁ జెల్లాచదరై పరుగిడఁదొడఁగినవి,

అపుడు వానిని మేపుచున్న సంయమికుమారులు దూరమునుండి పరుగిడి వచ్చుచున్న తోడేళ్ళమందలనుజూచి భీతులై చెట్టునీడను భగవంతుని ధ్యానించుచున్న గుహునికడకువచ్చి "ఓధనుర్ధరుఁడా! మమ్మాపదనుండి యుద్ధరించి పుణ్యముకట్టుకొనుము." అన ఆభీతమునిసుతకంఠనాదము చెవినిబడినతోడనే "భయములే"దని తెలిపి వెంటనేవారితోనేగి పారిపోవుచున్న గోశాబకములఁ జేరఁదీసి, ఆయావుదూడలను, ఆమునిసుతులను నొకకొండగుహలోనుంచి వింటనమ్మును సంధించి గుహాద్వారమునకడ్డము గానిలచెను.

అంత నావృకయూధము లొక్కపెట్టున దనమీదఁబడనుండ బాణపరంపరలచేఁగొన్నింటిని నేలఁగూల్చెను. కాని క్రమక్రమముగా నాతోడేళ్ళమితములై చుట్టుముట్ట సంహరింపనేరక తానభయమొసంగిన ప్రాణులుహతులగుదురను భయముదయింపఁ జేయునదిలేక ఇట్టి కష్టకాలమున ఈశ్వరధ్యానముతక్క వేఱొండుసాధనము లేదనినిశ్చయించి ధనుర్బాణముల నేలఁబడవైచి చేతులుజోడించి యిట్లు సర్వవ్యాపకుఁడగుభగవంతుని నుతింపఁదొడంగెను.

గుహుఁడు:—ఓదీనజనబంధూ! కృపాసింధూ! నీవీసమయమున నాపైఁదయఁజూపకున్న గోవత్సములును, తాపసనందనులును, క్రూర వృకములనోటఁ బడుటతప్పదు. కావున వేగముగాఁబరుగిడివచ్చి నిరపరాధులగు జీవులఁగాపాడి నీదయాళుత్వమును బ్రకటింపుము. ఓభక్తవత్సలా! మున్ను నీవుమొసలిచేఁబట్టఁబడి బ్రతుకుఁజాలింపనున్న గజరాజుచేఁ బిలువఁబడి వైకుంఠమునుండి యటకుఁబరుగిడి కాపాడితివని వినియుంటి. ఆనమ్మకముచేనిపుడు మముఁగాపాడరమ్మని పిలుచుచుంటి. ఏమీ! నీవిటకుమముఁగాపాడరావా? నానీరసకంఠస్వరము నీకువినఁబడలేదుకాఁబోలు. లేకున్న నాపన్నార్తిహరుఁడవగు నీవురాకుంటయెట్లు. బిగ్గరగాఁబిలుతును. వినుము నామొఱను ఓభక్తవత్సలా! వెంటనేమముఁగాపాడుము. అని కొండగుహాలు ప్రతిధ్వనించునటులఁ గేకవేసి, యలసి నేలపైఁబడిపోయెను.

ఆయార్తనాదము సమీపమున సమిధల మోపుకట్టుచున్న యా
ర్తశరణ్యుఁడగు కౌసల్యానందనుని చెవినిబడినతోడనే కట్టెలుకట్టుటనట్టె
విడచియొకయున్నతస్థలమునకేగి యాయార్తనాదము వినవచ్చినవైపునకుఁ
జూడ నేలపై నొకపురుషుఁడును, వానిపైఁ గ్రూరవృకసమూహములును
గానవచ్చెను. వెంటనే ధనువునఁబావనాస్త్రమును సంధించి యాతోడే
ళ్ళను సుడిగాలి పండుటాకులనువలె పైకెగురఁగొట్టి పరుగుపరుగున నా
గుహునిచెంతకేగి మూర్ఛితుఁడై చైతన్యములేక నేలపైఁబడియున్న
యాదీనమానవసోదరుని లేవనెత్తెను.

అట్లాదివ్యపురుషుని పావనకరస్పర్శమైనతోడనే యాశబరనాయ
కుని దేహమునకును మానసమునకును గ్రొత్తవికాసముదయింప మెల్ల
గాఁగన్నులువిప్పి తన్నుఁబట్టుకొనియున్న నీలేంద్రమేచకదేహుఁడగు
రామునిఁగాంచి విస్మితుఁడై, ఇట్లుప్రశ్నించెను.

గుహుఁడు:—మహాత్మా! మీరెవ్వరు? సుకుమారాకారులగు
మీరీక్రూరమృగాటవికి రాఁగతంబేమి? నాదీనాలాపములనాలించి
నన్నును, తపసిబుడుతలను, లేగదూడలను, గాపాడవచ్చిన దీనబాంధ
వుఁడవగు మాధవుఁడవైయుందువా? అటుఁగాక యుమాధవుఁడవగుభవుఁ
డవా? అదిగాక భారతీవల్లభుఁడవగు నలినోద్భవుఁడవా? నీదివ్యముఖార
విందకళావిశేషమును జూడమానవమాత్రుఁడవుగాఁదోఁచుటలేదు.

శూరాగ్రణీ! ఒక్కకేకతో నీవిటకువచ్చి యీకందరములో
నున్న మునిసుతులను, గోవత్సములను, నన్నును, గూడ మృత్యుముఖ
మునుండి కాపాడియుంటివి. మీరెవరైననేమి? ఈనాఁడుమొదలు నాకు
మీరే యుపాస్యదైవతమైతిరి. మీమోహనరూపమును జూచినదిమొ
దలు నాహృదయ మనిర్వాచ్యానందము నందుచున్నది. ఏదియోక్రొ
త్తవికాసముఁ జెందుచున్నది. ఇందుకుజన్మాంతర సుకృతసంస్కారమేది
యో యుండవలయును లేకున్న ఈకిరాతునకుమీదర్శనభాగ్యమబ్బుట
యెట్లు? ఆర్యా! మీవటువేషమునుజూడ మీరుక్షత్రియకుమారులైనట్లు
స్పష్టమగుచున్నది ఓయాపన్నరక్షకా! మిముగన్న మేటి యేలికయెవ్వరు?
మీనామమేమి? మీపదపద్మవిన్యాసములచే ధన్యమైనదేశమెయ్యది ?

రాముడు:—ఓయార్త సోదరుడా! నాపేరుతోఁబనియేమి పొ్రద్దుగ్రహించుచున్నయది ఈనీరెండ జారకమున్నే నేనుసమిధలఁదీసికొని, మాంగురుకులమునకేగవలయును కావుననేఁబోయెద తిరుగఁగలిసికొందము అనుచుండఁ బర్వతదరీగర్భమునుండి లేగలనుదీసికొని ద్విజబాలురు పైకివచ్చి తమ్ముఁగాపాడిన వేటగానికినమస్కరింపఁబోవ నాగుహుఁడు వెట్టితమ్ములారా మిమ్ములను, మీలేగలను, నన్నును సంరక్షించినదీద యామయుఁడు కనుకవీరికివందనమొనర్చి చీఁకటిపడకుండ దూడలఁదోలికొని మునిపల్లెకేగుఁడు" అన నామునినందనులాయానందరూపుని జూచి విస్మితులైనమస్కరించి "ఆర్యా! సెలవో సంగుడు మామునిపల్లెకుఁబోవుదుము" అన రాముఁడు మందహాసముతో "ద్విజనందనులారా మీకు వందనములు నేనుమీయాశీర్వాదములకు నర్హుఁడనుగాని వందనములకుఁ బాత్రుఁడను కాను.

మునికుమారులు:—ఓదివ్యరూపా వందనార్హుఁడగుభగవానుఁడు సర్వాంతర్యామియై యన్నిటనున్నవాఁడు కావున మావందనములా దీనజనమందారునకే చెందును అనిలేగలఁదోలికొని, వెడలిపోయిరి.

గుహుఁడు:—ఓప్రాణదాతా! అయాచితముగ మముఁ గాపాడిన మీరు నేఁబ్రార్థించుచున్నపుడు మీపావననామాదులఁ దెలుపకుంట న్యాయమా? ఓయసమానసుందరరూపా! మీనామస్మరణమే నాకు ముక్తిదాయకమని భావించుచున్నాఁడను. కావున శ్రుతిసుఖదములగు మీనామధేయాక్షరములవినిపింపుఁడు.

రాముఁడు:—సోదరుఁడా! నేనుకోసలరాజేంద్రుఁడగు దశరథుని నందనుఁడను నన్నురాముఁడనిపిలుతురు. మిత్రమా! నీయూరుపేరులెయ్యవి?

గుహుఁడు:—సార్వభౌమనందనా! నేనొకశబరనాయకుఁడను నానివాసము శృంగబేరపురిము నన్నుగుహుఁడనిపేర్కొందురు. పురుషోత్తమా! ఏమిమీయవ్యాజకరుణాకటాక్షము నేనుమిమ్ము మీపేరుపెట్టి పిలువకయే ననుఁగాపాడవచ్చితిరే?

రాముఁడు:—ప్రియసఖుఁడా ! దివ్యోత్సవములకును, దీనరక్షణములకును, పిలుపులతోఁబనిలేదు క్షత్రియకుమారులని కంటఁబడిన యాపన్నులఁ గాపాడుటయే లేకున్న వారాక్షత్రజాతికి నవమానకరుల గుదురు. సోదరుఁడా ! గుహుఁడా ! నేనేగిసాయంతన హోమమునకు మాగురువులకు సమిధలనందఁజేయవలయును. మనకలయిక శాశ్వతము గానుండుగాక !

గుహుఁడు:—ప్రభూత్తమా ! మీయట్టిసజ్జనులతో మైత్రి సాప్తపదీనమనుమాటనిక్కువము. రామచంద్రా ! యీచిదుగులమోపు నామూఁపునఁబెట్టికొని, మీతో నాశ్రమమునకు వచ్చుటకంగీకరింపవలయును.

రాముఁడు:—మిత్రుఁడా ! వలదు. సమిధలనేస్వయముగాఁ దీసికొనివెళ్ళవలయునుగాని పరులచేఁబట్టించుకొనిపోరాదు అట్లొనర్చినచో గురునియానల నతిక్రమించినవాఁడనగుదును. గురువులు నన్ను రాజసుని గాఁదలంచి కోపింతురు.

గుహుఁడు:—ఆర్యా ! కోమలరూపులగుమీచే కఠినములగు కట్టెలఁ దెప్పింపఁజూచుటచూడ మీగురువులు కఠినహృదయులుగాఁ గన్పట్టుచున్నారు.

రాముఁడు:—ఓయీ ! నీవుతలంచినదితప్పు దయామయులగు గురువులు శిష్యులకుఁగష్టసుఖములు తెలియవచ్చుటకుఁ గార్యములవిధించుచుందురుకాని బాధించుటకుఁగాదు. విద్యార్థులు సుకుమారులుగానే యుండుచో ముందువారెందుకును బనికిరారు. సోదరుఁడా! ఇక నేపోయి వచ్చెద.

గుహుఁడు:—ప్రభువరా ! నేనీయరణ్యమునకువచ్చి మీదర్శనమునకైఁ యెదురుచూచుచుందును. మీకనువగునపుడు నాకుదర్శనమొసంగుచుండఁగోరెద. అని గుహుఁడు రామునిపాదములకు వందనమొనర్చెను. రాముఁడును సమిధలఁజేకొని, వెడలి పోయెను. గుహుఁడు రాముని కళ్యాణరూపమును ధ్యానించుచు నిజపురమునకుఁబోయెను " ఆహా ! స్నేహములెట్లిప్పుడుకలుగునో యెఱుఁకనిచెలి

యకుఁ ఆకోసలచక్రవర్తిపుత్త్రుఁడగు రాముఁడేడ? ఈపల్లెతేసకొామరుఁడగు గుహుఁడేడ? వీరిరువురకుఁ బ్రాణమైత్రి కలుగుటయేడ? కాదు కాదిట్లుసందేహింపఁబనిలేదు. విధివిధానములత్యద్భుతములు. అయ్యవి యెట్టివిరుద్ధవస్తువులకును స్నేహసంబంధమును సమకూర్పఁగలవు. చుక్కలతేఁడగు చందమామకును, నడవినిదిరుగాడు చెవులపిల్లికిని కలయికకలుగలేదా? ఇందుఁకువిధివిలసితమేకదా కారణము."

## —: షోడశాధ్యాయము :—

## ఆచార్యోపదేశము.

అంత దశరథతనయులు శాణవలయమునరాపుడుపడిన రత్నములవలె గురుకులమునఁజదివింపఁబడి ప్రకాశింపఁదొడఁగిరి.

వసిష్ఠమునీంద్రుఁడు సకలవిద్యానిష్ణాతులైన దశరథపుత్త్రులఁ జూచి, యిట్లుబోధించెను. భూపాలనందనులారా! మీరుసార్వభౌమపుత్త్రులయ్యు వినయసంపన్నులరై విద్యార్థిసోదరులతో సుహృద్భావముతో మెలఁగితిరి. ముందుమీరుప్రజాపరిపాలకులు కాఁబోవుచుండుటచేఁ గొంచెముధర్మముబోధింపఁదలంచితిని." అనరాముఁడిట్లు పలికెను.

రాముఁడు:— దేశికేంద్రా! మేముచదివినవిద్యలొకయెత్తు మీరు బోధింపనున్న ధర్మమొకయెత్తు కావునమాకు ధర్మబోధలఁజేయఁ బ్రార్థించుచున్నవారము.

వసిష్ఠుఁడు:—దశరథసూనులారా! మీరెల్లరు శమాదిగుణసంపన్నులరై సత్యమునువిడువక, ప్రజాసౌఖ్యముల సమకూర్పఁబ్రయత్నింపుఁడు. కామకిరాతుఁడు కాంతలనెడివలలఁబన్ని, మానవమృగములఁ బట్టఁజూచుచుండును ఆశాపిశాచము కాంచనదీపకాంతులఁజూపి అందు మనుష్యశలభములఁ బడఁగొట్టఁజూచుచుండును. కావున జితేంద్రియులరై, సంచరింపుఁడు. ప్రేమనుజూపుటయే మానవత్వలక్షణమనియు, ద్వేషమునుప్రదర్శించుటయే, పశుతాచిహ్నమనియుఁ దెలిసికొనుఁడు వివేకమునువికసింపఁజేయునదియే విద్యయనియు, గర్వమునుగలిగించునది, యవిద్యయనియు, భావింపుఁడు

రాముఁడు:—గురువరా! దీపకళలు చీఁకటినిఁబోఁగొట్టునటుల దేశికోపదేశములు అజ్ఞానములఁబోనడంచును.

లక్ష్మణుఁడు:—ఆచార్యోత్తమా! మీరుమమ్ముఁ బుత్రులనువలెఁ బ్రేమించి సుఖముగా సర్వవిద్యలబోధించియుంటిరి మీయప్పులదీర్ప మేమెన్నిజన్మముల నెత్తవలయునో ?

భరతుఁడు :—గురుచంద్రా! విద్యాభ్యాసకాలమునఁ దెలిసీతెలియక మాచేసిన యపరాధముల క్షమియింపవలయును.

శత్రుఘ్నుఁడు :—అరుంధతీరమణా! మావలన గురుదక్షిణలఁ గైకొని మమ్ముకృతార్థులనుగాఁ జేయఁగోరుచున్నారము.

వసిష్ఠుఁడు :—భూపాలబాలకులారా! మీరుగురుకులమున నెరపిన శుశ్రూషలే గురుదక్షిణలు అంతకుమించిన వస్తువులు గురువులకు వేఱొండులేవు రేపు మిమ్ము, అయోధ్యకుఁ దోడ్కొనివెళ్ళెదను కావున నీనాఁడు విద్యార్థులకందరకును విశ్రాంతినొసంగితిని. తెలిపెను. ఆమాటవిని, యారాజనందనులు విద్యార్థులకడకేగి, ఇట్లు పలికిరి.

రాముఁడు:—విద్యార్థిసోదరులారా! మిమ్మువిడచి, మాతల్లిదండ్రులకడకువెళ్ళుటకు మనసొప్పకున్నయది వటుసోదరులారా! ఋతుకాలములలో వసంతసమయమట్లు మానవజీవితసమయములలో విద్యాభ్యాసకాలము మహానందజనకము మిగతసమయములింతటి సౌఖ్యదములుకాఁజాలవు.

వటువులు:—రామచంద్రా! నీవు మమ్మువీడిపోయెదువా? మాయన్నా! నిన్నుబాసియుండజాలము నీవుమాకు సఖుఁడవై సోదరుఁడవై, గురుఁడవై దైవమవై బహువిధామూల్యవిషయములమనోహరముగా బోధించి మాకు వివేకమును సమకూర్చితివి అయ్యా! నీమృదుహాస సుందరములగు సంభాషణములను సంతోషజనకములగుచేష్టలను మేమెట్లు? మఱవనేర్తుము? రాజనందనులారా! మీరు సార్వభౌమపుత్రులనుతలంపులులేక, మేముమీతో సమానులవలెఁ దిరిగినందుల కేమియునను కొనకుఁడు సోదరులారా!సార్వభౌములరై ప్రజలఁగన్నబిడ్డలనువలెగాపాడుడు

మీరు సింహాసనాసీనులైయున్నపుడు మీయీతాపససోదరులను మఱవకుఁడు.

లక్ష్మణుఁడు:—సోదరులారా! మానవుఁడులోకములో దేనినైన మఱచునుకాని సహపాఠులతోడి సాహచర్యమును మఱచునా?

భరతుఁడు:—అన్నలారా! మేముయువరాజులమైనను లేకమహారాజులమైనను మీకునను౦గుచెలికాండ్రముగానే యుండుముగాని వేఱువిధముగా నుండఁబోవము మాము మేముమఱచిననాఁడు మిముమఱతుమేమొ!

శత్రుఘ్నుఁడు:—మిత్రులారా! నిసర్గసుందరములును శాంతపావనములును, సంయమీంద్రభాసురములును, సకలకలానిలయములును నగుసీగురుకులనివాసములు కంఠమునఁ బ్రాణములున్నంతవఱకుఁ గంటికగుపడుచునే యుండునుకాని మఱపురాఁజాలవు.

రాముఁడు:—సదాశయులారా! గురుకులమిత్రులారా! ఆచార్యదైవతముల నారాధించుచు, శీలశ్రీవిలసితులై, మనయొజ్జలకుఁగీర్తిని సంపాదింపఁబ్రయత్నింపుడు. మేముపోయివచ్చెదము. అని, విద్యార్థిబృందములువెంటరాఁ దమ్ములతోఁగలసి, యచటితాపసులకడకేగి, నమస్కరించి "మునివరులారా! సెలవొసంగుడు. అయోధ్యకేగెదము." అననామునులు రాజనందనులారా! మీకీర్తిసుధాలేపములచే దిక్కుడ్యములఁ బ్రకాశింపఁజేయుచు దీనజనబాంధవులరై, చిరకాలమువర్ధిల్లుఁడు." అని దీవించిరి.

అటనుండిశ్రీరాముఁడు సోదరాంతేవాసులతోఁగలసి మునిబాలికలకు విద్యలఁగఱపుచున్న అరుంధతీదేవియొద్దకేగి ఇట్లుపలికెను.

రాముఁడు :—అమ్మా! అరుంధతీదేవీ! రేపుమాగురువులు మమ్మయోధ్యకుఁబంపనిశ్చయించిరి. మాకుమిమువదలి తల్లులకడకేగ మనసురాకున్నది. గురుశాసనమనుల్లంఘునియమగుటచే నేగుచుంటిమి. కావున మావినయపూర్వకవందనములందుకొని, దీవించిపురమునకునేగ ననుజ్ఞలనీయఁగోరుచున్నవారము.

అరుంధతి:—తనయులారా! చదువులఁబూర్తిచేసితిరా? మీతల్లులకడకేగుదురా? పుత్రులారా! చిరంజీవులరై మీయుదారకృత్యములచే జగత్ప్రసిద్ధినందుఁడు. బిడ్డలారా! భూజములుఘనచ్ఛాయాసమేతములైనపుడే పథికజనసంతాపముల నడఁచి వారికిసౌఖ్యముల సమకూర్పఁగలవు. భూజనులు వరజాయాకలితులైనపుడే యర్థిజనుల గారవించి సంతృప్తులఁజేయఁగలుగుదురు. కావున రాజనందనులారా! అచిరకాలములోనే యనుకూలరగు కన్యలఁబరిణయమై, యావైవాహిక శుభవేషములమాకుఁజూపఁగోరుచున్నదానను.

భరతుఁడు:—గురుపత్నీ! అట్టివరకళత్ర కరగ్రహణములు సమకూరుట మీయనుగ్రహ ప్రభావమువలననేకదా? అన నచటిమునికన్యకలిట్లు పలికిరి.

మునికన్నియలు:—ప్రియసోదరులారా! ఈతపసితోడబుట్టువుల మనవకును ఈయరుంధతీమాత తెలిపినటుల మీరుపెండ్లియాడి యామావదినెలమాకుఁ జూపఁగోరుచున్నారము.

లక్ష్మణుఁడు:—సోదరీమణులారా! తోఁబుట్టులఁదోడ్కొని వెళ్లని పరిణయోత్సవములుండునా? మీరుమాతోఁగావలదా? రాముఁడటనుండి సోదరులతోఁగలసి సాయంకాల సంధ్యావందనాదులకు వెడలిపోయెను.

ఆమఱునాడు తెల్లవారినతోడనే వసిష్ఠమునీంద్రుఁడు రామాది సోదరుల వెంటనిడికొని, అయోధ్యకువచ్చెను. దశరథుఁడు వసిష్ఠునకెదురేగి, పూజించెను. రామాదులు తండ్రికినమస్కరింప వారలదీవించి, యానందనిర్భరహృదయుఁడాయెను. అపుడు వసిష్ఠుఁడిట్లుపలికెను.

వసిష్ఠుఁడు:—నృపేంద్రా! నీతనయులన్నివిద్యలయందు నుత్తీర్ణులైయున్నవారు. ఇదివఱకీయార్యావర్తమున నింతటిమేధావంతులగు రాజనందనులుదయింపలేదు. నీవుచేసికొన్నసుకృతముచే నిట్టిసుగుణభూషితులగు సుతులుకలిగిరి. ఇట్టి సత్సంతానమునుగనుటచే నీవును, ఇట్టి సచ్ఛిష్యులఁబడయుటచే నేనును, ధన్యులమైతిమి. రాజేంద్రా! నీవికవీరి సాహాయ్యమున రాజ్యభారమును సడలించుకొని, విరాగివై పరమునకుఁ బాటుపడుము.

దశరథుఁడు:—మునీంద్రా! నాపుత్రులు మీతపోవనమునను న్నంతకాలము నేనెట్టిపరిపాలనకార్యములను జూచియుండఁగ శాస్త్రజ్ఞుల గుసచివులే సర్వమునుసాగించిరి. గురువరా! మీతోఁదెలుపనేమి? అను తవియోగదివసములన్నియుఁ జీకటిరాత్రులుగానేయేగినవి నేనిక సంసా రవిరాగినగుటయెట్లు ?

వసిష్ఠుఁడు:—రాజేంద్రా! సందేహమేమి? పశువుమొదలు పర బ్రహ్మమువఱకుఁగల చేతనులకు సుతానురాగమొక్కరీతినివ్యాపించి యున్నది. రాజచంద్రా! విరాగమభ్యాససాధ్యముగాని విడిచిచేఁజేకూ రునదికాదు. కనుకనీనందనులకు ననువగుకన్నియల సమకూర్చి, సంసా రులనుగాఁజేసి నీవువైరాగ్యాభ్యాసమునకుఁ బ్రయత్నింపుము.

దశరథుఁడు:—గురూత్తమా! నేనిదివఱకీప్రయత్నములోనే యుంటిని. కాని నాకుమారులకుఁదగు కన్యకామణులు కానరాకున్న వారు. కావున సర్వజ్ఞులగుమీరిటఁ గొంతకాలముండి, మీశిష్యులకు సరియగుకన్నియల నిర్ణయించి వివాహముల నెరపఁ గోరుచున్నవాఁడను.

వసిష్ఠుఁడు:—భూపవరేణ్యా! నీకోరికనాకభీష్టమే నేనునునీతన యుల విడచియుండఁజాలకున్నవాఁడను. కావునఁ గొంతకాలమిటనివసిం తును. అని స్నానసంధ్యావందనాదులకు సరయూనదికి వెడలిపోయెను. దశరథుఁడును పరమానందభరితుఁడై సుతులతో నంతఃపురములోని కేగెను.

## సప్తదశాధ్యాయము.

### —: విశ్వామిత్రాగమనము :—

దశరథభూపాలుఁడొకనాఁడు కొలువుదీర్చి నిజనందనులవివాహముల గూర్చి వసిష్ఠాదులతో నాలోచించుచుండెను. ఆసమయమున నిజతపో వహ్నికీలలచే క్షాత్రతామ్రమునుగరిగించి, సువర్ణబ్రహ్మర్షివిగ్రహము నుగాఁ బోతపోసిన తపసితేఁడగు విశ్వామిత్రుఁడు రాజమందిరద్వార ముకడకువచ్చి, ద్వారపాలకులతోఁ దనరాకను మహారాజునకెరింగింపు డన వారలోనికేగి, తమయేలికతో గాధేయునిరాకనెఱింగించిరి.

వారిమాటలవిన్నతోడనే యానృపాలుఁడు దిగ్గునగద్దెనుండి దిగి, విశ్వామిత్రునికడకేగి, నమస్కరించి సభామంటపములోనికిఁదోడ్కొనివచ్చి, రత్నసింహాసనముపైఁ గూర్చుండఁబ్రార్థించి, చేతులుజోడించి, ఇట్లుపలికెను.

దశర:—కౌశికమునీంద్రా! మీరాకచేఁగోసలరాజ్యము భాగ్యవంతమైనది; సాకేతనగరము పుణ్యక్షేత్రమైనది. మావంశము ధన్యతనందినది. నాజీవితము సార్థకమైనది. తాపసరాజేంద్రా! మీరాకకుఁ గారణమేదియో తెలియఁజేయుము నాజీవితము మొదలు సర్వస్వమును మీయభీష్టమునకై ధారపోతును.

విశ్వామి:—ఓక్షత్రియకులతిలకా! ఇట్లతిథులరాగానే యాదరించుట నీకతగును. నేనెట్టికష్టకార్యమును చేయుమందునో తెలియకముందే, ఇట్లుఘనముగా సంభాషించుటచూడ నీయట్టిరేఁడు ముల్లోకములలో లేడని తెలుపనగును.

దశర:—తాపససార్వభౌమా! అర్థిజనమనోరథపూరణమునకు సంసిద్ధుఁడుగాని పార్థివుని, సంపదలును, సామర్థ్యములును, అడవినిగాసిన వెన్నెలలవలె నిరర్థకములగును.

విశ్వామి:—దశరథరాజేంద్రా! మీసూర్యవంశజులు అర్థిజనప్రార్థనాధికములగు సంపదులనొసంగుదురని సుప్రసిద్ధివహించియున్నవారు వసిష్ఠశిష్యులరగు మీకిట్టివిశాలహృదయములుంటలో వింతలేదు. రాజేంద్రా! నీఘనోదారసంభాషణముల విన్నతోడనే "ఇట్టిపరోపకారరమణీయమగు క్షత్రజాతినిబాసి, యాచనాపరుఁడగు బాపఁడనుగా మారితినే"యను పశ్చాత్తాపమునాకుఁగలుగుచున్నయది. ఓత్యాగశీలా! కోసలభూపాలా! వినుమునాయీస్థితమును. మారీచసుబాహులను రాక్షసులు నేయాగదీక్షితుఁడనై, యజ్ఞమారంభించినతోడనే హోమకుండమునఁ గుండలతో రక్తములగుమ్మరించుచుఁ, దట్టలతోమాంసఖండముల విసరుచుఁ, క్రతుధ్వంసము చేయుచున్నవారు. నేనువారల నవలీలగా సంహరింపఁగలను కానిక్రతుదీక్షితుఁడనై యుండుటచే శస్త్ర

ప్రయోగమునకుఁగాని, శాపప్రయోగమునకుఁగాని, వలనుకాకున్న యది.

అదీక్షాకాలమున నాప్రక్కనిలచి, యాగధ్వంసకులగు రాక్షసుల సంహరించి, నాయాగమును గాపాడుటకు శూరాగ్రగణ్యుఁడగు నీజ్యేష్ఠపుత్త్రుని రాముని నవనీరదశ్యాముని నాకొసంగుము అన ఆకౌసికునికోరిక చెవినిఁబడినతోడనే పిడుగుపాటునకు మహీధరమదురునట్లు ఆమహీకాంతుఁడు బెదరి, సింహాసనముపైనొఱిగి, యెట్టకేలకు స్మృతినంది కౌశికునితో నిట్లుపలికెను.

దశర:—దయామయా! గాధేయా! నానందనుఁడగురాముఁడు పదునారేండ్లకు లోఁబడిన పిన్నవయసువాఁడుకాని ప్రౌఢుఁడగువీరుఁడు కాఁడు. అట్టిరాజీవలోచనుఁడు రాత్రించరయోధులతో నెంతమాత్రము యుద్ధముసేయఁదగఁడు కావున రామునివిడువుడు నేను చతురంగబలములతోఁగూడి, మీతోవచ్చి రక్కసులయుక్కడంచి, మీచేనవభృధస్నానము చేయింతును.

విశ్వామి:—రాజేంద్రా! రాముఁడేమియుఁ జేయఁజాలని బాలుఁడనిభావింపకుము. నాకును, మహాతేజశ్శాలియగు నీయరుంధతీకాంతునకును, తత్త్వవేత్తలగు మునివరులకును, రామునినిజతత్త్వము తెలియును. కావున రామునిసామాన్యునిఁగాఁ దలంపక నాకొసంగుము.

దశర:—కౌశికసంయమీంద్రా! ఇల్లువిడిచి పైకిఁనొంటరిగా బోనెఱుంగని రాముఁడేడ? రక్కసులతోఁ బోరుటేడ? రాముఁడిప్పటికిని తల్లికడనేనిదురించునుకాని విడిగాఁబరుండనేరఁడు. కావున మన్నించి రామునివిడువుఁడు నాచేమీకువలయు కార్యములఁ జేయించుకొనుఁడు.

విశ్వామి:—కోసలాధిపా! కేవల పుత్త్రప్రేమచే సర్వసమర్థుఁడగు రామునినసమర్థునిఁగాఁ దలంచుచుంటివి. రాముఁడు నీవుతలంచినట్లు అసమర్థుఁడగుచో నేనాతనియాచింపవత్తునా? భూపాలా! ఏలయీలీలఁబేలతనము పాలయ్యెదవు? రామునినాకొసంగుము.

దశర:—మునీంద్రా! కోపింపక, నావిన్నపమాలింపుడు. లేక లేక నాకీతుదిముదివయసున దైవకృపచే నందనులుదయించిరి. వారిని

నేను క్షణకాలమైనను విడచియుండ నేరను. అంతియకాదు నాపుత్త్రులం దరిలోను రాముఁడు నాకుఁ బ్రియతముఁడు. అంనుచే రామునివిూలోఁ బంపఁజాల క్షమియింపుడు.

విశ్వామి:—ఓతేఁడా! నీవింతయసత్యవాదివా? ఇంతటిమోస గాఁడవా? ఇంతకుఁబూర్వము నీవాడిన ఘనోదారవాక్యములనాలించి నపుడు "క్షత్త్రియజాతినెడబాసితినే" అనివగచితిని. కాని ఇపుడు నీకుటి లోక్తుల నాలించినతోడనే జన్మజన్మాంతరములకును గూడ వంచనాకో విదులగు క్షత్త్రియులకులమున బుట్టరాదని తలంచుచుంటిని.

రాజా! నీపుత్త్రుల క్షణముకూడ విడువనేరవా? అట్లైన వారినిగురుకులమునకెట్లుఁ బంపఁగలిగితివి? అమ్మలకడనేకాని పరుండ నేరనినీపిల్లలటఁ దరుతలములనెట్లు నిమరించిరి? దశరథా! చాలుంజాలు తెలిసెనీయావిపన ఇట్లుశుష్కప్రతిజ్ఞలచే నర్థులమోసబుచ్చుచు, చిరం జీవివైయుండుము. ఇట్టియోగ్యతకలనీకడ నీవసిష్ఠుఁడు గురుఁడుగానుం డుటకెట్లంగీకరించెను? ఊ! ఏలనాకీవితర్కము. అన్నా! చెవిటివానియొద్ద శంఖమూదినట్లు లుబ్ధునికడవ్యర్థముగాఁ బ్రార్థనావాక్యములఁ బలికితినే? ఇక వేఱొకయుత్తమక్షత్త్రియునికడకేగుట మంచిది.

దశర:—తాపసేంద్రా! మీకుఁగావలసినది రాక్షససంహారము కాని రామాహరణముకాదుకదా! అట్టిస్థితిలో రాక్షసయుద్ధములలో వారితేరిన నేనువచ్చి, వారిసంహారింతునని ఘోషించుచుండ నన్నువిడచి వేఱొకనికడకేగన్యాయమా? ఇందునామోసమేమియున్నయది? మీరు కోరినకార్యమును నేనునెఱవేర్పనని పలికినపుడుకదా! మీరిట్లు కఠిన ముగానుడువవలయును.

విశ్వామిత్త్రుడు:—చాలు నీసాహాయ్యము ఇపుడేకదా "తుది ముదివయసుననుంటి" నంటివి. అట్టిజరఠుడవు విల్లుబట్టఁజేయియు, నిలు వఁగాళ్లును, వణకుచుండ దృష్టిదోషివై, నిశాచరవీరులఁ గొట్టవత్తుననుట కెట్లు సిగ్గుపడకుంటివి? అనివసిష్ఠునిఁజూచి ఇట్లుపలికెను.

విశ్వామి:—సోదరుఁడా! వసిష్ఠమునీంద్రుఁడా! నేనేగెద నీవీ యసత్యవ్రతునిఁబట్టికొని బాకులాడక నందినీకల్పితములగు సంపదలసా

ఖ్యముగా ననుభవింపుము." ఇకపుమీపాటికి తేనిపౌరోహిత్య కృత్యమును అని యాసనమునుండిలేచి, వనమహీరుహముల దహింపఁబఱచు లు వెడలిన దావానలముభంగి, మండిపడుచున్న కౌశికునిఁ జూచినతోడనే సభాసదులెల్లరు "నేఁడేదియో విపరీతకార్యము జరుగనున్నది." అనిభీతిల్లఁదొడంగిరి. అంతవసిష్ఠమహర్షి లేచి, దశరథునితో నిట్లుపలికెను.

వసిష్ఠుఁడు:—అజతనయా! ఆడినపలుకులకై యసువులనుగూడ నిర్లక్ష్యముగాఁద్యజించు దానవీరులఁగన్న భానువంశమున జననమొంది, ధీరుఁడవనియు, ధీమంతుఁడవనియు, దానశౌండుడవనియు, ప్రసిద్ధిఁజెందిన నీవుపలికినట్లుసేయక వెనుకంజవేయుట పాడికాదు. ఇదియునుఁగాక, సంతసింపఁదగు సమయమున వ్యర్థముగా బెగడొందుచుంటివి. ఇతఁడు త్రిలోకముల నొకక్షణములో సృష్టింపగలిగినట్టియు, వేఱొకత్రుటిలో వానినిగిట్టింపఁగలిగినట్టియు బ్రహ్మర్షియనిపేరొందినట్టియు, విశ్వామిత్రుఁడు వరదానాపేక్షియై ఇటకువచ్చుట నీభాగ్యముకాకమఱేమి? ఆనాఁడు బలికి వామనరూపుఁడగు శ్రీహరియు, ఈనాఁడునీకు బాపనరూపుఁడగు కౌశికుఁడును ప్రతిగ్రహీతలుగాసమకూరిరి. ఇదిసంతసహేతువుకాదా?

మఱియు నపూర్వములగు దివ్యాస్త్రవిద్యల రామునకుపదేశింప నెంచి, కాఱడవులదాటి, క్రతుసంరక్షణమిషచే, రామునిఁగొనిపోవ వచ్చినాఁడు అంతియకాని దానవభీతుఁడైరాలేదు మారీచాదులేకాదు దిక్చక్రమునఁగల రక్కసులందరు నొకపెట్టునఁ దనపైకివచ్చినను నొక్క కోలతోనారినేలఁగూలనేయఁగలఁడు. శాపానలముచే రాత్రించరాటవిని మొదలంటదహింపగలఁడు ఈతాపసవీరుఁడు తనయొద్దనున్నదివ్యాస్త్రముల గడ్డిపోచలకుపదేశించి ప్రయోగించినను ఆగడ్డిపరకలు రాక్షసానీకముల దూలలవములవలె దహింపగలవు. ఆనాహాకశక్తి యస్త్రవిద్యయందుఁగలదుకాని యభ్యాసకునియందు లేదు. అట్టియపూర్వధనుర్వేదము నభ్యసించుటకు నర్హులగుద్విజకుమారులు తండోపతండములుగాఁ దనయాశ్రమముననున్నను, వారికుపదేశింపక నీసుతునివిద్యార్థినిగా వరించుచున్నవాఁడు మామిత్రుఁడగునీగాధేయుఁడు బాపఁడయ్యు క్షత్రి కులాభిమానమునుమాత్రము వీడనేరకున్నవాఁడు. కావుననే ఇతరకుల

మునందలి కుట్రలవదలి, రాకొమరుఁడగు రామునికి దివ్యాస్త్రవిద్యల నుపదేశింపఁగోరుచున్నవాఁడు. సంస్కారములు బాహ్యరూపముల మార్పఁజాలునుకాని, మానసికవృత్తుల మరలింపనేరవు. రాజులుబ్రాహ్మణులైనను, బ్రాహ్మణులురాజులైనను కులాభిమానబీజములంతరంగమున మొలకలెత్తుచునేయుండునుకాని శూన్యములుకానేరవు.

ఓకౌసల్యారమణా ! మాఱుపలుకక వెంటనేరాముని విశ్వామిత్రునికొసంగి నీక్షత్రకులమర్యాదను నాపురోహితకులగౌరవమును నిలువబెట్టుము. అనిబోధింప దశరథుఁడు నిజసుతులఁబిలిపించి రామునితో నిట్లుపలికెను.

దశర:— రామచంద్రా ! ఈవిశ్వామిత్రమహర్షి యాగవిఘ్నకారులగు రాత్రించరుల నీచేసంహరింపఁజేసి యజ్ఞమునుసాగింపఁగోరి నీకైవచ్చియున్నవాఁడు. నేనునిన్నుబంపసమ్మతించితిని. కావున వీరివెంట నేగి క్రతువునుగాపాడి, కీర్తినిగొనిరమ్ము.

రాముఁడు:— సుతవత్సలా ! కోసలాధిపా ! మీయాజ్ఞానుసారము కౌశికమునీంద్రులవెంటనేగి వారియాగమును సాంతముగాసందర్శించి, వారియాశీశ్శులనందుకొని, వత్తును కానితండ్రీ ! నాకుబహిఃప్రాణమగు లక్ష్మణునిగూడ నాతోఁగొనిపోవుటకంగీకరింపవలయును.

దశర:— రామా ! ఇదికోరనక్కఱలేదు. మీరిరువురు నెడబాటులేనియున్నదమ్ములు. సౌమిత్రిని నీతోఁదీసికొనిపోవచ్చును అనిరామలక్ష్మణుల విశ్వామిత్రునకునొప్పజెప్పి జాగుసేతకుక్షమియింపవేడెను. శ్రీరాముఁడు కౌశికునకునమస్కరించి "మునిరాజేంద్రా ! మేము మాతల్లులకడకేగి వారిసెలవులైకొనివచ్చుటకు ననుజ్ఞనొసంగవలయును" అనవిశ్వామిత్రుఁడిట్లుపలికెను. "నయనాభిరామా ! రామా ! మీరు తప్పకతల్లులకడకేగి వారియంగీకారములను ఆశీర్వాదములను జేకొనిరండు తొందరలేదు." అనరాముఁడు! "మహాభాగ్యము పోయివత్తుము." అని తెలిపి తమ్ములతోఁతల్లులకడకేగి నమస్కరించి ఇట్లుతెలిపెను.

రాముఁడు:— మాతలారా! వింటిరికదా? విశ్వామిత్రాగమనవార్తను?

కౌసల్య:—కుమారా! తెలిసికొంటిమి. నిన్నుబిలువవచ్చిన సేవకులవలన.

కైక:—రామచంద్రా! ఆయుగ్రతాపసి యెందులకువచ్చె?

సుమిత్ర:—రామా! అతఁడు తిరుగమనకులగురునితోఁ గయ్యమాడనెంచెనా? లేక యేదియేని యాగముచేయనెంచెనా?

రాముఁడు:—సాధ్వీమణులారా! ఆమహర్షి కలహాకాంక్షచే రాలేదు మఱేమన ఆతపసిచేయుచున్న జన్నముచు రక్కసులు సాగనీకున్నవారట వారిని సంహరింపఁజేయుటకై నన్నుఁదీసికొనివెళ్ళవచ్చినాడు కావున ఆశీర్వదించియనుజ్ఞనొసంగుడు.

కౌసల్య:—అయ్యోబిడ్డా! ఆతపసికి బుద్ధిసడలెనాయేమి? లేకున్న నీరజలోచనుఁడవగునీ వెక్కడ! ఆక్రూరనిశాచరవీరులెక్కడ? ఇంతమాత్రము యోచింపకుండునా?

కైకేయి:—ప్రియనందనా! నినువారితోఁబంప సాకేతసార్వభౌములంగీకరించిరా?

రాముఁడు:—సందేహమెందులకు అర్థిమనోరథములనీడేర్చుటయే ప్రభాకరాన్వయనందనపారిజాతములకు సహజలక్షణముగదా?

సుమిత్ర:—సుధామధురభాషణా! రవికులభూషణా! అట్లగుచో నీవుకౌశికయాగసంరక్షణమొనర్తువన్నమాటయే.

రాముఁడు:—సతీమణీ! మీయాశీఃప్రభావముచే, నేనొక్కరుఁడ కాదు. నాతమ్ముఁడు లక్ష్మణునితోఁగలసి, యామునికియాగఫలము సమకూర్పనభిలషించుచున్నవాఁడ.

కౌసల్య:—రామా! నీవుమమ్మొడబాసిపోవుటకు నేనంగీకరింపను.

సుమిత్ర:—అక్కా! కోసలసార్వభౌముఁడు రామునిబంపబాస చేసియుండ మనమునివారింపనగునా?

కౌసల్య:—సోదరీ! కాకేమి అంతగావచ్చిన నేనాకౌశికునిపాదములపైఁబడి పుత్త్రభిక్షముపెట్టుమని ప్రార్థింతును. వసిష్ఠుని రామగమనము నివారింపుడని వేడికొందును. అంతియకాని యంతకరూపులగు రక్కసులవాతఁ గొడుకుపడ నంగీకరించుదానఁగాను.

కైకేయి:—పట్టమహిషీ ! అట్లుపట్టుపట్టిన "రాజుమంచివాడే కాని రాణులుగయ్యాళులు" అను లోకాపవాదమునకు లోనగుదుము. కావునఁ గొంచెము రోషింపుము.

లక్ష్మణుఁడు:—అమ్మా ! కౌసల్యాదేవీ ! మొన్నమాయన్నద మ్ముల వసిష్ఠునితో గురుకులమునకు సంతోషముగాఁబంపి ఇపుడేలకౌశి కునితోనంపజంకుచుంటివి ?

కౌసల్య:—లక్ష్మణా ! అదివిద్యాభ్యాససమయమగుటచే గురు వులతో నేగనంగీకరించితిమి.

భరతుఁడు:—జననీ ! అదివిద్యాభ్యాససమయము ఇదివిద్యాప్ర కాశసమయము. అమ్మా ! విద్యార్థులు తామునేర్చినవిద్యలఁ బ్రదర్శింప నేరనినాడు వారువిద్యావిహీనులతో సమానులేకాని యధికులుకాఁ జాలరు.

శత్రుఘ్నుఁడు:—తల్లీ ! మాయన్నభరతుఁ డెలిపినటుల మణు లు శాణమునరాయఁబడి కాంతివంతములై వెలయున ట్లు రాజకుమారులు రణమునరిపులతోఁబోరి, తేజోవంతులై వెలయుదురు. కావున మాయ న్న నేర్చినవిద్దెలకు వన్నెరానున్నపుడు తామడ్డుపడఁజనదు.

సుమిత్ర:—అక్కా ! కౌసల్యాదేవీ ! సర్వజ్ఞులగు వసిష్ఠభగవా నులయనుమతిని మనప్రాణేశ్వరులు రాముని కౌశికునితోఁ బంపుచున్న వారు. కావున వాత్సల్యవశంవదవై వేరుగాఁదలపకుము.

కౌసల్య:—సోదరీమణులారా ! నాకంటెమీకే రామఁడెక్కు డుప్రేమాస్పదుఁడు మీయిష్టానుసారము చేయుడు. రాముఁడా కౌసల్యా కులకు సంతసించి భరతశత్రుఘ్నులఁజూచి ఇట్లుపలికెను.

రాముఁడు:—సోదరులారా ! భరతశత్రుఘ్నులారా ! మాపై ధ్యానముంచి తలిదండ్రులయాజ్ఞలనేమరకుడు పోయివచ్చెదము.

భరతుఁడు:—అన్నా ! రామచంద్రా ! నీవుమాకండ్లకగపడుచు న్నయపుడే నిన్నుస్మరించుమేము నీవుమాకుదూరమై యున్ననాడు తలంపకుండుటయెట్లు ?

శత్రుఘ్నుఁడు:—అన్నా! రాక్షసవధిజేతవై తిరుగవచ్చునపుడు మాకేమి తెత్తువు.

రాముఁడు:——చిన్నితమ్ముఁడా! రాజనందనుల పేక్షింపఁదగిన వస్తువులు తాపసాటవియందునా? సోదరుఁడా! కౌశికమునీంద్రుని కృపచే నపూర్వభాగ్యమేదియేని సమకూరుచో నందుమన సుందరము సమభాగులమే. అని సుమిత్రతో నిట్లుపలికెను. "జననీ! సుమిత్రాదేవీ! నాతో లక్ష్మణునిగూడఁ దోడ్కొనిపోవ సమ్మతింపవలయు."

సుమిత్ర:——రామచంద్రా! ఇదికోరనక్కరలేదు. నీతోనీచరణములెట్ల వినాభావముగానుండునో అటులనే నీపదపంకజసేవకుఁడగు లక్ష్మణుఁడును నీతో నెడబాటులేనివాఁడే బాలశూరుఁడా! రాక్షసులఁ గూలనేసి తపసియాగమునుగాచి మీతల్లులకువీరమాతలనెడి కీర్తినిగొనిరమ్ము పొమ్ము సుఖముగామునితో రాముఁడు "చిత్త"మని తల్లులవీడ్కొని విశ్వామిత్రునికడకువచ్చి నమస్కరించి నిలచెను. అంతవిశ్వామిత్రుఁడా రాముని వినయసంపదకు సంతసమంది వసిష్ఠదశరథులతోఁ బోయివత్తునని పలికి రామలక్ష్మణులవెంటనిడికొని వెడలిపోయెను.

## అష్టాదశాధ్యాయము.

### —♦ తాటకాసంహారము ♦—

"ఓహో! ఏమియీవిశ్వామిత్రుని భాగ్యము. వీతరాగులను పరమహంసలు శ్రుత్యంతవిహారియగు నేయానందాద్వైతీయరూపునిఁ దెలిసికొనఁ బ్రయాసపడుదురో; యట్టిపురుషోత్తముఁడు నృపకుమారరూపుఁడై ప్రభువు వెంటఁ బరిచారకునిపగిదిఁ దనవెంటరాఁ బ్రయాణమొనర్చుచుండెను." కౌశికుఁడట్లు రామలక్ష్మణులతో నయోధ్యనువీడి, యాఱు క్రోశముల దూరమేగి, తనపిఱుంద మోమునఁజిఱుచెమటలు మొలకలెత్త, లలాటమున నలకలల్లలాడ, చిఱుఁగప్పుతోఁ దూణీరము భుజస్కంధమునను ఎడమచేతఁ గోదండమును, కుడిచేత బాణమును, బట్టుకొని తమ్మునితో నడచివచ్చుచున్న మోహనరూపుఁడగు రామునిఁజూచి ఆనందభరితుఁడై యిట్లుపలికెను.

కౌశికుఁడు:—కౌసల్యానందనా! మీసోదరులముఖవైఖరిచూడఁ గొంచెమాయాసము చెందియున్నట్లు కానవచ్చుచున్నవారు. కావున నదీజలములనాచమనమొనర్చి యిటురండు మీకురెండు విద్యలనుప దేశింతును. వీనినిగ్రహించుటచే నిద్రాహారములు లేకున్నను, నెట్టికష్టములును గలుగనేరవు.

ఆమాటలువిన్నతోడనే రామలక్ష్మణులు జలములనాచమించి, విశ్వామిత్రునుండి విద్యలగ్రహించిరి. ఆవిద్యలు వారియందుసంక్రమించినతోడనే బాలసూర్యులవలెఁ దేజరిల్లఁదొడంగిరి.

అటవారారాత్రి దర్భశయ్యలపై శయనించిరి. తెల్లవారినతోడనే విశ్వామిత్రుఁడు దర్భలపైఁగనులుమూసి నిదురించుచున్న యారాజకుమారులఁజూచి "కౌసల్యానందవర్ధనా! రామా! సూర్యోదయము కానున్నయది స్నానాదికృత్యములఁ జేయవలసియున్నది కావున లెమ్ము తమ్మునితో" అన రాముఁడు వెంటనేలేచి, తమ్మునిమేల్కొల్పి, ప్రాతస్నానాదులఁదీర్చికొని, మునివెంటనేగుచు నొకదివ్యాశ్రమమును దిలకించి కౌశికునిట్లుప్రశ్నించెను.

రాముఁడు:—మునివర్యా! ఈదివ్యాశ్రమమెవరిది? ఇందలిమునులు ప్రత్యక్షశివస్వరూపులుగాఁ గానవచ్చుచున్నవారు ఈస్థలమహాత్మ్యమును దెలుపుడు.

విశ్వామి:—రామచంద్రా! చక్కఁగగుర్తించితివి. ఇయ్యది శివమహిమతోఁగూడినవనమే వినుము దీనియుదంతమును కౌసల్యానందనా! మున్నొకపుడు పురహరుఁడు విరాగియై తీవ్రసమాధిని గన్నులు మూసికొని తనలోనున్న యద్వితీయానందస్వరూపమును ధ్యానించుచు నన్యమెఱుంగక యిటఁదపమాచరించుచుండెను. అట్లుఘనవిరాగియైయున్న హరునకుఁబరిచర్యలనెఱప నగరాజు తనతనయయగుగౌరిని నియమించెను. ఆపార్వతి చంద్రశేఖరునిసేవించుచుండ, స్వార్థపరుఁడగు దేవేంద్రుఁడు విరాగియగుకపర్దికిఁ గౌర్యాయనిపై ననురాగమును బుట్టించి, యాపురహరుని సంసారినిగాఁజేయఁదలఁచి, సుమాస్త్రునిరాఁ

బిలిపించి, మంచిమాటలతో నాపూర్వులుకానిలాలించి, యామనసిజుని శివునిభార్యలేపిప్రియునిగాఁ జేయుఁబుఱిగొల్పెను.

పాపమాపిచ్చివాఁడగు పంచశరుఁడు సురపతియొక్క తేనిపలుకుల కుబ్బి, సాధ్యాసాధ్యములఁ గుర్తింపకయే "క్షణములోఁబశుపతిని గిరిజా మోహపాశబద్ధునిగాఁజేయుదును" అనిప్రతినఁజేసి, ఒకమనోహరమగు వసంతసమయమున శివాశ్రమమునకేగి, కోకిలకలకూజితములను, సౌర భలసితములగు మలయమారుతములను, నవరాగకలితములగు కిసలయ బాణములను, సహాయములనుగాఁజేకొని, దూరమునుండి వెండికొండ వలెఁ దేజరిల్లుచున్న మహేశ్వరునీక్షించి, చకితచేతనుఁడై యామీనకే తనుఁడు జేజేలకడఁ దాఁజేసిన బాస, పిలువఁబెట్టికోనఁగోరి, చేతనున్న చెఱకువింట, మావిచిగురాకుతూపును దొడిగి యామక్కంటిని గురు వెట్టికొట్టెను.

అంత నాసహకారకిసలయాశుగము సూలియుల్లమునదాకి, సమాధినిభేదింప నావిషమనయనునకుఁ గామమంకురింపలేదుకాని, క్రోధమావిర్భావమాయెను. అందుచే నారుద్రుఁడుగ్రుఁడై, నిజఫాల నయనాగ్నిజ్వాలలచేఁ గామునిబుగ్గిచేసెను. "నిజమే! సామాన్యభూపుల కోపములే సంసారుల భస్మముచేయుచుండ, జగదీశ్వరాగ్రహము మన్మథునిమాడ్చివేయుటలో వింతయేమున్నయది."

అంత హిమాచలతనయ తనభక్తిప్రపత్తులచే నాశంకరుని నశం కరునిగాఁజేసికొని, యాతనికర్ధాంగియై కృతార్థురాలయ్యెను. అదిమొ దలీపుణ్యతపోవనభువిని నివసించుమునులు ఇందుశేఖరుని ధ్యానించుచు నిందుఁదపమాచరించుచున్నవారు. ఇట మీనకేతనుఁడంగహీనుఁడగు టచే నీదేశమునకంగదేశమని పేరువచ్చినది. రామచంద్రా! మనమీ రాత్రియిటఁగడపి, తెల్లవారినతోడనే జాహ్నవీనదినిదాటి, ముందు నకుఁబోవుదము అని, అచటిమునులొసంగిన ఫలమూలాదులఁజేకొని కౌశికుఁడు రామలక్ష్మణులఁగుశశయనములపైఁ బరుండఁజేసి, తెల్లవారక మున్నే నృపకుమారులతోగంగాతీరముఁజేరి యచటిసంయమీంద్రుల

పూజలనందుకొని, భాగీరథినిదాటి వెడలుచుండ, రాముడు ముందొక నిర్జన భీకరాటవినిగాంచి, యిట్లుప్రశ్నించెను.

రాముడు:—మునీంద్రా! ఈముందుగానవచ్చు నరణ్యము పేరేమి? ఇదియిట్లుసత్వశూన్యమై యుండుగారణమేమి?

విశ్వా:—రామచంద్రా! నీకుదీనివృత్తాంతము తెలుపదగిన దియే. వినుము ఈవిపినమునకు దాటకాటవియనిపేరు. దీనియందు దాటకయను యక్షాంగనయొకర్తు భర్తనుబాసి, భయంకరనిశాచరీ రూపముతో దిరుగుచుండును. ఇందుగలసత్వములన్నియు దానివాత బడినవి. అందుచే నీప్రదేశముజంతుసూన్యమై యున్నయది.

రాము:—ఆర్యా! యక్షకాంతలు లోకోత్తరసుకుమారసుంద రాంగులని ప్రసిద్ధికలదే! అట్టిస్థితిలో దీనికీ రాక్షసరూపమెట్లువచ్చె?

విశ్వా:—వినుము. సుకేతుడను యక్షనాయకుడు అజునిగూర్చి తపమొనరింప నాయబ్జాసనుడు ప్రత్యక్షమై "నీకేమికావలయు" నని యడుగ అసుకేతుడు నాకుసహస్రనాగములబలముకల సుతుడు కావలయును" అని కోరెను. వాణీపతి యదివిని "నీకుబ్రస్తుతము పుత్రుడుకలుగడు నీవుకోరినదానిని వేయియేనుగులసత్తువుకల పుత్రికపుట్టును" అని యంతర్ధానమయ్యెను. అంతగొంతకాలమునకు సుకేతునకు వేయిమదగజములబలముకల యొకకూతురుపుట్టెను. అతడాబిడ్డకు దాటకయని పేరుపెట్టి అల్లారుముద్దుగా బెంచికొనుచుండెను. ఆబాలిక యును గ్రమక్రమముగాబెద్దదై, పర్వతరూపముతో నడగొండవలె సంచరింపదొడంగెను. ఆకాలముననే జంభుడనురాక్షసుడు సురేంద్రుని సంహరింపదగుసుతుని బడయగోరి, శివునిగూర్చితపమొనర్చి యాదేవ దేవునివలన బదివేలయేనుగులబలముగల పుత్రుని బడసి, యానందనునకు సుందుడనినామకరణమొనర్చెను. జంభుడు మహాబలుడగునంద నునితోగూడి, దేవతలను పీడింపదొడంగెను. దేవతలు వానిబాధకు దాళజాలక, యగస్త్యమునీంద్రునికడకేగి, జంభసుందుల విజృంభణ మునుదెలిపిరి అప్పుడుకుంభజుడు దేవేంద్రునకు రాక్షసాంతకమగు

నస్త్రమునొసంగి, ఇంద్రునిచే జంభునిఁజంపించెను. సుందుఁడంతుచేఁ గుంభజునిపైఁబగపట్టియుండెను

ఇటులుండ సుకేతుఁడు తనతనయయగు తాటకకు వివాహయోగ్యమగు వయసురాగా, నామెకుఁ దగుభర్తను సమకూర్ప యత్నించుచుండెను. నారదుఁడీసంగతిని దెలిసికొని, సుకేతునికడకేగి సుందునకుఁ దాటకనొసంగుమని తెలిపెను. సుకేతుఁడు వెంటనేతననందనను సుందుని కిచ్చి పెండ్లిచేసెను.

సుందుఁడా సుందరాంగితోఁగూడి కాపురముచేయుచుండ, ఆదంపతులకు మారీచుఁడను కొమరుఁడుపుట్టెను పిమ్మట సతీపతి సుతులు ముగ్గురు లోకవినాశనవ్రతకంకణముల ధరియించి, ప్రాణులఁబీడింపఁ దొడంగిరి. వారినిసంహరించువీరులు కానరాకుండిరి. ఇటులుండ,

అగస్త్యుఁడొకనాడు ప్రయాగకేగుచుండ సుందుఁడుచూచి తన తండ్రినిజంపించిన పగఁదీర్చుకొననెంచి, యాసాగరపాయి కడ్డముగా నిలచి "నిలువుమెటకుఁబోయెదవు? చిక్కితివిన్ని నాళ్ళకు" అనికరవాలమును దూసినరుకఁబోవ నాసంయమీంద్రుఁడు హూంకారముచే వానిని సంహరించెను.

ఆసంగతిని తాటకామారీచులు తెలసికొని అగస్త్యుని జంపఁబోవ "దుష్టులారా! సుందసుందరీనందనులారా! మీరు యక్షరూపములను వీడి రాక్షసరూపములతో నుందురుగాక!" అనిశపియించి వెడలిపోయెను అదిగో ఆలోపాముద్రాకాంతునిశాపముచేఁ దాటకామారీచులు నిశాచరరూపులైరి. అది మొదలు తాటక భీకరరాక్షసరూపమై, యీయుటవిని నివసించుచు. బ్రాణులఁబీడించుచున్నయది దీనిమూలమున నెన్ని యోగాశ్రమములు జనశూన్యములగుచున్నయవి కావున రామచంద్రా! నీవీక్రూరరాక్షసిని గడతేర్చు ప్రాణిసమూహములఁ గాపాడుము నేను నిన్నీమార్గమునఁ దీసికొనివచ్చుటకుఁగారణము నీచేఁదాటకాసంహారము చేయించుటకే.

రాముఁడు:—గురువరా! పెద్దలయాజ్ఞలువిమర్శింపక యాచరింప తగినవియే. కాని, మునీంద్రా. ఈస్త్రీవధ లోకనిందాకరమని నాహృద

యము బెదరుచున్నయది. నన్ను మీయానకైనఁ గాదు వానినిగాఁదలంపక నాకుధర్మమునుబోధింపఁ గోరుచున్నవాఁడను

విశ్వా:—క్షత్రియకుమారా! బెదరఁబనిలేదు; దుష్టసంహారము రాకొమరులకు విధివిహితము పుణ్యప్రదము యశస్కరము. పెద్దపులులు నల్లత్రాఁచులు, లోనగుదుష్టజంతువులెట్లు స్త్రీపుంభేదములేక సంహరింపఁబడునో యటులనే స్త్రీపురుషభేదమును బాటింపక దుష్టులశిక్షింపవలెను. దండనము దోషమునుబట్టి చేయవలయునుగాని లింగభేదమును బట్టికాదు. నీవీయొక్కరక్కసిని జంపితివేని వేనవేలజీవులఁ గాపాడినపుణ్యాత్ముఁడవు కాఁగలవు కావున సంశయమునువీడి, యీక్రూరరాక్షసిని సంహరింపుము. ఇందు స్త్రీహత్యాదోషమెంతమాత్రమును లేదు. అనుచుండఁ బర్వతగుహాలు ప్రతిధ్వనించునటుల బొబ్బలిడుచు, నాకసమునఁ గారుమబ్బువలె నొకభయంకరవ్యక్తి కానవచ్చెను రాముఁడానడగొండవలె గనబడుచున్న యాభూతాకృతిని లక్ష్మణునకుఁజూపి యిటులుపలికెను.

రాము:—తమ్ముఁడా! కంటివా! దీనిభీకరాకారమును! నిజముగా దీనినికనుగొన్నమాత్రాన దుర్బలమానసులు ప్రాణములనట్టెవిడుచుటకు సందేహములేదు కానిసోదరుఁడా! ఈవృద్ధాంగనను జంపఁజేతులాడకున్నయవి కావున దీనికరచరణములనరకి, నేలఁగూలనేతును. చూడుమనుచుండగనే, యాదండముండ రామలక్ష్మణులఁజూచి, బిగ్గఱగనార్చి యడవిలోనిదుమ్ము దోసిళ్లతోఁదీసి, వారిపైఁజల్లుచు, గొండరాలను విసరనారంభించెను వెంటనేరాముఁడు దానికాలుసేతులఁదెగనఱకెను.

అంతనాయక్షి పక్షివలె నెగురుచు లక్ష్మణునిమీఁదికిరాగా నాతఁడు కత్తిచేదానిముక్కుసెవులఁగోసెను. అటుపిమ్మట నానిశాచరి రాక్షసమాయలఁబన్ని, యాయడవియంతయు నంధకారబంధురముగాఁ జేసి, రక్తమును వర్షింపఁదొడఁగెను. మొగులురుమునట్లు చెవులుపగుల ధ్వనిసేయనారంభించెను. అప్పుడుకౌశికుఁడు "రామా! రామా! జాగుసేయక యీక్రూరరాత్రించరిని సంహరించి, గోబ్రాహ్మణాదిప్రాణివ్రాతమునకు మేలుసమకూర్పుము." అనఁ రాముఁడు ధనస్సున శబ్దభేది

బాణమునుసంధించి, చీకటిలో నార్చుచున్న యాతాటకగుండెపగులఁ గొట్ట నాపాపాత్మురాలు హా! చచ్చితిననీ” యార్చి నేలపైఁబడెను.

అపుడు ఖేచరులు పుష్పవర్షముల రామునిపైఁ గురిపించిరి.

—: ఏకోనవింశత్యధ్యాయము :—

దివ్యాస్త్రోపదేశము.

విశ్వామిత్రుఁడు పరమానందభరితుఁడై రామునిఁ గౌగలించుకొని “దశరథనందనా! యెంతకాలమునకీయరణ్యముఁ దాటకా పీడావిముక్తముగాఁ జేసితివి ! ఇకనిట మునిసంఘములు నీపేరఁ బల్లెలఁ గట్టికొని, నిత్యమునినుఁదలంచుచు సుఖముగానుండఁగలరు పథికులు నిర్భయముగా నీయటవీమార్గమునఁ బ్రయాణముల సాగింపఁగలరు. మనమీరాత్రి యిందునివసించి, రేపుసిద్ధాశ్రమమున కేగుదము. ఇకనీయడవికి రామకాననమని పేరువచ్చును. ఇందుఁదపమాచరించువారికిఁ జిత్తశుద్ధియు, భగవద్భక్తియుఁ గలుగఁగలవు అనివరమొసంగెను.

ఆనాఁడే యాయరణ్యము క్రొత్తసింగారముతో వెలయఁజొచ్చెను. ప్రశాంతమగు నాసాయంతనసమయమునఁ బక్షిసంఘములు సంతసముతోఁ బరిగిడివచ్చి వృక్షాగ్రములవ్రాలి చెవికింపుగాఁ గూయుచు గూడులఁగట్టమొదలిడెను. అందలిమహీకుహములు సందెకెంజాయను మించు లేఁజిగుళ్ళఁదొడుగ నారంభించెను. సింహవ్యాఘ్రాదిశ్వాపదములు మహీధరకందరముల జేరఁదొడంగెను. అజహరిణాదిసాధుమృగములు లతాకుంజముల నిదురింపనేగెను. మునిముచ్చులటకువచ్చి, కుటీరనిర్మాణములకై స్థలనిర్ణయములఁ జేయఁదొడంగిరి. ఇట్లాతాటకాటవి విహగగణకూజిత సుందరమై మృగనివహానిరంతరమై; మునిసమాజసమావృతమై కౌశికహృదయానందజనకమై రామచంద్రమందహాసచంద్రికాలసితమై విలసిల్లెను.

విశ్వామిత్రుఁడా రాత్రి యటసంతోషముగాఁగడపి, తెల్లవారిన తోడనే సరసీజలముల రామలక్ష్మణులతోఁగూడి స్నానమాడి, ఉత్తరాభిముఖముగ రామునిఁగూర్చుండఁబెట్టి తాఁ బ్రాఙ్ముఖుఁడై “రామచంద్రా! నీధైర్యస్థైర్యములకు సంతసించితిని. నీకునాకడనున్న దివ్యాస్త్రముల

నుపదేశింప నెంచితిని. సుధీమణీ! గురుఁడు విద్యార్థులకు వారియర్హతను దెలిసికొని, విద్యలనుపదేశింపవలయును గాని, పాత్రాపాత్రులదెలియక త్వరపడిచనువుల బోధింపరాదు. అందులో నస్త్రవిద్యల నుపదేశించునపుడు, శిష్యులబాగుగాఁ బరిశీలింపవలయును. అందుచే నీసామర్థ్యమును దెలిసికొనువఱకు నీకస్త్రములబోధింపనైతిని ఇప్పుడు నీవొనర్చినతాటకాసంహారము ఇంద్రాదిదేవతలకుఁగూడ శక్యముగాకుండెను. అంతటి మహాబలసంపన్నయగు రాక్షసిని నీవనాయాసముగా సంహరించి, నీయనుపమానపరాక్రమమును ప్రకటించితివి. కావున నీవుదివ్యాస్త్రగ్రహణమునకెంతయుఁ దగియున్నవాడవు రామచంద్రా! సమంత్రకముగా నస్త్రవిద్యలఁజేకొనుము. రాముఁడు వినయముతో నాయస్త్రగ్రామమును జేకొని, దివ్యతేజోవిభాసితుఁడాయెను.

కౌశికుఁడటనుండి రామలక్ష్మణులలో ముందునకేగుచుండఁ గౌసల్యానందనుఁడొక సుందరతరమగువనమునుగాంచి యిట్లుప్రశ్నించెను.

రాముఁడు:— మునీంద్రా! మహోన్నతతరుషండమండితమై, గోహరిణాదిపశుసందోహసుందరమై, శుకశారికాదివిహగకూజితమోహనమై, చేతోహరకాసారవారివిహారి మరాళరాజిరంజితమై, నిగమాభ్యాసపరమునికుమారగీయమాన సామగానాకర్ణనాగత కిన్నరీసందోహబంధురమై, ద్వేషదూరమై, ప్రేమనిలయమై, నందనవనమునుమించి ఆగిరిదరిని గానవచ్చుచున్న వనమెవ్వరిది? దానిపేరేమి? దీనింజూచినతోడనే నామానసమున నేదియో తెలియరాని యానందముదయించుచున్నయది.

విశ్వా:— రామచంద్రా! సిద్ధాశ్రమమనిపేరు. పూర్వము శ్రీమన్నారాయణుఁడిట వటురూపమునఁ దపమాచరించి, చింతితార్థసిద్ధినందుటచే, దీనికిసిద్ధాశ్రమమని పేరువచ్చినది. ఇందుఁదపమాచరించువారికిఁ దప్పక యిష్టార్థసిద్ధికలుగును. అందుచే నసంఖ్యాకులగు మునులిందుఁ దపములసలుపుచున్నవారు నేనిందే యాగము చేయఁదలంచితిని అని యాగాధినందనుఁడు ఆదశరథనందనులతో సిద్ధాశ్రమమునఁ బ్రవేశించినతోడనే, యందలిమునులెదురేగి వారలఁబూజించిరి, రామలక్ష్మణులు

ములకెల్లరకు నమస్కరించిరి పిమ్మట కౌశికునితో రాముఁడిట్లుపలి
కెను.

రాముఁడు:—కౌశికమునీంద్రా ! యీనాఁడే మీరుయాగదీక్షకు బూనఁగోరుచున్నవాఁడను నేనును నాసోదరుఁడులక్ష్మణుఁడును, మీయజ్ఞమునకు నంతరాయమురాకుండఁ గాపాడుదుము. నాయంతరాత్మ విజయముసమకూరునని బోధించుచున్నయది.

విశ్వా:—మిహిరకులాలంకారా ! నృపకుమారసింహుఁడవగు నీవు ధనుర్ధరుఁడవై నీయనుజునితో నిటనుండ, దనుజమదగజములకు యాగకాసారమును గలంపఁదరమగునా నీవుతెలిపినటుల, నేనీనాఁడే యాగారంభమొనర్తును అనిపలికి వెంటనేయాగదీక్షఁజేకొనెను. ఆవెంటనే రాముఁడచటిమునులనిట్లుప్రశ్నించెను.

రాముఁడు:—మునివరులారా ! సవనమునుసాగకుండఁ రక్కసులెప్పుడువత్తురో తెలుపఁగోరుచున్నాఁడను.

మునులు:—రామచంద్రా! యీనాఁడుమొదలు షడ్రాత్రములవఱకు జాగరూకుఁడవై యాగమునుగాపాడవలయును. ఈయాఱుదివసములలో నెప్పుడో యొకప్పుడు మారీచుఁడు తనపరివారముతో రాగలఁడు కౌశికుఁడు యాగదీక్షితుఁడగుటచే మాటలాడఁడు. కావున నీవప్రమత్తుఁడవై యుండవలయును. రాముఁడామాటలువిని, తమ్మునితో రాత్రిందివములు యాగముఁగాపాడఁదొడంగెను. అయిదుదినములవఱకు యజ్ఞమునిర్విఘ్నముగాసాగెను. ఆఱవపొద్దురాగానే రాముఁడు "తమ్ముఁడా! మనమీనాఁడు బహుజాగరూకులమై యుండవలయును తప్పక యీదివసమున రాక్షసులువత్తురు" అనుచుండ మొదటనాకసమున నల్లని మబ్బులుక్రమ్మినటులు కానవచ్చెను. పిమ్మట నురుములవంటిధ్వనులు వినవచ్చెను. ఆవెంటనేరక్తవర్షము ప్రారంభమాయెను. ఆనెత్తురువానచే యాగవాటికయంతయు వసంతముచల్లినట్లెఱ్ఱగాఁ గానవచ్చెను. ఆవెనుక మాంసఖండములు పడఁదొడంగెను. అపుడు రాముఁడు తలపైకెత్తిచూచుసరికి మారీచసుబాహులు నిజానుచరులతో నాకాశమునఁ గానవచ్చిరి. రాముఁడానిశాచరులఁ దిలకించి లక్ష్మణునితోనిట్లుపలికెను

రాముఁడు:—లక్ష్మణా! బానవాధములు మేఘములవలె నభో మండలమున గుమిగూడియున్నవారలు కనుఁగొనుము.

లక్ష్మ:—అన్నా! ఈనీచనిశాచరులు హోమకుండముపై పేగు చున్నవారు. కావున వీరటకేగకమున్నె సంహరింపవలయును లేకున్న యజ్ఞమును బాధుసేయుదురు.

రాముఁడు:—లక్ష్మణా! ఇదె, కనుఁగొనుము మారీచునిముందుఁ గూలనేతును. అని కోదండమున మానవాస్త్రమునుసంధించి మారీచునిఁగొట్టెను. వాఁడాబాణవేగముచే నూఱు యోజనముల దూర మేగి సముద్రమునఁబడెను. ఆమారీచపాతమునుజూచి క్రుద్ధుఁడై తనపై కివచ్చుచున్న సుబాహునిఁజూచి, యాయాజానుబాహుఁడగురాముఁడు ఆగ్నేయాస్త్రముచే వానిని నేలఁగూలనేసెను. అంతఃంతరిక్షమున మిగిలియున్నరక్కసులను సౌమిత్రి వాయవ్యాస్త్రముచే సంహరించెను.

ఇట్లాయినకులనందనులు దావానలము జీర్ణపర్ణముల దహించు నట్టుల అబానవసంఘమును జక్కాడ రాక్షసభీతిచే దుప్పలలోను, తుప్ప లలోను, దాగియున్నమునులు పైకివచ్చి రామచంద్రునిట్లుస్తుతింపఁ దొడంగిరి.

మునులు:—దశరథనందనా! తపోనిధియగు నీగాధేయుఁడు రాక్షసబాధచే యజ్ఞమునుబూర్తిఁజేయఁజాలక, యనేకపర్యాయములు విఫలమనోరథుఁడాయెను. ఈనాటికి మీసోదరబాహువీర్యముచే నిశా చరసోదరులు సపరివారముగాఁ గూలుటవలనఁ గౌశికుఁడు యాగఫల మును బొందుభాగ్యశాలియయ్యెను. రామచంద్రా! దేవేంద్రాదులను గూడ లక్ష్యముసేయని మారీచునిమాయలు నీకడ సూర్యునిముందుఁ జీకట్లట్లు చెదిరిపోయినవి.

రాముఁడు:—తాపసోత్తములారా! ఈరక్కసులదునుమాడినది మాపరాక్రమముకాదు ఈవిశ్వామిత్రమహర్షి మాకుప్రసాదించిన యస్త్రప్రభావము. మేమునిమిత్తమాత్రులము దావతాపమడంచి భూరుహములగాపాడునది వర్షమా? మేఘమా? కావునఁ బైవిషయమున మేఘుఁడెట్లు సంస్తవనీయుఁడో, యీవిషయమున ఘనులగు కౌశిక

మునీంద్రులే స్తుతిపాత్రులుకాని వర్ణ స్థానీయులమగు మేముకాము అని పలుకుచుండఁ గౌశికుఁడు యాగమును నిర్విఘ్నముగా సమాప్తిచేసి, యజ్ఞశాలనుండిపైకివచ్చి, దిక్కులన్నియు దానవపీడారహితములై, శాంత్యానందములతో శోభించుచుండుటనుజూచి, నిజమనోవియద్వీధినుండి యానందచంద్రికాముదీకాంతులు మందహాసరూపమున వెలువడ, వీర కుమారశేఖరుఁడగు రామునిఁజూచి యిట్లుపలికెను.

విశ్వామి:—శూరాగ్రేసరా! రామచంద్రా! నీసాహాయ్యముచే గృతార్థుఁడనైతిని. సూర్యకరములకుఁ జీకటులఁబారఁదోలుటయు, రవి కులజులకు రాక్షసులఁగూలనేయుటయు, సహజగుణములు. లక్ష్మణా! ఇకముందనలమునకు ననిలముసహాయమగునటుల, లోకకంటకులగు రాత్రించరుల సంహరించుటలో నీవు రామునకుఁదోడై, లోకానంద మును సమకూర్చునట్లుచేయుము. అని రామలక్ష్మణులఁజేరఁదీసి, కౌగ లించి "మీకుమంగళావాప్తియగుగావుత" అనిదీవించెను. అప్పుడచటి మునులెల్లరు "తథాస్తు" అనిపలికిరి. అంత రాముఁడు వినయముమీర గాధేయునితో నిట్లుపలికెను.

రాముఁడు:—కౌశికసంయమీంద్రా! జనులు తమప్రతిబింబ ములనద్దములయందుఁజూచికొని, యానందించునటుల ఉపాధ్యాయులు అంతేవాసులయందు ప్రతిఫలించిన నిజవిద్యలఁదిలకించి, సంతసించుచుం దురు. నిజమూరయ, శిష్యవత్సలురగు నాచార్యోత్తములొసంగు జ్ఞాన సంపదకు సమమగుభాగ్యము వేఱొండుకలదా? అట్టిప్రేమస్వరూపులగు దేశికశిఖామణులయొక్క యప్పుఁదీర్ప విద్యార్థులెన్నిజన్మములెత్తవల యునో! తెలియదు గురువరా! తాను మాకస్త్రవిద్యలనుపదేశింపకున్న మేమీమాయావులగు దానవుల నిర్జింపఁదగుదుమా? దేశికేంద్రా! ఇక ముందుమీకింకరులు నెరవేర్పవలసిన సేవలెవ్వియో తెలుపఁగోరుచు చున్నవాఁడను. అనిచేతులుజోడించి శిరమువంచి, నిలచియున్న రాముని వినయసుందరోక్తుల కచటిమునులానందించి యిట్లుపలికిరి.

మునులు:—అహా! రామచంద్రా! అస్త్రములచే నిజప్రతాప నలతేజమునుబ్రకటించి, పలుకులచే వినయమలయానిలశీతలతను బ్రస

రింపఁజేయుచుంటివి కౌసల్యానందనా! కౌశికయాగము సమాప్తమైనదని తలంచి, సాకేతమునకేగక కొంతకాలము మాకు నీమోహనరూపమును, నీమృదుమధురోక్తులను, కనుటకును,వినుటకును, అవకాశమును కలిగింపవలయును. మఱియునో సుందరరూపా! మిథిలాధిపతియగు జనకనృపాలుఁడు సర్వదేవతామోదావహమగు యాగముజేయుచున్నవాఁడు. మమ్మాక్రతువునకు నాహ్వానించియున్నవాఁడు నీవుకూడ నీతమ్మునితో నటకురాఁగోరుచున్నవారము రామచంద్రా! యావిదేహరాజేంద్రుని యింటదర్శనీయమగు శివశరాసనముకలదు దానిని సురాసురవీరులెవ్వరు నెక్కుడఁజాలకున్నవారు నీయట్టివీరకుమారునకు ఆమారవైరిశరాసనము ప్రమోదము కూర్పఁగలదు

విశ్వా:—దశరథనందనులారా! ఈతాపసోత్తములు తెలిపినదంతయుసత్యము. మనమాశీరధ్వజుని యాగమున కేగుట పుణ్యజనకము శుభప్రదము.

రాముఁడు:— గురూత్తమా! మీయాజ్ఞలకుబద్ధులము. మమ్ము మీయిష్టానుసారము నడిపింపవచ్చును. అన కౌశికుఁడు రామలక్ష్మణుల వెంటనిడికొని, మునులుముందునడువ, సిద్ధాశ్రమమునుండి మిథిలకుఁబ్రయాణమునుసాగించి ప్రొద్దుగ్రుంకఁబోవువేళకు శోణానదతీరముచేరెను వారటసాయంతనకర్మకలాపము నివర్తింపఁజేసి సుఖాసీనులైయుండ రాముఁడు కౌశికునిట్లుప్రశ్నించెను.

రాముఁడు:—మునివరా! ఈశోణానదమునువ్యాపించి, మనోహరములగు నారామములతోడను సస్యసంపన్నములగు పొలములతోడను, అలరారుచున్న ఈదేశము పేరేమి? దీనిని బాలించువారెవ్వరు?

కౌశికుఁడు:— కౌసల్యానందనా ! వినుమీదేశచరితమును దీని నాకర్ణించుటచే మానసమునఁ గొత్త పరివర్తనము కలుగును. అనియిట్లు తెలుపనారంభించెను

—:వింశత్యధ్యాయము:—

కుశోపాఖ్యానము

పూర్వమొకప్పుడు సృష్టికర్తయగు పరమేష్ఠి భూలోకమున ధర్మార్థకామమోక్షములనెడి చతుర్విధపురుషార్థముల జక్కఁగ నెరపి,

లోకమునకు ధర్మమును బోధింప సమర్థుఁడగు సత్పురుషునిఁ బుట్టింపనెంచి, యంజలిఘటియించి, కనులుమూసి, మానసమున శ్రీహరినిధ్యానింప దోసిలియందొకశిశువు కిలకిలనవ్వుచుఁబడెను. అపుడా సరసిజాసనుఁడు కనులఁదెఱచి, నిజాంజలిపుటమునను న్న శిశువునుగాంచి, ఆబిడ్డను భూమికిఁ గొనివచ్చి, జాహ్నవీపులినతలమునఁ బరుండఁబెట్టి, వెడలిపోయెను

అంతనుషస్స్నానమునకై గంగాతీరమునకువచ్చిన మహర్షులు లేఁజిఱునగవులతో నలరారుచున్న యాచిన్నిపాపనిఁజూచి వత్సలురై, యాబాలకుని మునిపల్లెకుఁగొంపోయి, తాపసకాంతలకొసంగి, ఆబాలునకుఁ గుశుఁడని నామకరణమొనర్చిరి. మునిభామినులు సుందరరూపుఁడగు నాకుశునిఁ బ్రేమాతిశయముతోఁ బెంపఁదొడంగిరి. కుశునకునుపనయన వయసురాగానే మునులాతనికి వడుగుచేసి, వేదాదిసకలవిద్యల నేర్పిరి.

కుశుఁడు కుశాగ్రబుద్ధియగుటచే నచిరకాలములో సకలకలాకోవిదుఁడై అసమానరూపశోభాన్వితుఁడై, నిరుపమానబ్రహ్మచర్యవ్రతగరిష్ఠుఁడై, తపమాచరింపఁదొడంగెను ఇటులుండ, విదర్భాధిపతియగు సహదేవుఁడు మాఘస్నానములకై సకుటుంబముగా గంగానదికేగి, యావేల్పుటేటియొడ్డునఁ బటకుటీరముల నెలఁగొల్పి, వానియందువిడిసి, జాహ్నవిలో మాఘస్నానములఁ జేయ నారంభించెను,

ఆవిదర్భసార్వభౌమునకు సురూపగుణశోభితయగు వినతయను పుత్రికకలదు. ఆకన్యకామణి యొకనాఁడు గంగాతీరమునందలి పర్వతశ్రేణులయొక్కయు, వనరాజులయొక్కయు, జలపాతములయొక్కయు, సహజసౌందర్యములఁదిలకించు కుతూహలముతో నిజప్రియసఖులఁదీసికొని భాగీరథీతటమునఁ గొంతదూరమేగి, ముందటయోగాసనాసీనుఁడై, కనులుమూసి మానసమునఁ గమలాక్షునిధ్యానించుచున్న యోగికుమారునిఁజూచి, యాతనియసదృశరూపమునకు వెరఁగంది, చెంతనున్నసఖులతో నిట్లుపలికెను.

వినత:—నెచ్చెలులారా! కాంచితిరా! యీకమనీయాకారుఁడగు తాపసకుమారుని. మునిసుతులలో నింతటి రూపసంపన్నులుందురా? ఆహా! నేనొనర్చుచున్న గంగాస్నానమునకుఫలము వెంటనే చేకూరినది.

అట్టిపుణ్యమే లేకున్న నాకీపూతచరితుని మోహనరూపమును గనులారఁ గాంచు భాగ్యమెట్లు సమకూరును?

సఖులు:—రాజపుత్రీ! ఈనవయౌవనసుందరాకారుఁడు మున్ను పార్వతికై తపమాచరించిన చంద్రశేఖరునివలెఁ జెన్నారుచున్నవాఁడు. ఈతపసికొమరుఁడు దేనినిబడయఁగోరి తపమొనర్చుచున్నవాఁడో?

వినత:—సఖులారా! మీయూహసరికాదు. ఈసుకుమార సౌందర్యరాశి గరళకంఠుఁడగు నాగభూషణునివలె లేదు. ఆశూలినినిర్జింపఁ దపమాచరించుచున్న సుమశరునివలె నున్నవాఁడు.

సఖులు:—మోహనాంగీ! నీకట్లుతోఁపవచ్చును. సరేకాని వినతా! ఈపూవిలుకాని సోయగమువానిచెంత రతియుండిన నెట్లుండునందువు?

వినత:—నెఱజాణలారా! తెలిసెమీహృదయము. ప్రియసఖులారా! సతులుపతులపజ్జ సవతులుండఁగోరుదురా?

సఖులు:—సుముఖీ! రతివిరహితుఁడు పతియైనఁగలుగుభాగ్యమేమి? అందుచే నీయతీంద్రనందనుఁడనురాగయుతుఁడై నచో బాగుగ నుండునని మాభావము. ఇటసవతిమాటయెందుకు? ఓహో! రతియన వేఱొకకామినియని తలంచియుంటివికాబోలు. వరానురాగమన్న నిట్టిదియేకదా!

ఇటులనాకన్యాలలామలు మాటలాడుచుండ మారాకారుఁడగు నాసంయమికుమారుఁడు యోగసమాధినిఁజాలించి, కనులువిప్పి, తన ముందటనిజతపస్సిద్ధియోయనునట్లు సఖులతోనిలచియున్న యామృగేక్షణనీక్షించి,చంద్రికనుదిలకించిన చక్రవాకముకరణి పరిచలితహృదయుఁడై తనలోనిట్లుతలఁపదొడంగెను."నేనీకాననలోమున్నెన్నఁడునిట్టి చకోరాక్షినిగాన ఈనీలవేణి గంగానదీతీరవిహారాభిలాషచే నచ్చరలతోనచ్చిన సురేంద్రనందినియైయుండునా? లేక పాతాళాధిపతియగు నాగరాజతనయయైయుండునా? అదికాక ఈయుభయలోకసుందరీమణులఁ జులకఁన జేయఁ గమలభవునిచేఁగొత్తగాఁబుట్టింపఁబడిన అపూర్వనారీతిలకముయియుండునా? అయుయో! నేనెంతతప్పుపనిచేయుచుంటిని! నిష్కళంక

మగు బ్రహ్మచర్యవ్రతమేడ? పరకాంతాప్రశంసావ్యాపారమేడ? కాదు. కాదీసుందరి పరసతికానేరదు. నాయంతరాత్మ యస్యకాంతలవర్ణింప సాహసింపదు. కావున నీనీరజాక్షీ వరార్థినియగు వామనేత్రియే సందేహములేదు. కాని నాభావసరసిజముకుళములు వికసించి, మనోరథశ్రీ విలసితములగుటకు సుకృతభాస్కరకరప్రసార మొండవలయునుకదా?" అని అటనుండి సాయంతనస్నాన సంధ్యావందనాదులకుఁగంగానదికి వెడలిపోయెను. కాని ఆకుమారతాపసమానసమృగము విదర్భరాజకుమారీ విలోలావలోకన శరవిద్ధముగుటచే, కుశునకువశముకాక భ్రమింపఁదొడంగెను. కుండినరాజనందినియగు వినతయు నిజహృదయపంజరగతమగు భావకీరమా మునికుమారసహకారముపైవ్రాలి తిరుగగూటికిఁ జేరకుండుటచే వ్యాకులచిత్తయై, చెలికత్తెలతో వెడలిపోయెను.

"అగును సమానసుగుణతంతువులతో నేయఁబడిన యనురాగపటమునకున్న పటిమయు, స్నిగ్ధతయు భిన్నగుణములతో నల్లఁబడినరాగచేలమునకుండనేరవు. మఱియుఁ బ్రేమావిర్భావ హేతువులగమ్యగోచరములు. వానియుత్పత్తిబీజముల నన్వేషింపబోవుటయన, ప్రేమస్వరూపమగు పరబ్రహ్మమును దెలియగోరుటయే. యెక్కడికుండినపుర మెక్కడిగంగాతీరము? ఆసార్వభౌమనందినియెక్కడ? ఈతాపసనందనుఁడెక్కడ ? ఆహా ! అశ్రుతాదృష్టపూర్వులగు స్త్రీపురుషుల హృదయారవిందములనుండి రెప్పపాటుకాలములో బయలువెడలిన యనురాగసౌరభములొండొంటితో నభేదముగానేకీభవించి ప్రియజనామోద హేతువులయ్యె. ఇయ్యదియే నిసర్గానురాగోదాహరణము."

అంతవినత మునితనయునందలిమమతచే స్నానపానాదులయందు విముఖతఁజూపుచుండుటను, ఆపెతల్లియగుశాంత కనిపెట్టి, సఖులవలన రహస్యమునుదెలిసికొని, వినతనుపిలిచి, యిట్లుప్రశ్నించెను.

శాంత:—పుత్రీ ! నీవేలయిట్లువ్యాకులచిత్తవైయుంటివి ? నీమనోరథమేమి ? సంశయింపక నీయభిలాషనువివరింపుము అన వినతయువనతవదనయై తనకామునితనయునిపైఁ బ్రేమోదయమగుటను దెలియఁజేసెను. ఆవిదర్భేశునిరాణి తననాధునితో వినతకోరికనుదెలిపెను.

ఆవిదర్భరాజేంద్రుఁడు తనపుత్రికకౌతుకవివాహేచ్ఛఁదలంచి పురోహితునిపిలిచి, ఆమునికుమారునిచరితముఁ దెలిసికొనిరమ్మన నావిప్రోత్తముఁడు గంగాతీరతపోవనవాసులవలనఁ గుశునియోగ్యతాతిశయములఁదెలిసికొని విదర్భాధిపతికడకువచ్చి యిట్లుపలికెను.

పురో:—రాజేంద్రా! ఆమునినందనుఁడు సర్వవిధములమనవిన తకుఁ దగినవరుఁడుగానున్నవాఁడు నీవీమాఘస్నానసమయమున ఈపావనగంగానదీతీరమున, ఆమునికుమారునకు నీకుమారికను కన్యాదానమొనర్చుటచే సామాన్యకన్యాదానముకంటెఁ గోటిమడుంగులధికమగు ఫలమును బొందఁగలవు. నీపితరులు పుణ్యలోకముల శాశ్వతసుఖములనందఁగలరు. అని కుశునివృత్తాంతమును వివరించెను.

సహదేవుఁడు, పురోహితోక్తులు తనకుహితముల గుటచేతను, ఆకాలమునసిరులకంటె శీలములకే యెక్కుడువిలువ యుండుటచేతను, ఆమునికుమారునకు వినతను గన్యాదానమొనర్పఁగోరి, కుశునిఁదోడ్కొనివచ్చి వానిపాదముల గంగాజలములతోఁగడిగి, కన్యాదానమొనర్చెను.

కుశుఁడు బ్రహ్మచర్యమునువిడచి, గార్హస్థ్యమునఁబ్రవేశించి, గృహస్థధర్మముల యథావిధిగసాగించుచు, ధర్మకామములకర్థము ముఖ్యమగుటచే ధనుర్వేదరహస్యవేదియగునాతఁడు ధరావలయమునఁ గలరాజుల నవలీలఁగాజయించి, అద్వితీయచక్రవర్తియై ధర్మార్థకామముల సమముగాఁబాలించుచు, సజ్జనవంద్యుఁడై, రాజ్యమేలుచుండెను. కొంతకాలమునకా కుశమహీపాలునకు వినతయందుఁ బురుషార్థములవలెఁ గుశాంబ, కుశనాభ, అధూర్తరజస, వసువులను నలుగురుసుతులుకలిగిరి. ఆకుమారులు ప్రాజ్ఞులైనతోడనే కుశుఁడు రాజ్యమును నాలుగుభాగములుగవిభజించి నలుగురుపుత్రులకిచ్చి, గార్హస్థ్యమునుండి వానప్రస్థమునఁ గాలముఁగడుపఁ భార్యతోఁదపోవనమునకేగెను.

తండ్రియాజ్ఞానుసారము నాల్గవకుమారుఁడగు వసువు ఈశాన్యదప్రాంతదేశమునకుఁబ్రభువై, గిరివ్రజపురమును రాజధానిగఁజేసికొని, ప్రజలఁబాలించుచుండెను. రెండవవాఁడగు కుశనాభుఁడు మహాప్రతాప

శాలియై, మహోదయమనుపురమును రాజధానిగనొనర్చుకొని, జనుల నేలుచుండెను ఈకుశనాథరాజేంద్రుఁడు ఘృతాచియను నారీమణినిఁ బరిణయమై, యాపెయందు బరమేశ్వరకృపచే నిరుపమానగుణలావణ్యవతులగు నూర్గురుకొమరితలఁబడసెను. వారెల్లరు క్రమముగానెదిగి, యౌవనారంభ ప్రాయముకలవారై, వనవిహారకుతూహలములో నుద్యానవనమునకేగి, జలక్రీడలసలుపుచుండిరి. అపుడు దక్షిణదిశనుండి యాదారిను త్తరదిక్కునకు మెల్లగనేగుచున్న మలయగంధవహుఁడు, వారి వారివిహారలీలలఁదిలకించి, నిజచిత్తమధుపము, ఆవారిజముఖులకడకేగ, ఆదాక్షిణసమీరుఁడు మనోహరరూపమునుదాల్చి వారిదరిఁజేరి, ఇట్లు పలికెను.

సమీరుఁడు:—బింబాధరలారా! నేనుమీరూపవిలాసములఁ జూచి, మిమ్మువరియింపవచ్చితి. కావున నన్నుఁబతినిగాఁజేకొనుడు.

కన్యలు:—ఓయీ! నీవెవ్వఁడవింతనిర్భయముగా మాటలాడుచుంటివి? మేమెవ్వరమో తెలిసికొంటివికాబోలు. లోకైకవీరుఁడగు కుశనాథసార్వభౌముని పుత్రికలము. శీలవ్రతపరాయణలము.

సమీరుఁడు:—తనుమధ్యలారా! మీరెవ్వరో తెలిసియేవచ్చితిని కానినన్ను మీరుగుర్తింపనేరక, మాటలాడుచున్నవారు నేను సర్వజీవులకు బహిరంతర్వ్యాపినై సంచరించు మలయసమీరుఁడ కామరూపుఁడ. సుదతులారా! మీరునన్నుఁజేపట్టితిరా! చంచలమగు మానవరూపావసను నువిడచి, నిత్యానందజనకమగు త్రిదశవయస్సుతోఁగూడి, చిరంజీవినులుకాఁగలుగుదురు. మఱియునాతోఁగూడి భూలోకవనములయందును, దివ్యలోకోద్యానములయందును, సంచరింపఁగలుగుదురు.

కన్యలు:—ఓయనిలుఁడా! నిలకడలేకసదాగతివైననీవు మమ్ముఁ జూచి చలచిత్తుఁడవగుటలోవింతలేదు. 'గాలివేల్పా' సర్వాంతర్యామివైననీకు మాహృదయనైర్మల్యమెట్లు తెలియదాయె? సమీరుఁడా! నీస్థితిగతులమేమెరుంగుదుము. కావున మమ్మువమానించి దుఃఖములఁబొల్పడక వచ్చినదారినేగుటమంచిది.

సమీరుఁడు:— కన్యకలారా! అధికప్రసంగములఁజేసి, చేఁజిక్కినయమరభర్తను చెడఁగొట్టుకొని, ఏమర్త్యునో మెడఁగట్టుకొని, వైధవ్యదుఃఖమునఁబడక, నన్నుఁబడసి, నిత్యసౌభాగ్యములనందికొనుడు

కన్యలు:— ఓకాముకుఁడా! వనవిహారలోలలగు సతీమణులకడకు సిగ్గులేకవచ్చుటయకాక, మర్యాదహీనుఁడవై మాటలాడుట దివ్యమర్యాదయా? ఆర్యవంశసంజాతలగు కన్యల దివ్యసంపదలుకాని, అమరయౌవనములుకాని, మోహపెట్టఁజాలవు. వారు దయామయులగు తలిదండ్రులఁబాటింపక పరులఁబరిణయమాడఁగోరరు. ఆర్యమానినులపరిణయాభిలాషలు కులమర్యాదావిలసితములుకాని, స్వేచ్ఛావిహారమలీమసములుకావు.

సమీరుఁడు:— మందయానలారా! దూరమాలోచింపుఁడు. నాయట్టిదివ్యరూపునిఁబోఁగొట్టుకొనకుడు.

కన్యలు:— సమీరుఁడా! చాలునీస్వార్థపరతాప్రబోధము. నీవెడగుప్రసంగములు మాజనకునిచెవిసోకినచో నీకుమోసమువాటిల్లును. వేగముఁగాఁబొమ్మిచోటువాసి. ఆవారిజాక్షులపలుకుల విన్నతోడనే మలయానిలుఁడు కాలానలుఁడై "మదవతులారా మీకింతకావరము తగునా? కన్యలఁగామించుట కానిపనియా? కానిందు మీపొగరడఁతును. ఈనాఁడుమొదలు మీరందరుకుబ్జలై కురూపములతో నుందురు కావుత" అనిశపియించెను.

రాజకన్యలాశాపోక్తినివిని, కోపోద్దీపితలై, ఇట్లుపలికిరి.

కన్యలు:— ఓకామాంధుఁడా! నీకుమేము ప్రతిశాపమొసంగఁగలము. కాని, యదిక్షమావ్రతపరాయణలమగు మాకుఁదగినపని కాదు. ఇతరుల హింసించుశక్తియుండుటకంటెఁ బరబాధలసహించు తాలిమి యుండుటయే, వరమని తెలిసికొమ్ము. పతితపావనుఁడగు భగవానుఁడు నిరపరాధలమగుమమ్ముఁ గాపాడఁగలఁడు. అని నిజమనోహరరూపములు కురూపములుగా మారఁ లజ్జితలై, చీకటిపడువఱకందుండి, చీకటిరాగానే, మేలిముసుఁగులతో నారాజకన్యలు తండ్రికడకేగి, యాతనిపాదములపైఁబడి దుఃఖింపఁదొడంగిరి.

కుశనాభుఁడు కుమాపృలైయున్న కూఁతులఁజూచి, సంభ్రాంతచిత్తుఁడై, ఇట్లుపలికెను.

కుశనాభుఁడు:—కటకటా! బిడ్డలారా! మీకీయసహ్యాకారము లెట్లువచ్చె? పూజ్యులెవ్వరికైన నపచారములఁజేసియుంటిరా?

కన్యలు:—తండ్రీ! మేమెట్టిదోసములను జేసియెఱుంగము. అని జరిగినదంతయు పూసగుచ్చినట్లు తెలిపిరి. ఆమాటలువిని యాతఁడుసంతసమంది ఇట్లుపలికెను.

కుశనాభ:—పుత్రికారత్నములారా! యెంతటిశాలిమినిఁజూపియుంటిరి! కుమారికలారా! స్త్రీలకుఁగాని పురుషులకుఁగాని, శౌర్యమునుమించినసంపద లేదు. మీయుక్కసెల్లం ద్రోక్కమనసుకలవారై, నిష్కారణముగామిమ్ముశపియించి, యవమానించిన సమీరునిపైఁగినియక, సైరణసేయుట ప్రశంసనీయము. పుత్రికలారా! దానయజ్ఞధర్మాదులన్నియుఁ, దితిక్షపై నాధారపడియున్నవి. మొదట మీవికారరూపములఁజూచి, విచారించితిని కాని, మీనిరుపమానక్షమావిభవమును, తెలిసికొనినపిమ్మట సంతసమందితిని బిడ్డలారా! గతించినదానికివగవక, దీనావనపరాయణుఁడగు నారాయణుని ధ్యానించుచు నంతఃపురముల నుండుడు. దుఃఖసమయమునధైర్యమును, పరమేశ్వరధ్యానమును, దుఃఖనివారకములు సంతోషావహములు. ఇకముందీదేశము కాన్యకుబ్జమని వ్యవహరింపఁబడుఁగావుత. అనిబోధించి, వారిని రాణివాసమునకంపెను కాని నిజతనయలదుస్థితికిఖిన్నుఁడై వారికి వివాహములఁజేయుట యెటులనాయని చింతింపఁదొడఁగెను.

## —: ఏకవింశత్యధ్యాయము :—

## బ్రహ్మదత్తోపాఖ్యానము.

అఖండబ్రహ్మచర్యవ్రతసంపన్నుఁడును, పరమభాగవతోత్తముఁడును, నగు చూళియను భూసురతాపసోత్తముఁడు గంగాతరంగిణీతీరమునఁ దపమాచరించుచుండెను. ఇటులుండ, ఊర్మిళాపుత్రికయగు సోమయను గంధర్వకన్య యా చూళితపోవనమునకువచ్చి బ్రహ్మతేజోవిరాజమానుఁడగు నాతాపసపుంగవునివలన సుతునిఁబడయఁగోరి, యాముని

శ్రేష్ఠునకు నుపచారములఁ జేయ మొదలిడెను. ఇటులఁ గొంతకాలమునుగ డువ నాయతివమాళియగుచూళి తనకుభక్తిపూర్వకముగ సేవచేయుచు న్న యోగ్యధర్వకాంతనుజూచి, ఇట్లుప్రశ్నించెను.

చూళి:—శుభాంగీ! నీవెవతవు? నాకిట్లీల సేవఁజేయుచుంటివి. నీభక్తి మెచ్చితిఁ గావలసినదానిని గోరికొనుము అన ఆననజితసోమయగు నాసోమ సంతుష్టాంతరంగయై యంజలిఁ జేర్చి, శిరమువంచి, ఇట్లు పలికెను.

సోమ:—సరసిజాసనసమప్రభావా! మహానుభావా! నేనొకయవి వాహితనగు సోమయను గంధర్వకన్యను నేను బ్రహ్మతేజోభాసమా నుఁడును, త్రాతప్రతాపవిరాజమానుఁడును, నగుకుమారుని మీవలనఁ బడయఁగోరి మిము సేవించుచుంటిని కృపామయులగు మీరలు నామనో రథమీడేర్పవలయును ఆకోరికనువిన్నతోడనే బ్రహ్మచారియగు చూళి గుండెజల్లుమనని శ్చేష్టుఁడై, యొకింతయూరటనంది, ఇట్లుపలికెను.

చూళి:—సతీమణీ! నేవిరాగినై బ్రహ్మచర్యవ్రతముపూని పర బ్రహ్మను పాసించుచుంటిని నాకువివాహేచ్ఛలేదు కావున నన్నునీడి, సల్లోకుని వేడికొనిసీమనోరథమీడేర్చికొనుము.

సోమ:—మునిచంద్రా! మీతోనాకుబాహ్యవివాహవిధి జరు గకున్నను మానసికపరిణయము జరిగినది. కావున నేనుపూర్వపతినివిడ చి, వేఱొకపురుషునిఁ జేరుదానఁగాను కావున మీతపోమహిమచే నొక పుత్త్రునిసృజయించి ప్రసాదింపుము. అందుచే మీకుబ్రహ్మచర్యవ్రత మును, నాకేకపత్నీవ్రతమును, సమకూరును. చూళియాసోమయుక్తికి మెచ్చి, కరుణాళుఁడై యోగశక్తిచేనొకశిశువునుసృజయించి సోమకొసం గెను.

అంతనాసోమ చూళియొసంగినసుతునకు బ్రహ్మదత్తుఁడను నామ మిడి, పెంచుకొనుచుండెను. ఆసోమానందనుఁడు క్రమాభివృద్ధినొంది, కరమూలరయొక్క మహిమయుఁ, గరవాలముయొక్క శక్తియు, సహాయ మైవెలయ రారాజులజయించి, యొకనూతనరాజ్యమునుసృష్టించి, దానికిఁ గాంపిల్యమనుపట్టణము రాజధానినిగాఁ జేసి, యందురాజ్యమేలుచుండెను.

ఇట్లుండ నిజకన్యకలకు వరుల నెట్లుసమకూర్తునాయని విచారించు చున్న కుశనాభునికడకుఁ ద్రిలోకవార్తాహారియు, నిత్యబ్రహ్మచారియు, స్వేచ్ఛావిహారియు, నగువేల్పుజడదారివచ్చెను. అనారదుఁడు రాఁగనే యామహోదయపురాధిపతియగు కుశనాభుఁడు దివ్యమునికిఁ బూజలొనర్చి, యుచితాసనముపైఁగూర్చుండఁ బ్రార్థించి యిట్లువిన్నవించెను

కుశనాభ:—నారదమునీంద్రా! మీకీసృష్టియందుఁ దెలియరానిరాజకుమారులు లేరు. నాకడవివాహయోగ్యలగు కన్యలున్నవారు. వారికనువగువరునినిరూపించి నావ్యాకులముతీర్పఁ బ్రార్థించుచున్నవాఁడ. మునీంద్రా! కన్యలఁగన్నవారిపాట్లెరికి తెలియును? మీరు నిత్యబ్రహ్మచారులగుటచే సాంసారికసంతాపములెఱుఁగక, నిత్యానందముతో విచ్చలవిడిగా ముల్లోకముల సంచరించుచున్నవారు.

నారదుఁడు:—కుశనందనా! నీవు నేను స్వేచ్ఛగాఁదిరుగుచుంటి ననుకొనుచుంటివి. నీకునీసంసారబాధయొక్కటే. నేను సర్వలోకసంచారినగుటచే నాపాట్లకుమితిలేదు. రాజా! నిజమారయఁ బరులకై పాటుఁబడుటయే పరమేశ్వరప్రీతిహేతువు వినుమునీకన్యలకనురూపుఁడగు వరునిఁదెలుపుదును. కాంపిల్యనగరమున బ్రహ్మదత్తుఁడను ద్విజకుమారుఁడు రాజ్యమేలుచున్నవాఁడు. అతఁడవివాహితుఁడు. మహిమాఢ్యుఁడు నీపుత్రికలనాతనికొసంగి ధన్యుఁడవుకమ్ము. అనివెడలిపోయెను.

కుశనాభుఁడు వెంటనే కాంపిల్యమునకేఁగ, బ్రహ్మదత్తుఁడు రాజమర్యాదలతో నామహోదయాధీశునకు స్వాగతమొసంగి "మహారాజా! తమరిటకుదయచేయఁగారణమేమి?" అనిప్రశ్నింపఁ నాతఁడిట్లు పలికెను.

కుశనాభ:—ద్విజకుమారా! నేనునాకుమారికలకు వరార్థినై యుండ, నారదమునీంద్రుఁడు నాకడకువచ్చి, నీగుణాతిశయముల వర్ణించుటచే నిన్నుఁబ్రార్థింపనిటకువచ్చితిని.

బ్రహ్మదత్తు:—ఆర్యా! విధేయునిఁబ్రార్థింపఁదగునా? మీకోరికనునాజననికినివేదించి, యామెకిష్టమైనచో మీయభీష్టమీడేర్తును. ఆమెవలదనినచో నాపైఁగోపింపక, దీవింపఁగోరుచున్నవాఁడను. మాయమ్మయాన లేనిదే నేనెట్టిపనియుఁ జేయఁజాలను.

కుశనాభ :—సోమానందనా! తల్లినినిర్లక్ష్యముచేయువానిని నేనల్లునిగాఁగోరను. కావున నీవుమీయమ్మయనుమతిసినడచుటయే నా యభిమతము. అన బ్రహ్మదత్తుఁడు తల్లికడకేగి, నమస్కరించి, కుశనాభునియభిలాషను దెలుప, సుందరాంగులగు చక్రవర్తిపుత్రికలఁ గోడండ్రగాఁబడయఁగోరుచున్న యాగంధర్వకాంత సుతునిదీవించి, రాజకన్నియలఁబెండ్లియాడి భార్యలవెంటనిడికొని, సౌఖ్యముగారమ్మనెను.

బ్రహ్మదత్తుఁడు తల్లియనుమతిని కుశనాభునితో మహోదయపురమునకేగి, వివాహకాలమునఁ గుబ్జలగు రాకొమరితలనవలోకించి "మా యమ్మ సౌందర్యనిధులగు వధువులనపేక్షించియుండ నేనెట్లీకుబ్జలఁ జేకొందును? పరిగ్రహింపనంగీకరించి యిపుడెట్లునిషేధింతును? ముందువెనుకలాలోచింపక,త్వరపడిభాషసేయరాదు. నేనుసద్బ్రహ్మచారినేయగుచో, మాతృభక్తుఁడనేయగుచో, నాకరస్పర్శమైనతోడనే వీరుకురూపములు పోయి సురూపలుకాకుందురా?" అనినిశ్చయించి, యాకన్యకలకరములఁబరిగ్రహించినతోడనే వారెల్లరు దివ్యసౌందర్యసంపన్నలై, అమరకన్యలుకూడ తమకీడురారన్నట్లు తేజరిల్లఁదొడంగిరి. కుశనాభుఁడును, ఆతనియర్ధాంగియగుఘృతాచియు తమసుతలయనుపమానరూపవైభవములను, అల్లునియసమానశక్తిసంపదను బరికించి, యానందించి, యల్లునకమూల్యాభరణాది పారితోషికములనొసంగిరి.

బ్రహ్మదత్తుఁడట్లుసన్మానితుఁడై వరకాంతికలితలగు కాంతామణులతోఁ గాంపిల్యనగరమునకువచ్చి, కళత్రసహితుఁడై తల్లియగుసోమకునమస్కరింప నామెవారినిదీవించి, కులరూపగుణశోభితలగు కోడండ్రతోడను, నిజాజ్ఞానువర్తియగు సుతునితోడను సుఖముగాఁగాలముగడుపుచుండెను.

అటమహోదయమునఁ గుశనాభుఁడు తనపుత్రికలు రూపవతులై యనురూపుఁడగుభర్తను బడయుటచే నమితానందమునందెను కాని, పదునాలేండ్లవఱకుఁ దనకన్నులయెదుటఁబెరిగిన ఆత్మజాతలు తన్నువీడి, యత్తవారింటికేగుటచే నేమియుఁదోపక, వ్యాకులమంద మొదలిడెను. "నిజమే! తరంగిణులుపుట్టినచోటుననిలువక, కడలికడకేగునట్లు, కొమరిత

లును పుట్టినింటనుండక, యాత్తవారికడకేగుదురు సాగరము తరంగచంచలత లేక యుండనియట్లు, సంసారి యంతరంగవ్యాకులత లేక యుండ నేరఁడు."

అట్లుకుశనాభుఁడు తన్నువిడిచియత్తవారింటికేగిన యానళినదళాయతాక్షుల గుణసంపదలఁదలంచుచు, వారివియోగమునకుఁ గుందుచుండ ఒకనాటిరేయి యాతేనిస్వప్నములో నాతనితండ్రియగు కుశుఁడు ప్రత్యక్షమై "పుత్రరత్నమా! ఏలయిట్లుచెంగటిల్లెదవు? కన్యకలు పతులకడకేగక తలితండ్రులకంటియెదుటనుందురా? అప్పుఁజేకొన్నవాడు తాఁదెచ్చినధనమును వడ్డితోఁ జెంచి, ఋణదాతకొసంగునట్లు, కన్యలఁగన్నవాడు బాలికలఁజక్కఁగఁజెంచి, కట్నములతోఁ వరులకు సమర్పింపవలసినదే. కావున పుత్రేష్టినిచేసి కులాలంకారుఁడగు కుమారునిఁబడయుము." అని అంతర్ధానమాయెను.

వెంటనే కుశనాభుఁడుమేల్కని, తండ్రిబోధలఁదలంచుచుఁ దెల్లవారినతోడనే కులగురువులరావించి, పుత్రేష్టినిసాగించి, ఘృతాచియందు గాంభీర్యజలధియగు గాధియను తనయునిఁబడసెను. రామచంద్రా! ఆతేజశ్శాలియగుగాధియే నాజనకుఁడు నేనాతనికిజన్మించుటచే గాధేయుఁడననియుఁ, కుశసంతతివాఁడనగుటచేఁ కౌశికుఁడననియుఁ బిలువఁబడుచున్నవాఁడను. దశరథాత్మజులారా! మీరువినఁదగినదియు, వినియానందింపఁదగినదియు, సతీలలామయగు మాయక్కసత్యవతియొక్క జీవితము.

రాముఁడు:—గాధినందనా! గృహమునకుఁగాని, దేశమునకుగాని కీర్తిసంపదల సమకూర్చువారలు సతీకల్పవల్లులే. గంగాదిపావననదీప్రవాహజీవనములెట్లు భారతదేశమును భాగ్యవంతముగాఁజేయుచున్నవియో యటులనే సావిత్రీప్రభృతిసతీతిలకముల జీవితకథావాహినులును దేశమును సౌభాగ్యవంతమునుగాఁజేయుచున్నయవి. వీనినివినుట సంతోషావహము. పాపహరము కావున సత్యమగు సత్యవతీచరితమునుమాకు వినిపించి, సుకృతానందముల సమకూర్పఁగోరుచున్నాఁడను.

కౌశికుఁడు:—ఇనకులతిలకా! కౌసల్యాపుత్రికా! నాపితామహుఁడగు కుశనాభుఁడు మాతండ్రిగాధి బాల్యుఁడై నతోడనే, కాన్యకుబ్జరాజ్యమున నాతనినభిషిక్తునిఁగాఁజేసి, భార్యయగు ఘృతాచితోఁ దపోవనమునకు వెడలిపోయెను. అపిమ్మట గాధిరాజేంద్రుఁడు రాజమాన్యుఁడై స్వయంవరమున పురుభ్రాజనందినియగు భానుమతినిఁ బరిణయమై యామెయందు సత్యవతినిబడసెను సత్యవతియు శుక్లచంద్రకళవోలె క్రమముగా నెనుగుచు, సంపూర్ణయౌవనకాంతికలితయగుటచే మాతండ్రియామెకుఁ దగుచక్రవర్తినందనుని సమకూర్పఁబ్రయత్నించుచుండెను. కానియా తేజశ్శాలికోరినట్లు సార్వభౌమనందనుఁడల్లుఁడుకాక భూసురసుతుఁడు జామాతయయ్యెను.

రాముఁడు:—కౌశికమునీంద్రా! సర్వసమర్థుఁడగుగాధిచక్రవర్తి రాజనందనునల్లునిఁగాఁగోరుచుండ నందుకువిపరీతముగా విప్రజాతుఁడెట్లుజామాతయయ్యె? అదివిని కౌశికుఁడిట్లు సత్యవతీచరితమును దెలుపఁదొడంగెను.

## ద్వావింశత్యధ్యాయము.

### —♦ సత్యవతీచరితము ♦—

పూర్వము కృతవీర్యవంశజులగుక్షత్రియులు నీతిదూరులై ద్యూతాదులకై సర్వసంపదలఁ బాడుసేయుఁదొడంగిరి. ఆసందుఁగనిపెట్టి, కుమతులగుమంత్రులు కుతంత్రములఁబన్ని, ధనములనపహరింపమొదలిడిరి. అందుచేనారాజ్యము ధనహీనమై, దరిద్రస్థితికివచ్చెను. ఆకార్తవీర్యులు సొమ్ములఁదెమ్మని మంత్రులబాధింపఁ బ్రెగ్గడలాబాధలఁదప్పించుకొనుటకొక యుక్తినిబన్ని, ఇట్లు తెలిపిరి.

మంత్రులు:—ప్రభూత్తములారా! మమ్ముల బాధించెదరు? మీధనాగారములురిత్తలైయుండ మేము ధనములనెక్కడనుండి తేఁగలుగుదుము? ఏలికలారా! వినుఁడు ధనముగలతావెరింగింతుము. నృపవరులారా! మీపూర్వులగు సార్వభౌములు శ్రోత్రియభక్తులగుటచే భృగువంశజులగు భూసురలకు అమితములగుధనరాసుల దానమొసంగియున్నారు. ఆబాపలాసొమ్ములఁ గుశీదవ్యాపారమునఁ జేఁబెంచి, కోట్లకుపడ

గలెత్తియున్నవారు. కావున మీరు మమ్ము బాధింపక, వారికడకేగి, యాచించియో, శాసించియో, ధనములసంపాదింపుడు. మేమీలోపునం బ్రిజలనుండి కొన్ని తపస్సుల రాంబట్టుకుము. అని తెలిపినతోడనే, మది రాపాసమత్తులగు నాయేలికలు యుక్తాయుక్తవిచారహీనులై యాకప టామాత్యబోధలకలరి"క్షత్రియులకు యాచ్నామార్గముగర్హ్యమనియు, దండోపాయమేశ్లాఘ్యమనియు,ం దలంచి, ఆయుధపాణులై భార్గవాగ్రహారముపైంబడి, "మాపెద్దలుమీకొసంగినధనముల మీరు వడ్డీలకిచ్చి పెంచిదాచియుంచితిరంట వానిని వెంటనేమాకొసంగిపంపుడు. లేకున్న శస్త్రాగ్నికీలలకాహుతికాంగలరు" అన భార్గవులిట్లుపలికిరి.

భార్గవులు:—కార్తవీర్యకులాలంకారులారా! శౌర్యశిఖామణు లారా! మీపూర్వులు మాపూర్వులకు యజ్ఞయాగాదులకో! హవ్య కవ్యాదులకో! సమర్పించిన ధనములానాడేవ్యయమైయుంకునుకాని యింతవఱకు మాయిండ్లనిలచియుంకునా? మేముకాని మాపెద్దలుకాని ధనలోలుపులమై మీపెద్దలొసంగినధనముల వడ్డీలకిచ్చిపెంచియుంచిన వారముకాము. క్షత్రియులెక్కడనైన ధనములనిలువంజేసి, కుశీదవృత్తిని నెరపుటంగంటిరా? వైదికులయిండ్ల నిలువయుండునవి ధనములు కావు ఇంధనములు మీకెవ్వరో మోసగాండ్రు మాకడ ధనములుకల వని కుబోధలంజేసియున్నవారు. కావున మీరాతులువలమాటలకు మోసపోక సత్యాసత్యముల నోర్పుతోవిచారింపుడు.

కార్తవీర్యులు:—బాపనయ్యలారా! మేముమీతోశాస్త్రవాద ములంజేయరాలేదు .మాఱుమాటాడక సొమ్ములనిత్తురా ? లేక మాచేం జత్తురా ? రెండేమాటలు.

భార్గవులు:—అపూర్వవీరులారా! బాపలపైననా? మీబలపరాక్రమములు. వినుడు మేమసత్యములాడువారము కాము. మాకడధనము లులేవు. మీరేమిచేసిననుసరే. నీచులగున్నపాలరరాజ్యములజీవించి నిత్యదుఃఖములనందుటకంటె ఒక్కమారుచచ్చుటయే మేలు. ఆమాట లువిన్నతోడనే యాపలుగాకిరామూకలు స్త్రీలనక, శిశువులనక, వృద్ధ

లనక, క్రూరకిరాతులు మృగముల వేటాడునట్లా క్షత్త్రియుల సంహరింపఁదొడంగిరి.

"ఆహా! కాంచనకాములకును, కాంతాకాముకులకును, దయాదాక్షిణ్యములుండవుకదా! జనులను దినమును, ఈకాంతాకనకములకై పగులఁజంపుటయో, తాముచచ్చుటయో, కానవచ్చును. కట్టా! చంచలములగు ధనసంచయములకును, క్షణభంగురములగు వనితాసౌఖ్యములకును, దామెంతకాలమనుభవించినను తరుగరానిపాపములకుఁ బాల్పడుచున్నవారు. విషపాషాణాది మారణవస్తువులీకాంతాకనకములవలె మానవసంఘమును జంపనేరవు."

అట్లాక్రూరులగు కుపతులు కృపాణపాణులై, కృపావిహీనులై, విప్రప్రాణముల బలిఁగొనుటకు మొదలిడిరి. ఆదారుణమారణసమయమున, పూర్ణగర్భవతియుఁ బతివ్రతాశిరోమణియు, భార్గవకులాలంకారుఁడగుచ్యవనుఁడను భూసురోత్తమునకునర్ధాంగియు, నగు ఆరుషియను సాధ్వీమణి భీతయై, నిజగర్భసంరక్షణాపేక్షచే, గృహమునువదలి పారిపోవుచుండ, దుండగీండ్రులగు నారాచవారు, ఆమెధనములమూటఁగట్టి నడుమునకుఁజుట్టికొని గర్భంపుమిషతోఁ బట్టుకొనిపోవుచున్నదని తలంచి, యాసాధ్వివెంటఁబరుగిడఁజొచ్చిరి. ఆచ్యవనపత్ని తనపిఱుందఁ దఱిమికొనివచ్చుచున్న రాక్షససములగు నారాచకూళలఁజూచి, వేగముగానేగుచుండ, నాసాధ్వీమణిగర్భముజారి, యాపెయూరుదేశమునఁబడెను. అంత నాయిల్లాలు బిడ్డనుదీసి యొడిలోవేసికొనుచుండ, ఆపాపాత్ములటకేగి, దివ్యతేజోవిభాసియగు శిశువును చూచినతోడనే యంధులైరి. "సాధ్వీపీడయూరకపోవునా?" అట్లుగ్రుడ్డివారైన యాఘోరభూభర్తలు చేయునదిలేక చేతులుజోడించి యాసాధ్విని "మాయపరాధముల క్షమియించి నేత్రదానమొసంగుము" అనిదీనాతిదీనులై ప్రార్థింప, ఆక్షత్త్రియకాంత నవనీతసమానస్వాంత యగుటచే వారిపైఁజాలిగొని, ఇట్లుపలికెను.

ఆరుషి:—సోదరులారా! దుష్టశిక్షణమును, శిష్టరక్షణమును వ్రతముగా భావించు క్షత్త్రియకులమునఁబుట్టి, మీరేలయిట్టి బ్రహ్మహత్యకుఁ బాల్పడితిరి? బిడ్డలారా! మీకిదివఱకుఁజూపులుండియు నంధు

లైయుంటిరే కాని నేత్రవంతులై మెలఁగఁజాలరైతిరి తనయులారా! పావనమగు పృథివీపతిత్వము నెట్లు వమ్ముచేసికొంటిరి. యమదండనములనుండి యెట్లుతప్పించుకొనఁదలంచుకొంటిరి? మీయట్టిపరహింసకులు చిరంజీవులగుటకంటెఁ గడతేరుటయే సమంజసము పరోపకారి పసిగిమిసములు బ్రతికినను మేలే మిమ్ముఁగన్నతల్లులెట్టి దురితాత్మలో తెలియరాదు లేకున్న నిట్టిపాడుబిడ్డలఁ బడయుదురా?

కార్తవీర్యులు:— తల్లీ! మామంత్రులు మమ్ము మోసగించుటచే వారికపటోక్తుల హితబోధలుగాఁదలంచి, యీదారుణబ్రహ్మహత్యకుఁ బాల్పడితిమి మాయమ్మా! బిడ్డలమగు మాయందు వాత్సల్యముంచి మా యపరాధముల మఱచి,మమ్ముఁ గాపాడుము ఇప్పుడు మేముపశ్చాత్తప్తులమై, మాయొనర్చినహత్యలఁ దెలిసికొంటిమి.

ఆరుషి:—కుమారులారా! మీకునిజముగ పశ్చాత్తాపముకలిగినచో నాయీబాలకునిఁబ్రార్థింపుడు. నాకీపట్టి శ్రీహరికటాక్షముచే బుట్టినవాఁడు. మీయంధతను బోఁగొట్టఁజాలినవాఁడు. అనవారాశిశువునిట్లు ప్రార్థించిరి.

కార్తవీర్యులు:—ఓపతివ్రతానందా నా! మాపైఁగరుణించి, మా యపరాధములక్షమియించి, మాకుఁజూపులఁబ్రసాదింపుము. నిన్నికముందు మాకుఁగులవేల్పుగానారాధింతుము.

ఆరుషి:—ఓవిలోలాలకా! బాలకా! అవినీతులగు నీనృపతులు కుమతిబోధలచేఁ జేసినయపరాధములక్షమింపుము వీరింజూడ జాలి కలుగుచున్నయది. వీరలు నేత్రవంతులైనచో నేసంతసింతును. అన, దివ్య ప్రభావసంపన్నుఁడగు నాబాలకుఁడు కనులుతెఱచి, వారివైపుచూచిన తోడనే ఆదుష్టులకు నష్టమైనదృష్టి తిరుగఁజేకూరెను. అంతనాధరాకాంతులు ఆజననీనందనులకు వందములొనర్చి తాముచేసిన పాపకార్యములకుఁజింతించుచు వెడలిపోయిరి.

పిమ్మటనారుషి యిల్లుచేరి, యాపిల్లనికి ఔర్వుఁడనిపేరుపెట్టి పోషించుచుండెను. ఆబాలుఁడు క్రమక్రమముగాఁబ్రౌఢుఁడై తల్లివలనఁ గార్తవీర్యుల క్రూరకృత్యములఁదెలిసికొని, ఆరాజవంశమును మూల

చ్ఛేదము చేయుఁ దీవ్రముగాఁ దపమొనర్చుచుండెను. ఆ బాలతాపసతపోవహ్నిచే జగము సంతాపమొందఁ జొచ్చెను. అంత దేవతలా యౌర్వునితపస్సును మాన్పింపనేరక, యాతనిపితృదేవతలకడ కేగి యౌర్వునితపము మాన్పించి, లోకతాపమును దొలగింపఁగోరిరి. దేవతలకోర్కెపై నాతనిపితరులు వానికడకేగి "బిడ్డా! నీతపముచే లోకమునకుఁ దాపము కలుగుచున్నది కావున శాంతచిత్తుఁడవై తపమునుచాలించి, లోకమునుగాపాడుము.

ఔర్వుఁడు :— పితృదైవతములారా! క్రూరులగు కార్తవీర్యులఁ గడతేర్పవలయునుగాని కాపాడరాదు. ఆకిరాతులు మనభార్గవవంశమున కొనర్చిన యపకృతికంతుకలదా? ప్రాజ్ఞులు రోగనివారణమునకును, రిపుమారణమునకును, పూనుకొనకున్నచో నారోగ్యకీర్తులఁ బడయనేరరు. కావునఁ దండ్రులారా! నాప్రయత్నమునకడ్డు తగులకుఁడు. మీకు మ్రొక్కెద.

పితరులు:— భార్గవకులాలంకారా! కుమారా! బ్రాహ్మణులకుఁ గ్రోధముండఁజనదు. వారు క్షమాప్రధానులుకాని, క్రోధనిధానులు కారు మఱియు నీతపోవహ్నిచేఁ బ్రాణిలోకము పరితాపమొందుచున్నది. కావున మాతండ్రీ! లోకోత్తాపజనకమగు తపమునుచాలించి, గుణవతియగు కన్యకనుబరిణయమాడి, మాకుసంతసమును సమకూర్పుము. అన నాయౌర్వుఁడు శాంతాత్ముఁడై తపముచాలించి, పితృదేవతలకు వందనమొనర్ప, వారౌర్వునిదీవించి వెడలిపోయిరి.

ఔర్వుఁడు పితరులుకోరినరీతిని పరిణయమాడఁగోరి, జరిగినవృత్తాంతము తల్లికినివేదించి, యా సాధ్వియాజ్ఞానుసారము మాళవరాజపుత్రికయగు మాళవిని పెండ్లియాడి, యామెవలన ఋచీకుఁడను పుత్రుని కందళియను పుత్రికను బడసి, కందళిని దూర్వాసునకొసఁగి, సంసారమును ఋచీకునకొప్పజెప్పి, అతఁడు భార్యతో వానప్రస్థమునెరప వెడలిపోయెను.

తండ్రియనంతరము ఋచీకుఁడు బ్రహ్మచర్యవ్రతపరాయణుఁడై కాలముగడుపుచుండ, భార్గవశమున మహర్షులు వానియింటికిరాఁగా

బ్రిత్యర్థానాదిసత్కారములొనర్చి వారినిభోజనమునకు నామంత్రింప,
“మేము అవివాహితునియింట భుజింపము.” అని వెడలిపోయిరి అంతనా
మాళవీసుతుఁడు పెండ్లియాడినఁగాని, పెద్దలకాతిథ్యమొసంగ నర్హతక
లుగ నేఱదని నిశ్చయించి, మాతండ్రియగు గాధికడ గుణవతియగు కన్యక
కలదనివిని, మాతండ్రికడ కేగి, మాయక్కసత్యవతినిమ్మనికోరెను.

అప్పుడు గాధిరాజేంద్రునకు మాయక్కదక్క వేఱుసంతాన
ములేకుండుటచే నాపెనతిగారాబముతోఁ బెంచుకొనుచుండెను. అందు
వలన ఆబీదబాపనికిఁ దనపుత్రికనీయమనసొప్పక, నిరాకరించిన శపియిం
చుననితలంచి యొకయుక్తినిబన్ని, ఇట్లుబలికెను. “విప్రకుమారా ! ఒక
చెవినలుపును మిగతదేహమంతయుఁదెలుపును గలవెయ్యిగుఱ్ఱముల నె
వ్వరుతీసికొనివత్తురో వారికినాకూతునిత్తునని శపథముచేసితిని. నీవట్టినీల
కర్ణముగల ధవళాశ్వములఁ గొనితెచ్చినచో నీకునాపుత్రికనిచ్చుటకు
సందేహములేదు” అనెను. ఋచీకుఁడట్లైన నాకీరాత్రిగడువొసంగుము
రేపుసూర్యోదయమైనతోడనే నల్లచెవులుగలవెల్లతేజులఁ దెచ్చియిత్తు”
నన మాతండ్రి “వల్లె” యనెను. అంత యోగసిద్ధిగల యాభూసురకుమా
రుఁడు మాతండ్రికోరినరీతిని తెల్లవారువములసృష్టించి, తెల్లవారినతోడ
నే గాధినరేంద్రునకుఁజూప నాతఁడుమాఱుమాటాడనేఱక, సత్యవతి
నిచ్చి వివాహమొనర్చె. మాయక్కనాతనితోఁబంపెను. కానిధనహీనుని
తో సార్వభౌమనందన యెట్లుకాపురముచేయునా? యని పుత్రికాను
రాగముచే విచారింపఁదొడఁగెను.

ఋచీకుఁడట్లు సత్యవతినిబరిణయమాడి, యామెతోఁగాపురము
చేయుచుండెను ఇట్టులుండనొకనాడు దారుణమగుదావానలము ధూమస్తో
మముతోగూడి చెలరేగి, తాపసకుటీరములఁజుట్టుముట్టనుండ, పొగచే
కన్నులుగానరాక తల్లులకైపిల్లలును, పిల్లలకైతల్లులును, భర్తలకై భా
ర్యలును, పత్నులకై పతులును, విలపించుచునొండొరులఁబిలిచికొనుచు
భీతులైఁ గోలచేయుచుండ సత్యవతి వారియాక్రందనధ్వనులనాలించి,
తనపాతివ్రత్యమహిమచే నాకసమున కాఱుమబ్బులసృష్టించి, వర్షధారల
చే దావానలమును శాంతింపఁజేసి, వారినందరిని సంరక్షించెను.

వేతాళకతతిని మునిగణములు శిష్యబృందములతో ఋచీకుని యింటికి నతిథులై రాగా వారికినాతఁడు భక్తితో భోజనమిడఁగోరి, సత్యవతికాసంగతిని దెలుప ఆపెయింటపోలెడు బియ్యము లేకున్నను వెంటనే పాతివ్రత్యమహిమచేఁ బదార్థములసమకూర్చి వంటలసిద్ధముచేసెను. అంతమాభావపరమానందముతో "మహాత్ములారా! వంటయైనది. భోజనమునకు దయచేయుఁడు." అనవారు "మాకుచలిబాధమిక్కుటముగానున్నయది. కావున నుష్ణోదకములసిద్ధముచేయింతువేని భోజనమునకు వత్తుమని పలికిరి ఆమాటలవిని అవ్యవధిగా నసంఖ్యాకులగు మునివరులకు వేడినీళ్ళెట్లుసమకూర్తునా? యని ఋచీకుఁడు చింతించుచుండ మాయక్కయది తెలిసికొని, భగవంతుని ప్రార్థించి, యుష్ణోదకపూరితమగు నొకనదినినిర్మించి, యందాతాపసుల స్నానము చేయఁబ్రార్థించెను. వారానఖంపచములగు నదీనీరములస్నానమాడి, రుచ్యపాకములభుజియించి, సత్యవతి పాతివ్రత్యమునుప్రశంసించి, యావేడినీళ్ళయేటికిఁ గౌశికియని పేరిడి, జీవనదినిగాజేసి, ఆనదియందుస్నానమాడినవారికి నభీష్టసిద్ధియగునని పలికి వెడలిపోయిరి.

ఋచీకుఁడు మాయక్క పాతివ్రత్యమునకు సంతసించి "సాధ్వీమణీ! నీకేమి కావలయునో కోరికొనుము." అనిపలుక సత్యవతియిట్లు తెలిపెను.

సత్యవతి:—ప్రాణేశా! నాతల్లిమాళవీదేవికిని నాకును సుతులు కలుగునట్లు వరమొసంగుము. మాయమ్మకుఁబుట్టుబిడ్డఁడు క్షత్రియతేజోవిరాజమానుఁడుగా నుండవలయును. నాకుకలుగుసుతుఁడు మీావలెనే బ్రహ్మతేజోవిభాసితుఁడుగా నుండవలయును. అనమాభావ మాయక్క కోరినట్లు పుత్రులనీయఁగోరి, యాగమొనర్పనుండ; మాతండ్రి మాతల్లితో మాయక్కకాపురమెట్లున్నదో చూడ నాఋచీకాశ్రమమునకువచ్చెను. ఆరాజదంపతులనాతఁడు సాదరముగఁబూజించి, తాఁదలపెట్టినయాగముపూర్తిచేసి, మంత్రపూతమగు పాయసమును వేఱువేఱు గిన్నెలలోనుంచి, సత్యవతితోనిట్లుపలికెను.

ఋచీకుఁడు:—సతీమణీ! ఈరెండుగిన్నెలలోను పాయసముంచితిని. అందుమొదటిగిన్నెలోనిపాయసము మీతల్లిభుజింపఁదగినది. రెండవగిన్నెలోనిపరమాన్నము నీవుచేకొనఁదగినది. ఈరెంటిని హోమవేదికకడనుంచుచున్నాడను. మీరుసుస్నాతలైవచ్చి మీమీపాయసపాత్రములఁజేకొని, పరమాన్నముల భక్తితోభుజియింపుఁడు. దాననీవుకోరినట్లు పుత్రులుపుట్టుదురు.

ఆమాటలవిని సంతానాతురలగు నామాళవీసత్యవతులు స్నానమాడివచ్చి, ప్రమాదవశమునఁ బాయసపాత్రములఁ దారుమారుగఁజేకొని, యందలిపాయసమునుభుజించిరి తోడనేఋచీకుఁడువచ్చి, పాత్రములుమారుటనుజూచి "సత్యవతీ! నేఁదెల్పినట్లుచేయకపోవుటచే నీగర్భమున క్షత్రస్వభావుఁడగునందనుఁడును, నీతల్లికడుపున సాత్వికస్వభావుఁడగుసుతుఁడును పుట్టుదురు." అనసత్యవతిభీతయై, ఇట్లుప్రార్థించెను.

సత్యవతి:—ప్రాణేశ్వరా! నాకుఁబుట్టువాఁడు బ్రాహ్మణస్వభావముకలవాఁడుగాను వానికిఁబుట్టువాఁడు క్షత్రస్వభావుఁడుగానుండునట్లును అనుగ్రహింపవలయును.

ఋచీకుఁడు:—సతీమణీ! నీవుకోరినరీతిని సంతానముకలుగును. సంతాపమందకుము అనియూఱడించెను. అటులనే మాతల్లియగుమాళవికి నేనును, మాయక్కసత్యవతికి జమదగ్నియు, బుట్టితిమి. ఆజమదగ్నికి క్షత్రియస్వభావుఁడగు పరశురాముఁడుదయించెను. అనియిటుల విశ్వామిత్రుఁడు నిజవంశక్రమమును దెలిపెను. ఆకౌశికవంశానుపూర్వకగాధనువిని రాముఁడిట్లుపలికెను.

రాముఁడు:—కౌశికమునీంద్రా! అసదృశమగు మీవంశచరితము బహువిధవిశేషములతో నలరారుచున్నయది. ఇట్టిసొంపగు గాధిగాధను తెలిపి మమ్మానందింపఁజేసితిరి. మానవులకీచరితమెన్నియో గుణపాఠములఁగఱపుచున్నయది అనిప్రశంసించెను. విశ్వామిత్రుఁడా రాత్రి శోణనదతటమునఁగడపి, తెల్లవారినతోడనే అచటినుండిబయలువెడలి మధ్యాహ్నసమయమునకు జాహ్నవీతీరముచేరెను.

## త్రిచత్వారింశత్యధ్యాయము.

### —♦ గంగావతరణము ♦—

జాహ్నవీతటమున నొకవటముక్రింద వారందరు సుఖాసీనులై యుండఁ గౌసల్యానందనుఁడు కౌశికునిఁ జూచి, యిట్లు ప్రశ్నించెను.

రాముఁడు:—పావనచరితా! మౌళిపీసుతా! పాపహారిణియగు నీగంగాతరంగిణి యవతరణవృత్తాంతమును వినఁ గుతూహలమగుచున్న యది. కావునదయయుంచి, ఈజాహ్నవీచరితమును వినిపింపఁ బ్రార్థించుచున్నవాఁడను.

విశ్వామి:—సుధామధురభాషణా! రవికులభూషణా! కలుషహరమగు నీభాగీరథీచరితము జనులత్యానందముతో నాకర్ణింపఁదగినది అందుమీరాయినవంశసంభవులకుఁ దప్పకవినఁదగియున్నది. వినుము! పూర్వము ప్రజాపరిపాలనతత్పరుఁడును, శూరాగ్రేసరుఁడును, సూర్యవంశసంభవుఁడునగు, సగరుఁడను సార్వభౌముఁడు విశ్వంభరావలయమును బాలించుచుండెను.

ఆచక్రవర్తికి విదర్భరాజాత్మజయగు కేశిని జ్యేష్ఠభార్య. వినతాసుతయగుసుమతి ద్వితీయభార్య. వీరిలోఁ గేశినికి నసమంజసుఁడనునొక పుత్త్రుఁడును, సుమతికిసగరనామధేయులు అరువదివేలనందనులును, పుట్టిరి. ఇట్లనేకపుత్రసుతసహస్రసమేతుఁడై యాసగరచక్రవర్తి సురగణపరివృతుఁడైన దేవేంద్రునిఁబగిది సకలైశ్వర్యసంపన్నుఁడై రాజ్యపాలన మొనర్చుచుండెను.

ఇటులసుఖముగాఁ గాలముగడుచుచుండఁ బట్టమహిషియగు కేశిని కుమారుఁడు అసమంజసుఁడు క్రూరస్వభావుఁడై పౌరబాలుర సరయూనదీజలములఁబడవేసి, యాయర్భకులందఱు గొట్టికొనుచుండఁ జూచి, యానందించుచుండెడివాఁడు. ఇటులఁ గొంతకాలముగడువఁ బురజనులు గర్భశోకములుభరింపఁజాలక, సగరునికడకు గుంపుగుంపులుగా వచ్చి, అసమంజసునియసమంజసకృత్యముల నివేదించిరి.

సాకేతసార్వభౌముఁడు శ్రుతిపుటదారణములగు నాదారుణవార్తలవిని, లజ్జితుఁడై తనసుతుఁడొనర్చుచున్న శిశుహత్యలకుదుఃఖితుఁడాయెను.

" ఆహా ! బురదలేనికాసారమును, విచారములేనిసంసారమును, భూవలయమునఁగానరావు. అంతఁ బ్రజాసౌఖ్యసంపాదనాసక్తుఁడగు సగరుఁడు వెంటనేరాజసభనుగావించి, మంత్రిపురోహితాదులతోఁ దనతనయుఁడగు నసమంజునిక్రూరకృత్యములఁ దెలియఁజేసి "ఈపాపాత్మునకుఁ దగుదండనమువిధించినగాని నేనిలువఁజాల ఈదుష్టుఁడు జీవించియున్న, ఇక నెన్నిశిశుహత్యలఁజేయునో! కావున వీనిఁగడతేర్చుటయే నాకుసమ్మతము. మీయభిప్రాయములఁగూడఁదెలుపుడు." అన ధర్మనిర్ణేతయగు నాచార్యుఁడిట్లుపలికెను.

ఆచార్యుఁడు:—రాజేంద్రా! ఇందరుబాలుర హత్యమొనర్చినవానికి వధయేతగుశిక్ష కానియీయపరాధి మీకగ్రమహిషియందుపుట్టిన సుతుఁడగుటచేమందీతఁడు యువరాజుగాను చక్రవర్తిగానుకానున్నవాఁడు ధర్మశాస్త్రములుకొన్ని చక్రవర్తులవధకనుమతించుటలేదు. దేశాంతరములకు దరిమివేయుటకంగీకరించుచున్నవి కావున వెంటనేనసమంజసుని విదేశములకుఁబంపివేయుటన్యాయము, అనితెలిపెను ప్రాడ్వివాకాదిధర్మనిర్ణేతలెల్లరు దానినేబలపరిచిరి. సగరుఁడు వెంటనేయసమంజసునకు సంకెలలవేయించి కింకరులచే విదేశములవిడిచిపెట్టించెను. "ఆహా ! సూర్యవంశనృపాలురకు రాజ్యపాలనమున ధర్మసూత్రములు ప్రమాణములుగాని, పుత్రాదిప్రేమపాశములు ముఖ్యములుకావు కావుననే వారు విష్ణుతుల్యులై ప్రజలచేఁబూజింపఁబడుచున్నవారు."

రామచంద్రా ! కంటివా ? నీపూర్వుల ధర్మానురక్తి వింటివా ? వారిసుతమమతావిరక్తి నీపూర్వులు విషయభోగములకై సింహాసనములనెక్కలేదు. ప్రజాసౌఖ్యసంపాదనమునకై రాజ్యములస్వీకరించిరి పుట్టిన భానుకులముననేపుట్టవలయు ఆమాటలవిని రాముఁడిట్లుపలికెను.

రాముఁడు:—మునిచంద్రా ! నిజదేశోద్ధారచరితముల వినుటకంటె ఘనానందము వేఱొండుకలదా? అందును స్వవంశ్యజీవితములెంతయునుత్సాహజనకములు. గురువర్యా ! పిమ్మటనేమాయె ?

కౌశికుఁడు:—రామా ! అట్లసమంజసుని దేశమునుండి తరిమివేసినతోడనే ఆతనినందనుఁడగు నంశుమంతుని యువరాజునిగాఁజేసి, సగ

రుఁడు తాపూర్తిచేయవలసియున్న తుదివాజిమేధమును చేయఁదలంచి, పౌత్రుఁడగు నంశుమంతుని యాగాశ్వరక్షకునిగా నియమించి, తురగమునువిడచెను. అంశుమంతుఁడు సైన్యసమేతుఁడై సపరివారముగా నా వారువమువెంటఁ గొంతదూరమేగ దేవేంద్రుఁడువచ్చి, ఆహయమును రహస్యముగా గొంపోయి, పాతాళలోకమునఁ గపిలమహర్షి యాశ్రమములో విడచెను.

అంశుమంతుఁడశ్వమును గానవేరక, పితామహునికడకువచ్చి, హయమదృశ్యమగుటను దెల్పెను. ఆమాటనువిని సగరుఁడు తనయుల రాఁబిలచి "పుత్రులారా! మీక్షాత్రతేజములు మెరయ జన్నంపుతేజని వేగమెకొనివచ్చి, నాచేనవభృథస్నానము చేయింపుఁడు.

సగరులు:—కోసలరాజేంద్రా! ఇదెముల్లోకములగాలించి యాగసైంధవమునుగొనిదెచ్చి, మీయజ్ఞము సాంతమగునట్లు చేయుదుము. తండ్రియాజ్ఞల నెరవేర్పనేలని సుతులుజీవించుటకంటె, హతులగుట మేలు అని యాయుధపాణులై, పుడమియదర నయోధ్యనుండిబయలు వెడలి, భూచక్రమంతయుఁదిరిగి, తేజినిగానవేరక, పాతాళమునకేగి, కపిలాశ్రమముననున్న సవనఘోటకమునుగనుంగొనిసంతసించి, మృత్యువాసన్నమగుటచే నటఁదపముచేయుచున్న కపిలునిగాంచి, ఇట్లుతలంచిరి.

"ఈతఁడే మనతత్తడి నెత్తికొనివచ్చినముచ్చు మహాబలశాలురమగు మనలఁజూచి, భయమంది, ఈదొంగతపసివేసముఁదాల్చి జపముచేయుచున్నట్లు నటించుచున్నవాఁడు ముందీదొంగపొగరడంచి, పిమ్మటఁ దురగమును గొనిపోవుదము." అనిపలుకుచుఁ గపిలమహర్షిపైఁబడి, బహువిధముల బాధింపఁదొడఁగిరి.

అంత నాకపిలుఁడు కుపితుఁడై యాయాతతాయులగు సగరకుమారుల తపోవహ్నిచే భస్మశేషులనుగాఁజేసెను. సగరచక్రవర్తి తన తనయులెంతకాలమునకును రాకుండుటచే దిగులొంది, అంశుమంతుని బిలిచి "కుమారా! నీవు నీపినతండ్రులేమైరో? యాగాశ్వమెటుబోయెనో? తెలిసికొని వారినిదానిని వెంటనిడికొనిరమ్ము పొమ్ము. నీకు శుభమగుగాక" అనిదీవించిపంపెను. అంత నాసగరపౌత్రుఁడు తాతకు

వందన మొనర్చి తిన్నగాఁ బినతండ్రులేగిన దారిని పాతాళమునకుఁబోయి యటమేధ్యాశ్వమునుగాంచి, పితరులఁగానలేరక, యటునిటుచూచు చుండ నరువదివేలబుగ్గిపోగులు కానవచ్చెను. అతడవ్విధప్పక తనపితృవ్యులభస్మరాసులని నిశ్చయించి, చింతించుచుండ మింటినుండి వైనతేయుఁ డిట్లుపలికెను

వైన:—ధీమంతుఁడా! ఓయంశుమంతుఁడా! నీపినతండ్రులందరు కపిలాపరాధ మొనర్చుటచే భస్మరాసులుగాఁబరిణమించిరి. కావుననీవు వృథాగాఁగాలహరణ మొనర్పక, వీరికుత్తమగతుల. గల్పింపఁగోరుదు వేని, యాకాశగంగను గొనితెచ్చి, ఈభూతిసమూహములపైఁ బ్రవహింపఁజేయుము దానిచే వీరికిముక్తికలుగును.

అంశుమంతుఁడా వినతాసుతోక్తులనాలించి అశ్వమును జేకొని, సగరునికడకువచ్చి దానినిసమర్పించి, ఆగరుడభాషణముల వినిపించెను. సగరుఁడాదుఃఖవార్తనువిని తనయులముక్తికై తపించుచుండనువ్వీడెను. సగరానంతరము అంశుమంతుఁడు చక్రవర్తియై, పినతండ్రులముక్తికై తలపోయుచుండెను.

ఇటులుండ నాయంశుమంతునకు దిలీపుఁడను పుత్రుఁడుదయించెను. దిలీపుఁడు రాజ్యకార్యనిర్వహణదక్షుఁడైనవెంటనే అంశుమంతుఁడాతనికిఁ బట్టముఁగట్టి, హిమవంతమున కేగి, గంగనుగూర్చి తపమొనర్చి, గంగనుగానక యే దేహమునువిడచెను. ఆయంశుమంతునకుఁబిమ్మట దిలీపచక్రవర్తి "గంగదివినుండి భువికివచ్చుటయెట్లు? నేనాసురనదీపావనజలములలోఁ బితరులకుఁ దర్పణ మొసంగి, వారలముక్తులఁగాఁ జేయుటయెట్లు?" అనియోజించుచుండ నాదిలీపునకు భగీరథుఁడను భాగ్యశాలిపుట్టెను దిలీపుఁడాసుతునిఁ జక్రవర్తినిగాఁజేసి, మందాకినిని గొనిరానేరక, మనోవ్యాధిచే మరణించెను.

దిలీపానంతరము భగీరథచక్రవర్తి, నిజప్రపితామహుల నుత్తమలోకములకుఁ బంపనిశ్చయించి, రాజ్యము మంత్రులవశ మొనర్చి, గోకర్ణక్షేత్రమున కేగి, పంచాగ్నిమధ్యమునఁ జతురాననునిగూర్చి తీవ్రముగాఁ దప మొనర్ప, నాసరోజసంభవుఁడు ప్రత్యక్షమై "రాజేంద్రా! నీనిరుప

మానసతపమునకు సంతసమందితిని. నీకుఁగావలసినవర మేదియో కోరుకొనుము." అనభగీరథుఁడిట్లుపలికెను.

భగీరథ:—వాణీరమణా ! నాపితరులగు సగరులభస్మదేహములపై నాకాశగంగ ప్రవహించునట్లుచేసి, వారలకు తమలోకములనొసంగి సంతానహీనమై నాతోనంతరింపనున్న సూర్యవంశము సంతతివంతమై సంతోషముతో వెలయునట్లు వరముఁబ్రసాదింప వేడికొనుచున్నవాడను.

బ్రహ్మ:—రఘువంశసరసీరుహభాస్కరా ! నృపవరా ! నీవుకోరినయట్లు నీమనోరథము లీడేరఁగలవు కాని గగనమునుండి గంగపుడమికిఁ బడునపుడాప్రవాహవేగమును భరింపఁదగినవాఁడుండవలయును లేకున్న గంగాపాతవేగముచే భూగతప్రాణివ్రాతమునకు ముప్పువాటిల్లగలదు. అందుకుదక్షుండు దాక్షాయణీపతియే. కావున నాశంకరునిఁ బ్రార్థింపుము. ఆగిరిజాపతి నీకుసహాయుఁడగుచో వియన్నది క్రిందికివచ్చునట్లుచేతును. అనియంతర్ధానమాయెను. భగీరథుఁడాసంతాపహరములగు భారతీశశీతలోక్తుల నాలించి, వికసితహృదయారవిందుఁడై, అంగుష్ఠాగ్రమున నిలచి, సదాశివునిధ్యానింప నాకపర్ది యాపార్థివునకుఁ ప్రత్యక్షమాయెను. భగీరథుఁడాసౌమ్యసుందరాకృతినిఁజూచి, ఇట్లుప్రార్థించెను.

భగీరథుఁడు :—ఓతాపహరణా ! ఉమారమణా నాప్రార్థనలఁ జేకొని, నాయందుఁగృపయుంచి, మందాకిని సురలోకమునుండి భూలోకమునకు వచ్చునపుడాసురనదీవేగముచేఁ బ్రాణివినాశముకలుగకుండఁ గాపాడఁగోరుచున్నవాఁడను అని దీనబాంధవుఁడగు శివుఁడందులకంగీకరింప నాతేఁడుగగనవాహినిని ప్రార్థించెను. అంతనాదివ్యనది మహావేగముతో నాకసమునుండి, యాపినాకపాణిజటాముకుటమునకవతరించి, యందుండి మెల్లగాహిమగిరితటమునకుజారి యటనుండి భూస్థలిపైఁబడి, భగీరథునివెంటఁ బాతాళమునకుఁ బ్రవహింపఁదొడంగెను

భగీరథుఁడట్లాదివ్యతరంగిణిని జహ్నుమునీంద్రుని తపోవనమార్గమునఁ గొనిపోవుచుండ నామునీంద్రుఁడా నదీవేగధ్వానమునువిని, యా సురనదిని తనకమండలమున నణచివేసెను. ప్రవాహమునకు ముందేగు

చున్న దిలీపనందనుఁడు ప్రవాహధ్వని వినరాకుండుటచే వెఱగంది, వెను
కకుఁదిరిగిచూడ నాత్రిదశనదీప్రవాహము కానరాదయ్యెను. అంతభగీ
రథుఁడు అదిజహ్నుమునీంద్రుని ప్రభావమనితలంచి, యాసంయమీం
ద్రునిట్లు ప్రార్థించెను.

భగీరథుఁడు:—ఓయమేయతపోవైభవా ! సుహాత్రసంభవా
నాప్రపితామహులగు సగరాత్మజులకు సద్గతులఁగలుగఁజేయఁగోరి,అనేక
వత్సరములన్నహారాదులఁజేకొనక, తపమొనర్చి అబ్జాసనాబ్జవైరిశేఖ
రులఁ బ్రసన్నులనుగాఁజేసికొని, ఈయమరాపగను నాతోఁబాతాళ
మునకుఁదీసికొనిపోవుచుంటిని సదయ హృదయా ! ఇంతదనుక నావెనుక
వచ్చుచున్న మిన్నేటివెల్లువమ్రోత వినరాకుండుటచే నేవెనుతిరిగిచూడఁ
నాకాయాపగయే కానరాకున్నయది. కావున నాయందు వాత్సల్య
ముంచి, చదలేటినీటినిఁ దిరుగఁబ్రవహింపఁజేయఁ బ్రార్థించుచున్న
వాఁడను.

కరుణారసపూరితమగునాభగీరథప్రార్థనముచే హృదయముద్రవిం
ప, నాతఁడుపావనరసపూరితమగు గంగాప్రవాహమును నిజకమండలు
వునుండి ప్రసరింపఁజేసెను అందుచే గంగకు జాహ్నవియను పేరువచ్చి
నది.

అంతనాభగీరథుఁడు సంతసమంది, జాహ్నవిని పాతాళమునకుఁ
గొనిపోయి, తనముత్తాతల బూడిదపోగులపై నాపావననదీజలములఁ
బ్రవహింపఁజేసి, ఆతోయములతో సాగరులకు జలాంజలులొసంగ,
వారెల్లరుముక్తులైరి. భగీరథునిచే దీసికొనిరాఁబడినదగుటచే గంగభాగీ
రథియని పేర్కొనఁబడుచున్నది. కౌసల్యాగర్భశుక్తిముక్తామణీ ! విం
టివా? నీపూర్వుఁడగు భగీరథునిచరితమును తాఁదలఁబెట్టినదుర్ఘటకార్య
మును విఘ్నములకుజంకక, యోర్పుతోసాధించువాఁడే పురుషసిం
హుఁడు.

రామచంద్రా! ఈభగీరథోపాఖ్యానమువలన నార్యసంతతివారు
తెలిసికొనఁదగిన ఘనభావమేదియన, ఒకమహనీయుఁడు తలపెట్టిన ఘన
కార్యమాతనికాలములో సాగకున్నను సత్సంతానము కలిగినచోఁ గొం

తత్కాలమునకైనఁ దప్పక నెరవేఱఁగలదనియుఁ, దనపితరులు మొదలిడిన ధర్మకార్యమును, ఆవంశమునజనించినపురుషునకుఁ బూర్తిసేయుట విధియనియు, అట్లునిజకులజసంతోషములఁ బూర్తిచేసినవారికీర్తి గంగాప్రవాహమువలెఁ బావనమై, చిరస్థాయినిగానుండుననియు, స్పష్టమగుచున్నది.

కౌసల్యానందనా! నిజశౌర్యమును ప్రదర్శించి స్వకులమునకు యశమునందఁ జేయనేరని బుడుతలగనుటకంటె నాయింట కోడండ్రు గొడ్డాండ్రగుట యే మేలు. ఆహా! యఱువదివేలపితరులనొక్కకుమారుఁడు పాపకూపములనుండియుద్ధరించి, పుణ్యలోకోన్నతప్రాసాదముల నివసింపజేసెను. అట్టివాఁడుకదా! నందనుఁడు. వందనీయుఁడు. వంశకరుఁడు.

రాముఁడు:—మునివరేణ్యా! వింటిమి, వినిపావనులమైతిమి, భానువంశరాజేంద్రుల చరితములు శ్రావ్యములు, పాపహరములు; వానినెంతవిన్నను తనివితీరదు.

లక్ష్మణుఁడు:—కౌశికమునీంద్రా! భగీరథసార్వభౌముఁడు ఒక్క గంగాప్రవాహమునే కొనిరాలేదు. అసమానయశోవాహినినికూడఁ దోడ్తెచ్చినాఁడు. మునికులతిలకా! మీయనుగ్రహముచే నుభయలోకతారకములగు పావనామూల్యోపాఖ్యానముల వినుచుంటిమి. ఆదశరథనందనులసంభాషణములకుఁ గౌశికుఁడలరి, ఆరాత్రిరాముదులతో సురనదీతటమున శయనించెను.

విశ్వామిత్రుఁడుఉషఃకాలముననేమేల్కని, గంగనుదాటుటకుఁ బ్రయత్నించుచుండఁ గన్నులముందుఁదెరవేసినట్లుఁ దుహినము దట్టముగా వ్యాపించియుండెను. ఆమంచుముసుంగులో నొకమనోహరమగు హరిగానము వినరాఁదొడంగెను. అంతఁ గౌసల్యానందనుఁడు లలితభూపాలరాగకలితమగు శ్రీహరిగానమునాలించి, కుశికనందనునితో నిట్లుపలికెను.

రాముఁడు—యతీంద్రా! ఈప్రాతఃకాలమున నీనీహారపటలములో నింతశ్రుతిలయముగా భగవల్లీల భక్తిరసమొలుక గానముసేయువారలెవ్వరై యుండుదురు? కిన్నరనందనలెవ్వరైన గంగానదీస్నానమునకు

వచ్చియుందురా? ఆహా! ఈగంగావేణివలె నీగానవాహిని నామానసము నాకర్షించుచున్నది.

విశ్వామిత్రుఁడు:—గానలోలా! ఈమించు మంచుముసుంగులో గాన మొనర్చువారెవ్వరైయుండునదియుఁ దెలియవచ్చుటలేదు. ఈభారతవసుధాస్థలిని మాలఁడు మొదలు మహారాజువఱకును గలమానవులెల్లరును భగవన్నామసంకీర్తనపరులే. అనుచుండ నొకపాటలాధరి శ్రీకాంతునిపాటలఁబాడుచు నావనుదీసికొని దరిజేరి, గంగయొడ్డున నిలచియున్న రామచంద్రుని దివ్యసుందరరూపమునుజూచి, తోడనే చేతనున్న తెడ్డు నొడ్డునఁబడవైచి, గంగానీరములతో రామపదసరసీరుహములఁగడిగి ఆపాదోదకముల శిరమునఁజల్లికొని, పాన మొనర్చియాదాశకన్య యా దాశరథినిట్లు నుతింపఁదొడఁగెను.

దాశకన్య:—ఓపతితపావనా! రమామోహనా! నీదివ్యసందర్శనముచేతను, నీపావనపాదోదకస్పర్శనముచేతను, నేను బాహ్యాభ్యంతరములఁగలుష విరహితనైతిని. ఓసర్వాంతర్యామీ, సామీ! వేదాంతవిదులగు యోగులే నీమహిమలఁదెలుపఁజాలకున్నయపుడు, నాబోటి మూఢులగుచేడియలు నీలీలలనుతించుటయెట్లు? కావున నోసరసిజలోచనా! నీచరణపంకజసౌరభ సమీరకరణములు నాపైనెప్పుడును ప్రసరించునట్లును గ్రహింపుము. అన, నాపల్లెదానిసంలాపములవిని సౌమిత్రి యిట్లుప్రశ్నించెను.

లక్ష్మణుఁడు:—సోదరీమణీ! నీవెవ్వతెవు? ఇట్టిదివ్యసౌందర్యకల్పవల్లివి పల్లియువిదవెట్లైతివి?

దాశకన్య:—రామానుజా! నేనురంభయనునచ్చరలేమను మున్నొకప్పుడు సురేంద్రుఁడీగాధేయుని తపమునకు విఘ్నమొనర్పుమని నన్నుబంపెను. నేనాయమరనాయకునియానఁ దలనుదాల్చి, యీముని తపోవనమునకేగి, నేనేర్చిన శృంగారకళావిలాసములఁ బ్రదర్శింపమొదలిడితిని. ఈసంయమిసార్వభౌముఁడు నాకుమున్ను వన్నెలాడియగు మేనకచేఁజిక్కి మోసపోయినవాఁడగుటచే నావిలాసములకు భ్రమపడక తపమాచరించుచుండెను.

ఒకనాఁడు శాంతమగు వసంతసమయమునఁ జల్లగాలి మెల్లగా వీచుచుండ, విపంచిశ్రుతిచేసి, మోహజనకములగు శృంగారపదముల గానమొనర్పుచుండఁగఁ దొడఁగితిని సుమిత్రానందనా! ఆనాఁడు నాకుముప్పుమూఁడుటచే నీతపసితేఁడు సమాధినిఁజాలించి, నావైపుచూపులసారించి, కనుదమ్ములెఱ్ఱఁజేసి, "ఓసీదేవదాసీ! నీమురిపెంపుసొబగుల నాకుఁజూపి, మోసగింపవచ్చితివిగా? దుశ్శీలా! నీవీదివ్యరూపమునువీడి, భూలోకమునఁ బల్లితొయ్యలివై జనింతుగాక!" యని శాపమొసంగెను. రామానుజా! ఆకాలమున నీమునిచంద్రుఁడిట్లు ప్రశాంతరూపుఁడుకాక, గ్రీష్మకాలప్రచండభాస్కరునిమాడ్కి దుర్నిరీక్ష్యుఁడై యుండెను. నేనాశాపమునువిన్నతోడనే యీమునీంద్రునిపాదములకడ సాష్టాంగముగాఁబడి "దయామయా! గాధేయా! నేనుసురేంద్రకింకరిని. నాయేలికయానపై నిటకువచ్చితినికాని నేస్వయముగాఁ గాముకినై రాలేదు. కావున నాపైఁగరుణించి, నాకొసంగినశాపమును మరలింపవేఁడికొనుచున్నదానను నేనుశబరనారినిగాబుట్టి, చేపలబుట్టల మోయఁజాలను కావున శాంతాత్ముఁడవై నాదోసముల సైరణచేయఁ గోరుచున్నదానను." అనిప్రార్థింప. ఈకౌశికుఁడు నన్నుజూచి యిట్లుపలికెను.

"ఓసురేంద్రకింకరీ! నీవుపరాధీనవగుటచే నీప్రార్థనమన్నించితిని. కానినీకు భూలోకమునఁబుట్టుటతప్పదు. ముందుశ్రీహరి దాశరథియైపుట్టి మిథిలకేగుచు నీదారినివచ్చును అపుడు నీవాపురుషోత్తముని పాదతీర్థములఁ బానమొనర్చి, శాపవిముక్తవగుదువు. నీవంతదనుక శ్రీహరినామకీర్తనము చేయుచు గంగపై బాటసారుల దాటించుచుండుము." అని శాపమునకుగడువొసంగెను. ఆవెంటనే నేను శృంగబేరపురనాయకుఁడగు రోహుఁడను పల్లివానికిఁ బుత్రికనై భాగవోత్తముఁడగుగుహునకుఁ జెల్లెలినై జన్మించి, పెండ్లియాడకకన్యగానుండి, నీరాకకెదురుచూచుచు, నీలీలలగానమొనర్చుచు, నీగంగావాహినిపైఁ బడవనుదాటించుచుంటిని. నీదివ్యసందర్శనముచే శబరీజన్మమునువీడి దివ్యకాంతనైతిని అని నిజశాపోదంతమునుదెలిపి పూతగాత్రియగు నాపోతనేత్రి వారినందఱిని గంగావారినిదాటించి శ్రీరామచంద్రునకుఁ బ్రదక్షిణనమస్కారములొనర్చి వెడలిపోయెను.

—: చతుర్వింశత్యధ్యాయము :—

అహల్యాశాపవిమోచనము.

విశ్వామిత్రుఁడు గంగనుదాటి మిధిలకేగుచు "రామచంద్రా! శీఘ్రదయమునకుమనము జనకునియజ్ఞవాటమునకుఁ జేఱగలము. కావున నెమ్మదిగారమ్మా వనమధ్యమునుండిపోవుదము." అని గౌతమాశ్రమములోఁ బ్రవేశించినతోడనే రాముడు కౌశికునిట్లుప్రశ్నించెను.

రాముఁడు:—గురువరా! ఈతపోవనమతిసుందరముగఁ గానవచ్చుచున్నయది కాని యిందుఁదాపసజనులు కానరాకున్నవారు కారణ మేమి ?

కౌశికుఁడు:—రామచంద్రా! ఈతపోవనచరితము వినదగినదియు, విచారింపదగినదియు, నైయున్నయది సుచరితా! యెంతటివిద్వాంసులును, మఱెంతటితాపసోత్తములును యికనెంతటి చక్రవర్తులును, అంతకుమించిన సురేంద్రపుంగవులును, కూడ కామక్రోధములకు వశమగువారేకాని వానిఁదప్పించుకొనఁ జాలువారుకానరారు. ఇందుకు లెక్కనిదర్శనములుకలవు. ఇప్పుడు నేదెలుపఁబోవు విషయమాయంశముసే బలపఱచును. వినుము.

మున్ను జగనిర్మాణచతురుఁడగు చతురాననుఁడు లోకోత్తరరమణీమణిని నిర్మింపఁదలఁచి, ప్రకృతిసౌందర్యమునంతను భోగుచేసి, దానితో నహల్యయను సుందరీరత్నమును నిర్మించెను. ఆయపూర్వకామినీనిర్మాణమును దిక్పాలురువిని, యహమహమికతో నహల్యకొఱకు నాత్మభావునికడకేగి, తమకాసుందరాంగి నొసంగుమనిప్రార్థింప బ్రహ్మవారిలో నెవరికిచ్చుటకును మనసొప్పక, "దిక్పాలులారా! ఎవరుభూప్రదక్షిణము చేసిముందుగానాముందునకువత్తురో వారికీవనరుహేక్షణనిత్తును" అనితెలుప ఆదిక్పతులొకరికంటెనొకరు ముందువచ్చి, ఆమందయానను బడయుకోరికతో వారివారివాహనములనెక్కి, యొక్కపెట్టున వెడలిపోయిరి.

అంతఁ గమలాసనుఁడాసరోజముఖని ముద్గలమునీంద్రుని యాశ్రమమునకుఁగొనివచ్చి "ఈబింబాధరిని నీయొద్దనుంచి విద్యాబుద్ధులఁగఱ

పుచుండుము." అని తెలిపి వెడలిపోయెను. ముద్గలుండు భారతీపతియా
నతిని, అహల్యను పుత్రికనువలెఁ బోషించుచుండెను. ఇటులుండ
గౌతమమునీంద్రుఁడు భార్యనుఁబడయఁగోరి, తగుకన్యకామణి నన్వే
షించుచు, ముద్గలునికడకువచ్చి, అటనసమానరూపగుణశీలములతో,
వెలయుచున్న యహల్యనుగాంచి, సంతసించి, ముద్గలమునీంద్రునిఁ దన
కాకన్నియనిమ్మనికోరెను. అదివిని యాతపసి యిట్లుప్రతివచనమొసం
గెను.

ముద్గల:— గౌతమమునీంద్రా! ఈచంద్రవదన చతురానన నం
దన. ఈమెను బరిణయమాడుటకు నియమముకలదు.

గౌత:-- మునిపుంగవా ! అనియమమెట్టిది. నాకదిసాధ్యము
గునా ?

ముద్గ:—వినుమాశపథమును. ఈభూవలయమును చుట్టుతిరిగి
మొట్టమొదటనెవరు కమలభవునిసందర్శింతురో వారికీసుకతినిచ్చుటకు
బ్రహ్మశాసచేసెను. అట్లుతిరిగివచ్చి యీమోహనాంగిని జేపట్టుటకు
దిక్పాలురేగియున్నవారు నేడోరేపో రానున్నారు. ఆమాటలువిన్న
తోడనే గౌతముఁడు విన్నఁబోయి "ఆహా! నేనెక్కడ! భూగోళమును
జుట్టివచ్చుటయెక్కడ! అట్లుచేయకున్న నీకన్నియను జేకొనుటయెక్కడ
అని చింతించుచుండ నాయతపాదమునకు ముందొకయాగధేనువు దూడ
నీనుచుండుట కానవచ్చెను. అంత గౌతముఁడాగోవుకడకేగి దానికి
మున్నూరు ప్రదక్షిణమొనర్చి, యావెంటనే బ్రహ్మకడకుబోయి,
యహల్యను దనకిమ్మనికోరెను. అదివిని బ్రహ్మ "మునివరా! భూప్రద
క్షిణమొనర్చినవానికి నాపుత్రికనియ్య నిశ్చయించితిని. నీకీనియమము
తెలియదుకాఁబోలు.

గౌత: — పద్మాసనా! ఒకసారికాదు. త్రివారము ధరావలయ
మును గుమ్మరివచ్చితిని. నీకుసందియమున్న ముద్గలునిదెలిసికొనుము.
అననావిధాత యబ్బురమంది, యాతనితో ముద్గలునివద్దకేగి యడుగ
నామహర్షి "భారతీరమణా! గౌతముఁడు ప్రసవించుచున్న ధేనువునకుఁ
బ్రదక్షిణముచేసెను. అదియు భూప్రదక్షిణమునుసమము లే. కావున

గోప్రదక్షిణముచేసి ముందునిన్ను సందర్శించిన యీగౌతమునకు నహల్యనియ్యవలసినదే" అని తెలిపెను, విధాత ముద్గలునిబోధననుసరించి, యహల్యను గౌతమునకొసంగెను. గౌతముఁడు అహల్యనుకైకొని, బ్రహ్మకు వందనమొనర్చి వెడలిపోయెను.

అహల్యావివాహమైన మఱునాఁడు దేవేంద్రుఁడు దిక్పతులకు ముందుగావచ్చి, యహల్యనిమ్మని యజునికోరెను, "నీకంటెముందుగా వచ్చిన గౌతమునకు నహల్యనిచ్చిపెండ్లిచేసితినని" సరసిజాననుఁడు తెలుపనా వేల్పులరాయఁడు వెల్లఁబోయి ఇట్లుపలికెను.

ఇంద్రు:—భారతీరమణ! ఆగౌతముఁడు మాతోఁబయలుదేరలేదు. మాకెకుగుపడనులేదు. అతఁడేదియొమోసముచేసి యహల్యనపహరించినాఁడు.

బ్రహ్మ:—శచీవల్లభా! గౌతముఁడు గోప్రదక్షిణమొనర్చి, మీకుముందువచ్చి యహల్యనందుకొనెను. గోభూప్రదక్షిణములు తుల్యబలములు ఆధర్మసూక్ష్మము నాతఁడు తెలిసికొనెను. మీరెరుంగరైతిరి. ఆమాటలువిని యింద్రుఁడు గౌతమునిపైఁ బగగొనివెడలిపోయెను.

అట్లుసురేంద్రుఁడు గౌతమునిపరాభవింప సమయమునకు వేచియుండి తుదకొకనాఁడు చంద్రుని సహాయునిగాఁజేకొని, నిశీధసమయమున గౌతమాశ్రమముచేరి, యానిశానాధునిచేగోడికూతకూయించెను. గౌతముఁడాధ్వని చరణాయుధకూజితమనిభ్రమసి, దర్భాసనాదులఁజేకొని, స్నానమునకై గంగానదికేగెను.

అంతఁ బాకశాసనుఁడు గౌతమరూపముతోఁ బర్ణశాలలోఁ బ్రవేశింపనాగౌతమపత్ని యాతనిపతిగాభావించి "ప్రాణేశా! స్నానాదులఁదీర్చకయే తిరుగవచ్చితిరేల? యింకనువేళకాలేదా! అన దేవేంద్రుఁడిట్లుపలికెను.

దేవేంద్రుఁడు:—కాంతామణీ! ఎంతకాలమునకుఁ జెవికింపగు సంబోధనమునువింటిని! పికవాణీ! తిరుగనొకసారి "ప్రాణేశా అనిపిలచి నన్నానందసాగరమున నోలలాడింపుము.

అహల్య:—ఓరీ! నీవెవ్వఁడవు, నాపతిరూపముతో నిటకేల వచ్చితివి?

దేవే:—బింబాధరీ! గౌతముఁడు కృత్రిమభూప్రదక్షిణమొనర్చి బ్రహ్మనమోసగించి, నిన్నుపరిగ్రహించెను. అట్లుకాకున్నచో నీవు నాకర్ధాంగివై యుండెడిదానవు. నారాకకొంచెమాలస్యమగుటచే నాతని రేఖ బయలుపడ నీవామోటుతపసిచేతఁ బడితివి. సురేంద్రమహిషివై యుండఁదగిననీవు ఇట్లుబీదబాపనికి నాలివైతివి.

అహల్య:—ఓసురనాయకుఁడా! నీనిజరూపమెఱుఁగక నావల్లభుఁడవనుకొని నిన్నట్లు సంబోధించితినికాని నీపైఁబ్రేమచేగాదు. మాఱు పలకక తత్క్షణము పర్ణశాలనువిడచి, వెడలిపొమ్ము. లేకున్న గౌతమశాపానలమునకు శలభమగుదువు.

ఇంద్రుఁడు:—చకోరాక్షీ! నాదివ్యరూపము చూడకుండుటచేతను నాదివ్యైశ్వర్యములఁ దిలకింపకుండుటచేతను, నన్నునిరాకరించుచుంటివి. అని దివ్యమణిభూషణాలంకృతుఁడై, మందారసుమమాలగళమునఁగ్రాల నిజరూపముతో బ్రత్యక్షమాయెను. అట్లుప్రత్యక్షమైన సురపతిని జూచినతోడనే శరీరముకంపింప, ప్రాణములుపైకెగుర, నాలుకతడియార, నాగౌతమపత్ని గద్గదకంఠముతో నిట్లుపలికెను.

అహల్య:—శచీవల్లభా! ఇట్లుసాహసించి మర్యాదాహీనముగా మాటలాడదగునా మాతృసములగుపరకాంతల నాశింపనగునా? వలదు వలదు. నీకీదుర్బుద్ధివలదు. ఓజడాత్ముఁడా! వేల్పులతేఁడా! దినపతిపాదప్రసాదముచే వికసించు పద్మినీలతికల ఖద్యోతకాంతిప్రసరములచే వికసితములనుగా చేయగోరుటయు, నిజపతిపాదప్రసాదముచే సంతసించు సాధ్వీతిలకములఁ గాంచనప్రదర్శనములచే సంతసింపఁజేయఁజూచుటయు మూర్ఖకృత్యములుకావా? సతీమణులనేత్రములకుజరిత్రహీనులసంపదలు చితాభస్మములవలెఁ గానబడునని తెలిసికొనుము. నాశీలసితచేలముపై లోకనిందాంజనవర్షమును కురియింపకుము.

ఇంద్రుడు:—అలివేణీ! భీతిల్లకుము నిన్నాగౌతముఁడేమియుఁ చేయఁజాలడు అని మెల్లగా నాపెదగ్గఱకు రాఁనొడంగెను.

అహల్య:—ఓ! తులువా! ఏమని వాగుచుంటివో తెలియకుం టివి. అత్యున్నతమగు నమరరాజ్యగిరిశిఖరమునుండి కామాంధుఁడవై దుస్తరపాపకూపమునఁ బడనుంటివి. నానాధుడింటలేక నేనొంట రిగానుంటను గనుఁగొని నాకుటీరమునఁ జోరునివలెఁ జొరఁబడుటయే కాక, తుచ్ఛసుఖమునకాశించి, నశింపనుంటివి. నీయట్టినీచస్వభావుఁడు విబుధసార్వభౌముఁడగుట ఎట్లుతటస్థించె ఓ! పాపీ! నాపతివచ్చులోపున నన్నుంటజూచుచుంటివిగా! కట్టా! పాపాత్ముడా! పావనచరితులగు కశ్య పాదితులకుఁబుట్టి, పావననాముఁడగు వామనునకు సోదరుఁడవై యజ్ఞ కాలముల వేదమంత్రములచే నాహూతుఁడవై పవిత్రమగు హవిర్భాగ మునుభుజించునీనాలుక యిట్లునరకపాపకములగు హీనోక్తులఁ బలుకు టకెట్లు సిగ్గుచెందకున్నయది? ఓమందుఁడా! నాముందునిలువకపొమ్ము అనినిందించుచుండ గౌతమునిపదుకాధ్వానము పర్ణశాలలోనికి వినవ చ్చెను. వెంటనే గుండెలవియ నాయాఖండలుఁడు పర్ణశాలనుండి రహ స్యముగాఁ బరిగిడఁబోయి, తొట్రుపాటుచే గౌతమునికెదురుఁగాబో యెను. అతఁడాదేవేంద్రునిఁ బరికించి కంటనగ్నికణములు రాల నిట్లు పలికెను.

గౌతముఁడు:—ఓరీ! కుటిలాత్ముఁడా! శచీకాంతుఁడా! ఎంతటి ద్రోహముచు జేయనెంచితివి. నిశాచరుఁడగు జాబిల్లిని గోడిగాఁజేసి, మలిజామున నే తుదిజాము కూతఁగూయించి నన్నుమోసపుచ్చి, నాకు టీరముఁలోఁజేరితివిగా! ఓరా! హీనుఁడా! బిడౌజసుఁడా! ఇంతటినుండి నీవు దేహమాపాదమస్తకము అసహ్యానుగురూపముతో నుందువుగాక. నీకీపాతక కార్యములో సహాయుఁడైన నీదోషాకరుఁడు కళంకితుఁడై యుం డుగావుత అనిశపియించి పర్ణశాలలోనికేగి, భీతయైవెలవెలబారి నిలచి యున్న యహల్యనుజూచి, యిట్లుపలికెను.

గౌతముఁడు:—ఓకుల్టలా! జారునింటఁజేరనిచ్చి, వానితో సంభా షించుచుంటివా? పాపాత్మురాలా! నీవుపాషాణరూపమునుదాల్చి, పడి యుండుము అనిశపియించెను అంతఁగోపములోఁ గుటీరమునువిడచి, పో

ననుకన్న పతినిగాంచి, యాయహల్య వంతచెంది పతికివందన మొనర్చి, శిరము వంచి యిట్లు ప్రార్థించెను.

అహల్య:—సర్వజ్ఞా! ప్రాణవల్లభా! నేనేపాపమెఱుంగను మీరు పర్ణశాలనువదలి పైకివెళ్ళినతోడనే, మీరూపముతోఁ జపలచిత్తుఁడగు శచీపతి కుటీరములోనికిరాగా వానిని మిమ్ములనుగాఁదలంచి, పలుకరించితిని. అటుపిమ్మట నాపాపాత్ముఁడు నిజరూపముతోఁ బ్రత్యక్షముకాగానే నేవానిని నిందించి, పొమ్మనుచు టిని. అంత మీరాపవలచప్పుడు వినరావాఁడుభీతుఁడై, పర్ణశాలనుండిపరుగిడెను. ఇంతకుమించి యిటజరిగిన పాపకార్యమేదియును లేదు. నమ్ముకునామాట పరమేశ్వరసాక్షిగాఁ దెలుపుచున్నదాన. మీపాదములాన. మునినాథా! నిజమారసి, శాంతాత్ములరై, నాకొసంగిన శాపమును మాపుసేయఁగోరుచున్నదానను పాపమెఱుంగనిసతులపై, మీయట్టి దయామయులగుపతులు కనికరింపవలదా? యోగదృష్టితోఁ బరికించిన మీకుఁదెలియరానిదికలదా! అనితనపాదములపైఁబడి, విలపించుచున్న యహల్యనుజూచి, గౌతముఁడిట్లుపలికెను.

గౌతముఁడు:—అహల్యా! నీవీనిశీథసమయమునఁ బతియింటలేనప్పుడు పరాయివానితో వాదప్రతివాదములొనర్పుట దోషముకాదా? నీపాతివ్రత్యమహిమచే మోసగింపవచ్చిన దోషకారిని శపింపవలదా? కావున నాశాపమునీవనుభవింపవలసినదే కానిపరిశీలింప నీవంతపాపాత్మురాలవుకావని తోచుటచే శాపపరిమితి కొంచెముతగ్గించితిని. వినుము.

ఇదిమొదలు నీవుపాషాణరూపముతోఁ బడియున్నను అంతరాత్మకలదానవై శ్రీహరినిధ్యానించుచుందువు. కొంతకాలమైనపిదపఁ బరాత్పరుఁడగు శ్రీహరి మానవకుమారరూపుఁడై రామనామముతోఁ పుడమినవతరించి, కౌశికునివెంట మిథిలకేగుచు, ఈదారినిరాగలఁడు. అపుడాపతితపావనుని పదసరసిజస్పర్శచే నీవుపాషాణాకృతినివిడచి యోషామణివై పూర్వజీవితవగుదువు నేను శ్రీరామదర్శనమగువఱకు హిమవంతమునకేగి యటతపమాచరింతును. నేనువచ్చువఱకు ఈతపోవనము

యథా పూర్వముగా శోభించుచుండును. అనిగౌతముఁడు తపోవనమును విసర్జించి, వెడలిపోయెను. అతఁడేగినవెంటనే యహల్య శిలయై, యిం దెచటనో పడియుండెను. ఇదియీతపోవనచరితము.

రామచంద్రా! మార్గముననున్న ప్రతిశిలమీఁదను నీపదసరసిజ ములనుంచుచుఁ బోవలయును. అనుచుఁ గౌశికముందునకేఁగ రామపాద మొకరాతికిఁదాకి అరాయి యహల్యయై లేచినిలచి, చేతులుజోడించి, రామునిట్లుస్తుతించెను.

అహల్య:—సురవందితచరణా! రమారమణా! నాపాపపుపాషా ణాకృతికిఁ దాకుటచే నీమృదుపదసరసీరుహముకందెనా? ఓసర్వసాక్షీ! దీనరక్షీ! ఇంతకాలమునకు నాపాపములఁ బరిహరింపఁ గృపకలిగెనా కౌసల్యానందనా! నీచరణనలినప్రసారమునకై నేనెన్నివర్షములనుండి యో యెదురుచూచుచుంటిని నేఁడు నీపతితపావనమోహనరూపమును కనుగొంటిని ధన్యతగంటిని ఓ! మునిమానసపుండరీకవాసా! చంద్రికాన మసుందరమందహాసా! దూరమునుండియే నీనామధేయాక్షరముల ను చ్చరించినమాత్రాన దురితాంధకారము తొలగుచుండనీపాదపంకజస్పర్శముచేఁ గిల్బిషములు దూరమగుటలో వింతయేమున్నది. ఓ! పతితో ద్ధారకా! కౌసల్యాబాలకా! మహాత్ములయనుగ్రహమట్లు ఆగ్రహము ను, శుభహేతుకమనితలఁచెదను. అటులకాకున్నచో నానాథుఁడు నాపై నలిగి నాకొసంగినశాపముచే నీనీలనీరదశ్యామాకృతిని దర్శించు భాగ్య మెట్లుసమకూరును?

ఏకృపానిధి పదకంజపరాగమహిమల శ్రుతిమస్తకములుకూడ వర్ణింపజాలవో, ఏదీనబాంధవుని నాభికమలమునుండి యీచరాచర సృష్టికర్త యుద్భవమందెనో ఏవనమాలి పావననామసారమును పాన మొనర్చి శంకరుఁడానందపరవశుఁడై నృత్యముచేయునో అట్టిమురితహారి యగు శ్రీహరి నాకుదర్శనమొసంగుట నేనాదివ్యరూపుని కన్నులార గాంచుట, నాపతిశాపమహిమయే. అనిస్తుతించుచుండ గౌతముఁడటకు వచ్చి, శ్రీరామునికినమస్కరించి పూతజీవితయై నిలచియున్న యహల్య

నుజూచి, సంతసించి యాసతీమణితోఁగూడి రాముని చరణములకుఁ బ్రక్షాళనమొనర్చి ఆపావనజలముల శిరములపై జల్లుకొని యిట్లుపలికెను.

గౌతముఁడు:—ఓభవభయహారా! రమామనోహరా! పంయోగవియోగాదిద్వంద్వములు నీతత్వమెఱింగిన వారినంటఁజాలవు వెలుగు కలజోటుల జీకటులు చేరఁజాలవు ఓ! గరుడవాహనా! సంసారకాలసర్పము నీభక్తులఁగరువఁజాలదు. నిగమాంతసంచారీ! నీస్మరణముతో నిద్రింతును. నీస్మరణముతో మేల్కాందును. నీస్మరణముతో సంచరింతును. నీవెల్లప్పుడును నాయుల్లమున నివసింప ననుగ్రహింపుము అని స్తుతియించి విశ్వామిత్రునీక్షించి, "సుహృదయా! గాధేయా! నీమూలమున నావనభువికి ఈభువనమోహనరూపుఁడగు రాముఁడేతెంచెను నీమూలమున నాకుఁతిరుగ అహల్యసంప్రాప్తమాయెను. నీవు మాయతిధ్యమునంగీకరించి మమ్ముఁగృతార్థులనుగాఁ జేయఁగోరుచున్నవాఁడను.

కౌశికుఁడు:—గౌతమయతీంద్రా! నీవెఱుంగనిరహస్యములుకలవా? నీయాజ్ఞానుసారము మెలఁగవలసినవారముకాని పరాయివారము కామె. శాస్త్రములు శ్రోత్రియాన్నముల యాచించితినవలయుననియుఁ లోకకోదనములఁ బరిత్యజింపవలయుననియుఁ దెలుపుచున్నయవి కావున మీయట్టి శ్రోత్రియోత్తములయింట, నన్నముతింట, హవ్యభక్షణము కంటె శ్రేష్ఠము. అనిపలికి కౌశికుఁడు రామలక్ష్మణులతోడను మునిపుంగవులతోడను గౌతమాశ్రమమున నారాత్రిగడపి తెల్లవారినతోడనే యహల్యాగౌతములకడ సెలవుగైకొని మిధిలకు వెడలిపోయెను.

—: పంచవింశత్యధ్యాయము :—

సీతాచరితము.

కౌశికుఁడు మిధిలానగరముసమీపించి రామలక్ష్మణులసంబోధించి యిట్లుపలికెను.

విశ్వాను:—రాజనందనులారా! అటుచూడుడు. బంగరుశిఖరములతోఁగూడి తెల్లనివెండికొండలవలెఁ గానవచ్చుచున్న యాయున్నతసౌధమాలికలు మిధిలానగరములోనివియే ఆనగరరాజమును బరిపాలించు జనకుఁడు రాజాధిరాజైయుఁ నిరీహుఁడగుతేఁడని, ప్రసిద్ధికెంది

యున్నవాఁడు. ఈలోకమున నిట్టిచిత్రకాముఁడగు భూపాలుఁడు కానరాఁడు
ఈజనకక్ష్మాపాలునికడ సన్యాసులుకూడ "తత్త్వమసి, సర్వంఖల్విదం
బ్రహ్మ"లోనగు వేదాంతవాక్యముల తత్త్వమును దెలిసికొనుచుందురు.

మఱియొకవిశేషమేమన ఈరాజచంద్రునియింటఁ ద్రిలోకాతిశ
యరూపగుణశోభితయు అనన్యసామాన్యపాతివ్రత్యవిరాజితయు అయో
నిజాతయు, నగు సీతయను కన్యకామణికలదు.

లక్ష్మణుఁడు:—మునీంద్రా! ఆజనకనందిని అయోనిజాతయంటిరే
ఆపావనచరితమేదియో తెలుపప్రార్థించుచున్నవాఁడను.

విశ్వా:—సుచరితా! సుమిత్రాపుత్త్రా! వినుమాసీతాలలామ
జన్మవృత్తాంతమును పూర్వము బృహస్పతినందనుఁడగు సోమదేవుఁడను
మహర్షి రోహిణియనుభార్యతో హిమనగారణ్యమున ఆశ్రమమును
నిర్మించుకొని అందుఁదపమొనర్చుచుండెను కొంతకాలమునకామునిదంప
తులకు మాధవానుగ్రహముననొకకూతురుపుట్టెను. వారాబిడ్డకు వేదవతి
యనినామకరణమొనర్చి గారాబముతోఁ బెంపఁదొడంగిరి. ఆబాలిక
శరత్కాలచంద్రికవలె దినదినప్రవర్ధమానయగుచు, నోటమాటలనుకువ
నేర్చినదిమొదలు "హరీ, మాధవా, నారాయణా, పుండరీకాక్షా" అని
యిట్లుభగవన్నామములఁ బలుకఁదొడంగెను అటుపైనాటలాడుటకు
మొదలిడినతోడనే శ్రీహరివిగ్రహములఁ జేకొని వానికినీళ్లుపోయుట,
బట్టలుకట్టుట, ఉయ్యెలలోఁబరుండఁబెట్టి యూఁచుట లోనగుకార్యముల
తోఁ గాలముగడుపఁదొడంగెను. ఆయాశ్రమవాసులు "నీవెవ్వరిని పెండ్లి
యాడెదవు?" అనిప్రశ్నింప "శ్రీకాంతు"ననియు, తోడిబాలికలు నీను
గనిపేరేమన "పుండరీకాక్షుఁడ"నియుఁ బలుకుచుండెడిది. అంతకు పైవ
యస్సు వచ్చినతోడనే తనపేరుసార్థకమగునట్లుల వేదాదిసకలవిద్యలయం
దును, కోవిదయై వినయశోభితయై, భూతదయావిలసితయై, పితృపూ
జలసేయుచు, ఏకాంతముగా శ్రీకాంతుని ధ్యానించుచువేణువీణాదులఁ
జేబూని, వనమాలిలీలల గానయొనర్చుచుఁ గాలముగడుపుచుండెను.

ఆకాలమున వేదవతి కేవలసౌందర్యముననేకాక, యున్నతవిద్య
లయందును, వినయసంపదయందును, అసదృశయై వెలయుచుండుటచే,

ఆసతీమణిని బరిగ్రహింపఁగోరి, నరసురాసురకుమారులు సోమదేవునికడకువచ్చి, తమకు వేదవతినొసంగుఁడని కోరఁదొడంగిరి. రోహిణీసోమదేవులు తమకూమారితకుఁ బరిణయమొనర్ప నిశ్చయించి, గుణవంతులగువరుల వేదవతికిఁ జూపమొదలిడిరి కాని యాగోవిందచరణేందీవరసేవాతత్పరయగు వేదవతి వారు పరిణయార్హులు కారని తెలుపుచుండెడిది. అంతనా దంపతులు రహస్యముగా నిజనందినిని జేరఁబిలచి, ఇట్లు ప్రశ్నించిరి.

సోమదేవ:—తల్లీ! అసమానలావణ్యశోభితులును, నిరుపమానవిద్యాకోవిదులును, నిస్తులశీలసంపన్నులును, అగుకుమారవరులఁ బరిగ్రహింప నిరాకరించుచుంటివి. నీహృదయాంతరమున నెవ్వని బ్రేమించియుంటివో వెల్లడింపుము. పుత్త్రీ! కన్యాదానముభయలోకానందసంధాయకముగదా!

రోహిణి:—అమ్మా! బిడ్డలు మాతాపితరులకుఁ దమహృదయములఁ దాపనగత్యముండదుకదా! వివేకవతివగు నీకుఁ దెలియని ధర్మముకలదా? కావునబిడ్డా! నీకభిమతుఁడగువరుని జేర్కొనుము. లోకమునఁ దలిదండ్రులకు నిజకన్యకాపరిణయమహోత్సవముల నవలోకించుటకంటె మెండగుపండుగ వేఱొండులేదు. కావున, నీహృదయము నెఱింగింపుము.

సోమ:—పుత్రీ! బదులుపలుకవేల? నీజననికి లక్ష్మీసమానవగునిన్ను నారాయణసముఁడగు వరునకు కన్యాదానమొనర్చి, ఆపరిణమహోత్సవమును గన్నులారఁగాంచఁ గోరికకలదు. కావున నీకభిమతుఁడగు వరునిజేర్కొనుము.

వేదవతి:—ప్రత్యక్షదైవతములారా! మాతాపితలారా! తలిదండ్రులయూహలకు వ్యతిరేకముగా పుత్రికాపుత్త్రులు నడువరాదు. వారికడ నిజసంకల్పములఁ దెలుపకయుండరాదు. పితరులు నిజసంతానసంతోషసంపాదనమునకై ప్రాణములఁగూడఁ బరిత్యజింతురనుటకు సంశయములేదు. కావున దయాస్వరూపులారా! జననీజనకులారా! వినుడు నానిశ్చయమును నాకు శ్రీమన్నారాయణుని బరిణయమాడ కుతూహలముకలదు. నేనుచిన్ననాటనుండి భగవంతుని భర్తనుగాఁ

బడయఁగోరి యాశ్రీవారిని పూజాధ్యానవిధులతోఁ బ్రార్థించుచుంటిని. ఆపావననాముఁడు స్వప్నములయందు నాకుఁబ్రత్యక్షమై ॥ నీమనోరథ మీడేరనున్నది.” అనిపలుకుచున్నవాఁడు అట్టికలలనెన్నిటినో కనియుంటిని. కావున నాయభిలాషకుఁ బరిహాసింపక, నాప్రయత్నమునకు సహాయులుకాఁగోరుచున్నదానను మీరును, నేనును, గలసి ఏకాగ్రచిత్తవృత్తితో ఆనళినాక్షునిధ్యానింతము భక్తవరదుఁడగు భగవానుఁడు మన కోరికలఁ దప్పకయీడేర్పఁగలడు. అనినానిశ్చయము.

తలిదండ్రులు:—సుమతీ! వేదవతీ! నీయభిమతమెంతయుఁ బ్రశంసనీయమనుటకు సంశయము లేదు. భగవంతుఁడు భక్తవత్సలుఁడనుటకును సందియము లేదు. కానియట్టిముకుందుని మనసుకరిగించుటకుఁ దీవ్రమగుభక్తికావలెయును. అట్టితేజఃశక్తియున్నవారికాతఁడు కడుసులభుఁడు కావున మనమందరమేకమై యాయిందిరాకాంతుని ధ్యానించుచుందము. అనిపలికి యాదంపతులు తమపుత్రికనుశ్రీహరికిఁ గాంతనుగాఁ జేయఁగోరి యితరులకియ్యనొల్లకుండిరి. అట్లుజననీజనకులు తనకనుకూలురగుటచే వేదవతి సంతసించి, అహర్దివమచ్యుతారాధన పరాయణయై, కాలమును గడుపుచుండెను.

ఇట్లుండఁ గుంతలదేశాధీశుఁడగు ననంతసేనుని పుత్త్రుఁడు సుధాముఁడు వేటకై యరణ్యమునకేగి, యట నాఖేటమున మృగయూథముల సంహరించుచుఁ గొంతవడికొక వనవరాహమునుగాంచి, దానిని సంహరింపనెంచి అశ్వారూఢుఁడై దానివైపేగెను ఆవిపినసూకరము, ఆతనిరాకనెఱింగి కడువేగముతోఁ బరిగిడి, సోమదేవుని తపోవనము చొచ్చెను దానిని వెంబడించి యా రాజకుమారుఁడు, తపోవనమునందుఁ బ్రవేశించి, యాయడవిపందికై తిరుగుచు అయ్యది తపోవనమగుటనుగుర్తించి, గుఱ్ఱమునుండిదిగి, వేగముగావచ్చుటచే డస్సియున్నతురగమునకుఁ నీరములనొసంగఁగోరి, ఆతపోవనముననున్న కాసారముకడకు వారువమ్మునుగొంపోయి, కొలనుగట్టెక్కి చూచుసరికి ఆకాసారనీరములో నొకనీరజాక్షి స్నానమాడుచుండుటను గాంచెను అతఁడాతటినీజలములపై శైవలలతాజాలములవలె వ్యాపించియున్న యాపెశిరోజముల

మధ్యమునఁ గ్రొత్తగా వికసించిన పద్మమువలె సౌందర్యశ్రీవిలసితమై వెలయుచున్న, యా కాంతామణి వదనమును గాంచి, విస్మితుఁడై యిట్లు వితర్కించెను.

సుధాముఁడు.—ఏమీ! మానవలోక కాసారముల నమరలోక మత్తకాసినులు వత్తురా! వారికిఁ గాంచనకమలసుందరములగు మందాకినీవారిపూరములు లేవా? ఆహా! నాకీ వనవగాహము అపూర్వతరుణీమణిని జూపి, నా నేత్రముల సఫలములనుగాఁ జేసినది. కట్టా! నేను దాని వధింపఁదలచితి. అయ్యది యీ నాకు దుర్లభానందమును సమకూర్చినది. ఆటవికసత్త్వములకును, తపోవనమృగములకును తారతమ్య మిద్దియే, అడవిజంతువులు పరుల బాధింపనెంచును. తపోవనసత్త్వములు ఇతరుల నానందింపఁ జేయఁగోరును.

అని తలంచుచుండ ఆ వారిజాక్షి వారిమధ్యమునుండి వెలికివచ్చి, నిజకుటీరమునకు వెడలిపోయెను, అంతనా సుధాముఁడు గుఱ్ఱమునకు నీటనిబెట్టి, ఆసరస్తీరతరుస్కంధమున దాని గట్టి, నిజచిత్తమత్తేభమును మరుఁడను మావటీఁడు మోహాంకుశమచేఁ బొడిచి మాఱుత్రోవకు ద్రిప్ప వేట మాటులమఱచి, యా యంచయానవెంట గుటీరవాకిటి కేగి యచటివటువులవలన, ఆకుటిలాలకవృత్తాంతమును దెలిసికొని, యిట్లు విచారింపఁ దొడంగెను. "ఆహా! నేనెట్టి దుర్లభవస్తు మోహమునఁ బడుచుంటిని! నామానసమీ మోహపాశములఁ ద్రెంపఁజాలకున్నయది, పాపములరానిమ్ము. ప్రాణములఁబోనిమ్ము, ఏమైనను సరే నేనీబింబాధరిని బరిగ్రహించితీరుదును. నేనీనీరజాక్షి నిగ్రహింపోవ ననువగుసమయము చిక్కువఱకు మునిపల్లెయందే యుందును. అని నిశ్చయించి, సోమదేవుని దర్శించి, యిట్లు పలికెను.

సుధాముఁడు:—మునిసార్వభౌమ నేను గుంతలసార్వభౌమనందనుఁడ, సుధామనాముఁడ. వేటకై యడవికివచ్చి, దారితప్పి యిటకు వచ్చితి. శాంతసుందరమగు నీతపోవనమున రెండుమూడునాళ్లుండఁ దలచితిని. అందుకుఁ దా మంగీకరింపఁ బ్రార్థింపుచున్నవాఁడ, సోమదేవుఁడా మాటల నిజమనినమ్మి ప్రత్యేకముగా నొకకుటీరమునొసంగి, యాదరించెను.

అమఱునాడు వేదవతి యరుణోదయమునకుఁ బూర్వమే లేచి స్నానార్థమై పర్ణశాలనుండి యొంటరిగాఁ గాసారమున కేగుచుండ సుధాముఁడు కాంచి, అదిమంచియదనని యెంచి, హఠాత్తుగా నాసతీమణిని బట్టికొని, గుఱ్ఱముపై నెక్కి యతివేగముగా నశ్వమునుబరుగెత్తించి, మున్నాశ్రమముదాటి వేఱొకయడవిలోని కేగి, దాహబాధకోర్వజాలక హాటాదాకర్షణముచే మూర్ఛితయైయున్న వేదవతితో దురగమునుండి దిగి, యాపెనొక శీతలతరుచ్ఛాయను బరుండఁబెట్టి, యాతరుశాఖకుఁ దట్టువమునుగట్టి, సమీపమునఁ గానవచ్చుచున్న పద్మాకరమునకు నీరములకొఱ్ఱల నేగుచుండెను.

ఇటులుండ వేటకాఁడొకఁడు లేడినిగొట్టఁ బొంచియుండి యాహరిణము గురికివచ్చినతోడనే వింటినుండి యలుగునువదలెను. కానియాకోల జింకకుఁదగులక, గురితప్పి మంచినీటికై పోవుచున్న సుధాముని హృదయమును దూసికొనిపోయెను. అశరాహతిచే "హా! చచ్చితి"అని బిగ్గఱగాఁ గేకవేసి యామోసగాఁడు నేలపైనొఱఁగెను.

అటఁబెట్టునీడనున్న వేదవతిదేహమునకుఁ గాసారజలశీకరశీతముగు పవనము సోకుటచే మూర్ఛతొలంగ మెల్లగలేచుసరికి ఆరాజకుమారజీవితావసానమును సూచించు నార్తనాదము చెవినిఁబడెను. వెంటనే కరుణాంతరంగయగు వేదవతి యటకుఁబఱిగిడి, సరస్త్రీరమున రక్తసిక్తముగుగాత్రముతో నేలఁబడియున్న రాజనందనునిఁజూచి హృదయము ద్రవింపఁ జైత్యోపచారములఁ దెలుపుటకొంగుచింపి, రక్తముపైకిరాకుండ, గాయముననిడి యిట్లుపలికెను.

వేదవతి:—కటకటా! సోదరుఁడా! ఎంతటిబాధనందుజుంటివి! అయ్యయ్యో! తమ్ముఁడా! ఈపాపపుతలంపు నీకుఁగలుకయుండినచో నిట్టి దుర్మరణమునకుఁ బాల్పడియుండవుకదా? ఆహా! ఎక్కడికుంతలదేశము ఎక్కడి నగరాజారణ్యము మృత్యువు నిన్నిటకు లాగికొనివచ్చినది. సోదరుఁడా! కుంతలసార్వభౌముఁడవై సౌధాంతరముల సుఖింపనేరక మాయుటజనమునకేలవచ్చితివి? వచ్చితివిపో! సచ్చిత్తముతోనుండక. యిట్లు కుటిలాశయుఁడవై సంచరింపనేల? పిచ్చివాఁడా! నీవొనర్చినది

యనసీతకృత్యమైనను నీదుర్భరదుఃఖవేదనావస్థనుజూడ నాగుండె యవియుచున్నది. ఈనిర్జనారణ్యమున నీకు వ్రణచికిత్సఁజేయువారు దొరకుటయెట్లు? కన్నులార నీమరణబాధను జూచుచు నేనెట్లూరకొనఁజాలుదును. అని తడియారిపోవుచున్న యాతనినోటిలోఁ బర్ణపుటముతోఁ గాసారతోయములఁ గొనితెచ్చిపోసి, దయామయుఁడగు దైవమునిట్లు ప్రార్థించెను.

వేదవతి :—ఓయాపద్బాంధవా: ఈదీనసోదరునిబాధను తొలగింపరమ్ము ఇటనీవుదక్క వేరెవ్వరు సంరక్షకులులేరు ఇట్టిసమయముల దయజూపుటయే నీయార్తత్రాణపరాయణతకు చిహ్నము. అనుచుండ ఆరాజనందనుఁడు పతివ్రతాశిరోమణియగు వేదవతిచేదత్తమైనపానీయము నోటఁబడుటచేతను ఆమెయొనర్చిన దేవతాప్రార్థనము చెవికిసోకుటచేతను కొంచము ప్రాణముచేరఁ గనులువిప్పి యాపతివ్రతావదనము చూచియిట్లుపలికెను.

సుధా:—అమ్మా:—సోమదేవనందినీ! నామృతికైవిచారింపకుము. సంతసింపుము తల్లిరో! నేనుజీవించియున్నఁ గామాంధుఁడనై యెందఱు సతీమణుల జీవితములమలినములుగాఁ జేయఁజాతునో యెందఱిని హతమొనర్తునో తెలియదు. కానమాయమ్మా! ఇంతటితో ఈనీచుఁడు మృతినొందుటయేమంచిది మాతరో! పరకాంతలు మాతృదేవతలని, తలంపక వారిఁజెరుపఁగోరు నాయట్టికుటిలాత్ముని నొక్కకోలతోఁ గూలనేసి పుణ్యముఁగట్టికొన్న యావేటకాఁడు నీకంటఁబడినచో నానమస్కారములఁదెలుపుము. మఱియు, నిఁకముందు నిరపరాధములగు మృగయూథముల వధింపక నాయట్టి జారవ్యాఘ్రములఁ గూలనేయుమని బోధింపుము. అమ్మా! ఈపాపాత్ముని తప్పులనుక్షమియించి దీవించి శలవొసంగుము. ఎముఁడు నారాకకెదురుచూచుచున్నవాఁడు. అనుచుఁ బ్రాణములవిడచెను.

“అత్యుత్కటపాపమునకు ఫలమువెంటనే కానవచ్చును. సతీలలామలపై మనసుగొలుపు తులువలు క్రిమికీటకాది జన్మపరంపరలనె

త్రుదారుగాని, ముక్తుల కాంజాలరు. ఈజారవ్యాపారమునందు మనుజులు పశువులకంటెను నికృష్టులుగాఁ గన్పట్టుచున్నారు."

సోమదేవుఁడు తపోవనమున వేదవతి కానరాకుండుటచేఁ గలవరపడి ప్రాజ్ఞులగుశిష్యుల నాపెనువెతుకఁబంపెను. వారతివేగముగ నరణ్యముల వెదకుచు వేదవతియున్న ప్రదేశమునకువచ్చి యాపెనుగాంచి యానందభరితులై "సోదరీ! వేదవతీ! ఇటకేలవచ్చితివి? ఈచచ్చిపడియున్నవాఁడెవఁడు?" అన నాసోమదేవపుత్త్రిక జరిగినయుదంతమును వారికెఱింగించి ఇంధనములఁదెప్పించి ఆయనాధసోదరదేహమున కగ్నిసంస్కారముచేయించి యచటికాసారమున స్నానమాచరించి మునికుమారులతోఁ దలిదండ్రులకడకేగెను.

మహిణిసోమదేవులు వేదవతినిగాంచి యెదురేగి గాఢాలింగనమొనర్చి "అమ్మా! ఎటకేగితివి?" అననాపె వారికి నడచినకథను వివరించెను ఆమాటలవిన్నతోడనే సోమదేవుఁడు కుపితుఁడై తనతనయనవమానించిన సుధాముఁడు క్రూరరాక్షసజన్మ మెత్తునుగాకయని శపించెను ఆశాపమును వేదవతివిని తండ్రిపాదములపైఁబడి "ఓ! దయానిధీ! ఆదీనసోదరుఁడు తాఁజేసిన దుష్కార్యమునకుఁ దీవ్రముగావిలపించుచు పశ్చాత్తప్తుఁడై శ్రీహరినిధ్యానించుచుఁ బ్రాణములవిడచెను. పాపమాజీవికి రక్కసిపుట్టువు రాకుండవారింపుడు.

సోమదే:—అమ్మా! వేదవతీ! నాశాపమనివార్యము కాని వాఁడు నీవొసంగిన జలములపానముచేయుటచే రాఁబోవు రాత్రించరజన్మమున వనమాలిచే నలుఁగుతోఁగొట్టఁబడి ముక్తినొందగలఁడు అనిపలికెను.

అటుపైని కొంతకాలమునకు దంభుఁడను దనుజరాజు వేదవతిని పెండ్లాడఁగోరి రాక్షసరూపమునుమార్చి దివ్యసుందరమగు యక్షరూపమునుదాల్చి సోమదేవునికడకువచ్చి వేదవతిని దనకిమ్మని కోరనాతఁడు "నాపుత్త్రికను శ్రీహరికిఁదప్ప వేఱెవ్వరికి నియ్య"నని తెలిపెను. అందుచే నానిశాచరుఁడు మొదటఁగామము పిమ్మటఁగ్రోధము నిజమానసమునఁ బెనఁగొన రాత్రివేళ నిదురించుచున్న సోమదేవునిజంపి పారిపోయెను.

తెల్లవారినతోడనే రోహిణి యెంతసేపటికిని భక్తపర్ణకుటీరము నుండి పైకిరాకుండుటచేఁ గుటీరములోనికేగి మృతుఁడైయున్న పతిని జూచి దుఃఖించి వెంటనే యగ్నినిప్రజ్వలింపఁజేసి వేదవతినిపిలిచి "పుత్త్రి! కంటివా నీజనకునిమరణమును బిడ్డా! నిన్నుఁబరిణయమాడఁగోరి యిటకువచ్చిన ఆయాతుకుమారుఁడీదారుణ కృత్యమును జేసియున్నాడు. అమ్మా! పతివ్రతలకు సహజమగు సహగమనమును చేయఁబోవుచున్న దానను. కాని నందినీ నిన్నానందముతోఁ బురుషోత్తమునకుఁ గన్యాదానమొసగు భాగ్యము మాదంపతులకు సమకూరదాయె అజనార్ధనుని కృపచే రాబోవుజన్మమునందైన నట్టిసంపద సమకూరుగావుత అమ్మా! నీవుమాత్రమై బెంగటిల్లక గోవిందపదనీరజధ్యానాసక్తచిత్తవై కాలమును జక్కఁగాఁగడపుచుండుము ఆకృపాసాగరుఁడు నీమనోరథమీడేర్పఁగలఁడు. అని తెలిపి పతిదేహముతోఁ జితిఁజొచ్చి, పతిలోకమున కేగెను.

అంత వేదపతి నంతచెంది తనమూలమున నకాలమృత్యుప్రాప్తులైన తలిదండ్రులకై విచారించుచుఁ బ్రాజ్ఞురాలగుట నిట్లుతలంచెను. "పితృవిహీననై యొంటరిగా జీవించుట దుర్భరదుఃఖావమానముల నందుటకే యగునుకాని విశ్రాంతిగా శ్రీహరిని ధ్యానింప వలనుకాదు. దుర్బలమానసులు నారూపమునుజూచి మోహపరవశులై నన్నెట్టియవమానముల పాలుసేతురో యెన్ని ఘోరకృత్యముల నాచరింతురో కావున నేను ముకుందునిధ్యానించుచు జీవితమును జాలించుట యొంతయు సమంజసము. అనినశ్చయించుకొని భగవంతునిట్లుస్తుతించెను.

వేదవతి:—ఓ! యాత్రశరణ్యా! నేనునీకు నిజమగుదాసురాల! నేని నాచరితము నిష్కళంకమేని ఓ! భక్తపాలనశీలీ! వనమాలీ! నన్ను ముందుజన్మమునఁ బరమపావనచరితులగు రోహిణీసోమదేవులకుఁ గుమరితనుగాఁ బుట్టింపుము. మఱియు నోభక్తజనమానసకువలయసోమా పావననామా! నన్ను భావిజన్మమున నిన్నుచేపట్టు భాగ్యశాలినినిగాఁ జేయఁగటాక్షింపుము. అని గోవిందుని ధ్యానించుచు యోగాగ్ని యందుఁ దనువునువేల్చి సత్యలోకమున కేగెను.

ఆరోహిణీసోమదేవులు అనంతరభవమున సుమేధాజనకులుగాఁ బుట్టిరి. వేదవతి యాత్మకుఁ గమలభవుఁడు లావణ్యరాశియగు శిశురూపమును గల్పించి యొకసువర్ణకరండమునఁ బరుండఁబెట్టి యాకరవాటము నారదునిచే వైకుంఠవాసియగు శ్రీపతికడకుఁబంపెను. ఖగరాజవాహనుఁడా పుత్తడిబరణి నందుకొని యందు శయనించియున్న బాలికామణి లావణ్యకాంతి కానందించి ఆకాంచనకరండమును వినతానందనునకిచ్చి విదేహరాజయాగభూమిపడి రమ్మని యాజ్ఞాపించెను. పక్షిఱేఁడా కరండమును గొంపోయి జనకసవనస్థలి నొకయూపగర్తమునవిడి వెడలిపోయెను ఆరంధ్రము క్రమముగా మట్టిచేఁగప్పబడి నాకరండముకానరాకుండెను

అంతఁగొంతకాలమునకు జనకరాజేంద్రుఁడు సంతానకాంక్షియై సవనము సేయనెంచి స్వయముగా నాగలిచేబూని యజ్ఞభూమిని దున్నుచుండ నాగలియలుగునకు నొకకరండము తగిలిపగుల నందొకదివ్యమంగళరూపయగు బాలిక కానవచ్చెను జనకుఁడా బాలికనుజూచి యమందానందముతో నామందసమునుండి యాబిడ్డను పైకిఁదీసి ముద్దాడి సీతయనిపేరిడి తనభార్యయగు సుమేధకునొసంగ నాసాధ్వి యాబిడ్డనుచూచినతోడనే స్తన్యముద్భవింప నాపెనుకేకొని పరమామోదముతోఁ బెంచికొనఁదొడఁగెను. జనకరాజేంద్రుఁడు తాఁదలపెట్టిన యాగమునుముగించినతోడనే సుమేధకొక సుతుఁడుదయించెను. జనకుఁడానందనునకు ఆనందుఁడని పేరుపెట్టెను. అటుపిమ్మటఁ గొంతకాలమునకు నాదంపతులకు ఊర్మిళయను పుత్రికకలిగెను. ఇటులజనకుఁడు సంతానవంతుఁడై సంతోషముతోఁ గాలముగడుపుచుండెను.

ఒకనాడు తనయింటనున్న శివశరాసనమును సీతయిటునటు జరుపుచుండఁగనుగొని, యామెశక్తి వింతఁజెంది; హరశరాసనమునకు నెవఁడు నారినిసమకూర్చునో యట్టివానికి సీతనిచ్చి, వివాహమొనర్తునని ప్రతినచేసి స్వయంవరమును ప్రచురించెను.

ఆస్వయంవరవార్త చెవినిఁబడినతోడనే సుగుణాలవాలయగు సీతను బాణిగ్రహణమొనర్ప సకలధరాధీశులును మిథిలకేతెంచి, శివ

కార్ముకమును జూచి వెడలిపోవుచుండిరి. ఇట్లుకొంతకాలము జరుగఁ ద్రిగర్తదేశాధిపతియగు సుధన్వుఁడు మిథిలకువచ్చి, తనకు సీతనొసంగుమని జనకునినడుగ, నాతఁడు మహేశ్వరచాపమెత్తినఁగాని సీతనుబరిగ్రహింప వలనుకాదని తెలిపెను. అందుపైసుధన్వుఁడు కుపితుఁడై యుద్ధసన్నద్ధుఁడుకాఁగా జనకుఁడు వానినిరిర్జించి, త్రిగర్తరాజధానియగు సాంకాశ్యమునఁ దనసోదరుఁడగు కుశధ్వజుని నభిషిక్తునిగాఁజేసెను. అదిమొదలు కుశధ్వజుఁడు సాంకాశ్యమున సకుటుంబముగా నివసింపఁదొడఁగెను.

ఇపుడా జనకనృపాలుఁడు తానేర్పాటుచేసిన శపథప్రకారము మాహేశకోదండమునెక్కుడి, సీతను బరిగ్రహించువాఁడు కానరాకుండుటచే ధరణిజాపరిణయము నిర్విఘ్నముగా సమకూరుటకు సకలదేవతాసంతసావహమగు నొకక్రతువును జరిపించుచున్నవాఁడు. మమ్మాక్రతువునకు రాఁబిలిచినాఁడు. అందుచే మీసోదరుల వెంటనిడికొని, మేము జనకయాగమునకు బయలువెడలితిమి. లక్ష్మణా! సీత యయోనిజాతయగుట తెలిసెనా? అనిపలుకుచు విశ్వామిత్రుఁడు జనకుని యజ్ఞవాటిక సమీపించెను. తోడనే విదేహనృపాలుఁడు శతానందుని ముందిడికొని విశ్వామిత్రాదులకెదురేగి అర్ఘ్యపాద్యాదులచేఁ బూజించి, వారిని యాగశాలలోనికిఁ దోడ్కొనివచ్చి, ఉచితాసనాసీనులనుగాఁజేసి కౌశికునిగూర్చి యిట్లుపలికెను.

జనకుఁడు:—కౌశికమునీంద్రా! మీరాకచే ధన్యుఁడనైతిని. మిముఁజూచినతోడనే, పేదకుఁబెన్నిధిదొరకినట్లు, గ్రుడ్డివానికిచూపులు చేకూరినట్లు నాహృదయమానందపారవశ్యము నందుచున్నయది. గాధినందనా! సుమశర సమానసుందరరూపములతో, వీరశాంతరస సమ్మిళనస్థానములట్లు చూపట్టు హృదయముల వాకర్షించుచుఁ, జేతుల ధనుర్బాణములతోడను, మూపులఁదూణీరములతోడను, చూపుల గాంభీర్యములతోడను, వదనముల మందహాసములతోడను, గూడి, ముద్దులు మూటగట్టుచున్న యొద్దికలో విరాజిల్లు ఈబాలవీరకుమారు లెవ్వరో? వివరముగాఁదెల్పి, నన్నానందింపఁ జేయఁగోరుచున్నాను. మునివరా!

చంద్రోదయముచే నంధకారము చెదరిపోవునట్లు వీరియవలోకనముచే నాహృదయపరితాపము సడలిపోవుచున్నది.

విశ్వామి:—జనకరాజేంద్రా! వీరలు కోసలసార్వభౌముఁడగు దశరథరాజేంద్రనందనులు, రామలక్ష్మణాభిధానులు నాయాగవిఘ్నకారులగు మారీచసుబాహుల హతమొనరించి నాజన్మమును గాపాడుటకై దశరథనృపాలుని యాచించి, వీరలఁగొని తెచ్చితిని. ఈకుమారసింహులు రాక్షసమొత్తముల సంహరించి నాచే నవభృథస్నానము చేయించిరి. అంత నేనీయాహ్వానముపై వీరిని నావెంటనిడికొని ఇటకు వచ్చితిని.

జనకరాజేంద్రా! మేము నిన్నటికే ఇచటికిరా నిశ్చయించితిమి. కాని మార్గమధ్యమున ఈనీలేందీవర శ్యామసుందరుఁడగు రాముని పద సరసిజపరాగస్పర్శచే గౌతమధర్మదారయగు నహల్య శిలారూపమును వదలి రుచిరకాంతారూపయై ఈరాకాశశాంకవదనుసిజూచి సంతుష్టాంతరంగయై రామునినుతించి మాకాతిథ్యమొసగ నటనాపూట నాపుటచే నిటకురాఁజాలమైతిమి. అని తెలిపినతోడనే అహల్యానందనుఁడగు శతానందుఁడు నిజజననీశాపవిమోచనమును విని, సహాసానందుఁడై గాధేయునితో నిట్లుపలికెను.

శతానందుఁడు:—కౌశికమునీంద్రా! సుధాతిమధురమగు నెంతటి పావనసువార్తను దెలిపితివి! శిలారూపయై పడియున్న తపస్వినియగు నాజననిని రామునకుఁజూపితివా? నిర్దోషిణియగు మాయమ్మవిషయమై కుటిలుఁడగు నాదేవేంద్రుఁడొనర్చిన యపరాధతత్వమును ఈపావననామునకు బోధించితివా? మాతండ్రి గౌతమమునీంద్రుఁడు మాతల్లిని ప్రేమగౌరవములతోఁ బరిగ్రహించెనా? సంయమివరేణ్యా! మంగళావహమగు మీరాకచే ముందునేనును, ఇకముందు జనకుడును బొందినట్టియుఁ, బొందఁబోవునట్టియు నానందమునకు మేరయుండనేరదు.

బ్రహ్మర్షిసత్తమా! నిజమారయ నీవీనాపాచంద్రుని నీయాగరక్షణమునకుఁ గొనిరాలేదు. పతివ్రతల గౌరవసంరక్షణమునకుఁ దోడ్కొని వచ్చితివి. ఇదిసత్యము. అట్లుకాకున్నఁ జాప శాపప్రయోగ

సంపన్నుఁడవగు నీకు నిశాచరభయమేమి? నీయనుగ్రహముచే నేనిప్పు డహల్యానందనుఁడనని, యెలుగెత్తి పలుకుదును. అని రాముని వైపు నకుఁ దిరిగి "రామచంద్రా! రామచంద్రా! నిన్నొకసారిగాఢాలింగనము చేసికొనుట కనుమతింపుము. నీపావనదేహస్పర్శచే నాదురితౌఘములు దూలిపోవును.

ఓనరరూపధారీ! వైకుంఠవిహారీ! నేను నీపదపద్మములకు మ్రొక్కవలయునో! లేక నీపదసరసిజపరాగములకు నమస్కరింపవలయునో! తెలియకున్నయది. ఓవనరుహనయనా! కౌసల్యానందనా! నారాయణ పదకమలస్పర్శచే గంగావాహిని పావనజీవనయైనది. నీచరణసరసీరుహ పరాగసంపర్కముచే గౌతమగేహిని పూతజీవితయైనది. అందుచే నీపద నలినరేణువులే మాగౌతమగోత్రమునకు పాస్యదైవతములు కాఁగలవు.

రాముఁడు:—అహల్యానందనా! సాధ్వీమణుల పావనగర్భకోశముచేఁ బెరిగిన సంతానములకుఁ గలుషములును, పవిత్రస్త్రీకుక్షిపుటమున నెదిగిన మౌక్తికములకు మలికలును, కలుగనేరవు. తపోధనా! నీజనయిత్రియగు యహల్యాదేవి కులరూపగుణశీలములచే నద్వితీయ. ఇందుకు సందియములేదు. నిజమారయ నహల్య తనతపశ్శక్తిచేఁ బవిత్రగాత్రియైనది కాని నాపాదపరాగముచే కాదు. సాధ్వీమణుల జీవితము లను, భాగీరథీజీవనములను, పావనములనుగాఁ జేయఁజాలు పదార్థము లీసృష్టిలో లేవు. వాని సందర్శనముచే నితరవస్తువులు పావనములగును. నేనాసాధ్విని సందర్శించుటచే ధన్యుఁడనైతిని.

విశ్వామి:—అహల్యానందనా! మీయమ్మను మీయయ్యఘన గౌరవముతోఁ జేకొనినాఁడు. ఆదంపతులు మమ్మెల్లర గౌరవించినారు లోకులు నిజముగా జరిగినదెద్దియో తెలిసికొనకయే, యన్యాయముగా నపవాదములఁ బుట్టింతురు. ఇది లోకస్వభావము. దానికై విచారింప బనిలేదు. శతానందుఁడామాటలువిని ఆనందపరవశుఁడై రామునిగూర్చి యిట్లు పలికెను.

శతాన:—రామచంద్రా! బ్రహ్మర్షిసత్తముఁడగు నీకౌశికమునీంద్రుఁడు నిరుపమానాద్భుత చరితుఁడు. కౌసల్యానందనా! పూర్వము

మీయునవంశజుఁడగు భగీరథుఁడెట్లు దుర్ఘటకార్యమగు గంగావతరణ మును సాధించి కీర్తినిగడించెనో యటులనే కార్యశూరుఁడగు నీగాధే యుఁడును దుర్లభమగు బ్రహ్మర్షిత్వమును సంపాదించి వాసిగాంచెను. అందుచే సూర్యవంశమునకా భగీరథచక్రవర్తియుఁ, జంద్రవంశమునకీ విశ్వామిత్రచక్రవర్తియు, మేటికిరీటములై వెలయుచున్నవారు. ఈగా ధేయుని గాథాసారమగాధము. సకలలోకప్రసిద్ధము. అనిపలికి శతా నందుఁడు రామలక్ష్మణుల గాఢముగాఁగౌగిలించి దీవించెను.

జనకుఁడునుఁ దనయాగమును నిర్విఘ్నముగసాగించి తనమనో రథమును సమకూర్ప విశ్వామిత్రునిఁబ్రార్థించి వారికిఁదగిన విడుదుల నేర్పరచి అందు వారిని విశ్రమింపఁజేసి విశ్వామిత్రునికడ సెలవుగైకొని శతానందునితో వెడలిపోయెను.

విశ్వామిత్రుఁడు రామునితో ఇట్లుపలికెను. "దశరథనందనా! నీవీశరధ్వజుని యింటనున్న వృషధ్వజునివింటిని చేఁబట్టితివా? మొదట నసదృశకీర్తికాంతాకరమును, పిమ్మట నిరుపమాన ధర్మపత్నీపాణిపల్ల వమును చేపట్టఁగలవు. రామచంద్రా! ఇట్లొనర్చుట నీకభిమతమా?

రాముఁడు:—గురువరా! మీసేవలోనున్నంతకాలము మీరే పనివిధింతురో దానినినెరవేర్చుటయే నాకువిధి. ఇదివఱకు రక్కసులఁ గొట్టుటలోఁగాని ఇపుడు పురారిశరాసనమును చేఁబట్టుటలోఁగాని ఇక ముందు విధింపుకార్యమును సాధించుటలోఁగాని మీయాజ్ఞయే ప్రమా ణము. కావున నాయిష్టమునడుగఁబనిలేదు. మీకిష్టమున్న పనులనెల్ల చేయింపుడు.

విశ్వామి:—నిగర్వచూడామణీ! వినయోక్తులు మీదినమణికు లకుమారులసొత్తులు కౌసల్యానందనా! నిజముగానిన్నిటకు నేఁగొనితె చ్చిన ముఖ్యోద్దేశము నీచేహరచాపమెత్తించి, జనకాత్మజను చేఁబట్టిం చుటయే కావుననే "శర్వశరాసనమార్వీసంధానోత్సవము నేర్పాటుచే యింపుమని, శతానందునికిదివఱకే వార్తనంపియుంటిని, అనిరామునితో మాటలాడుచుండ సీతచెలికత్తెయగు వాసంతి మార్గవశమున నటకువచ్చి రామలక్ష్మణుల నవలోకించి ఇట్లుచింతింపఁనొడంగెను.

## —: షడ్వింశత్యధ్యాయము :—

### చిత్రలేఖనము.

"నేనిదివఱకెందరినో రాజసూనులను, మఱెందరినో కుమారనందనులను, జూచియుంటిని కానివారియందెవ్వరును నింతటిసుందరాంగులు కానరారైరి. కోదండమండితములగు నాజానుబాహుదండములతోడను సువిశాలోరస్థలమండలములతోడను, పుండరీకదళాయతనేత్రములతోడను మందహాససుందరములగు వదనారవిందములతోడను ఈకుమారవీరులు తేజరిల్లుచున్నవారు ఇట్టిసుందరాంగులఁ జేఁబట్టు భాగ్యమునుగన్న కన్యకామణులెవ్వరై యుందురో ?" అని ముందరికిఁ జూచి "అడుగో ! అంతఃపురసంచారియగు కంచుకియిటువచ్చుచున్నవాఁడు. ఈతనికి దెలియని విషయములుండవు కావున నీతనినడిగి పరిస్థితిగతుల దెలిసికొందును. ఈకంచుకినడకచూడ నేదియోసంతోషవార్తనేరికో తెలుప నేగుచున్నట్లు కన్పట్టుచున్నది." అని కంచుకినిగలిసికొని యిట్లుప్రశ్నించెను.

వాసంతి:—ఆర్యా ! వాతాయనా ! వందనము. మీరీనాఁడు వార్ధకలక్షణములు లేక పిన్నవయసువారివలె నేగుచున్నవారు. వదనమున మందహాసచంద్రికను, నడకల నిష్కంపపదవిన్యాసములను జూడమీరేదియో శ్రోత్రపేయమగు నపూర్వసంతోషామృతాస్వాదన మొనర్చి, తృప్తులైనట్లు తెలియవచ్చుచున్నవారు. బంధువత్సలా! మీసంతసహేతువేమి? నేవినఁదగునా?

వాతాయనుఁడు:—వత్సా! వాసంతీ! బాగుగగుర్తించితివి. వినుము నేనునేనొక్కరుఁడనేకాదు త్రిలోకములును సంతోషింపఁదగిన సువార్తనువింటిని. దానిచే నానందపరవశుఁడనై నాముసలితనమును ముందునకుగెంటియుంటిని.

వాసంతి:—ఆర్యా!ఆసకలలోకమంగళావహమగుసువార్తయేమి?

వాతా:—శుభాంగీ ! ఇక్ష్వాకుసార్వభౌమనందనుఁడు చంద్రశేఖరశరాసనమునకు నారినిసమకూర్చి నిజాసమానవిక్రమసంపదను బ్రకటింపఁబోవుచున్నవాఁడు.

వాసంతి:— అట్టిజెట్టి పుడమినిబుట్టియున్నాడా! ఆశూరశిఖామణి పేరేమి ? అతఁడెపుడీతావునకువచ్చును ?

వాతి:— పుత్రీ! ఆపన్నార్తిహారియగుశౌరి కోసలసార్వభౌముడఁగు దశరథునకు రాముఁడనుపేరఁ బట్టిగాఁబుట్టియున్నవాఁడు ఆరాముఁడే రేపు పురారిశరాసనమును సంధింపఁబోవుచున్నవాఁడు ఇపుడాతఁడు కౌసికమునీంద్రునికడ నున్నవాఁడు

వాసంతి:— అటులనా! నిజముగానిది సకలప్రాణి సంతోసావహమగు సువార్తయే సందేహములేదు. వాతాయనా! నీకీయుదంత మెట్లుతెలిసె ?

వాతి:— నిన్నటిరేయి అహల్యానందనుఁడగు శతానందుఁడు తన తల్లిశాపమును విమోచనమొనర్చిన రామునిగూర్చి ప్రశంసించుచుండ కార్యవశమున నేనాతనియొద్దకేగ, ఆమహాశయుఁడు శ్రీరామోదంతమును నాకెఱింగించెను.

వాసంతి:— వాతాయనా! నేనిప్పుడు కౌశికమునిచంద్రుని కిరుపార్శ్వముల నీలోత్పలసుమదళమువలె నొకడును, తెల్లకలువ పూరేకువలె వేఱొకఁడును తేజరిల్లుచుండుటను జూచితిని. వారలెవ్వరో తెలియరాకుండుటచే నిన్నడుగవచ్చితి.

వాతి:— వారే దశరథనందనులు ఆనీలోత్పల దళశ్యామసుందరుఁడు రాముఁడు. ఆతెల్లకలువరేకువన్నెవాఁడు లక్ష్మణుఁడు. రేపు రాముఁడు శివశరాసనమెత్తుట కేర్పాటుచేసి, ఆసంగతిని కౌశికునకుఁ దెలియఁజేసి రమ్మని, శతానందుఁడు నాకాజ్ఞాపించుటచే విశ్వామిత్రునికడ కేగుచున్నాఁడను. నీవిక్కడికేలవచ్చితివి?

వాసంతి:— మనపట్టపురాణి సుమేధాదేవి నన్ను గౌరీసహస్రనామార్చనమునకు నల్లకలువలఁ దీసికొనిరమ్మని ఆజ్ఞాపించినది. వానికై నేతెల్లవారకముందే కుసుమోద్యానములోని కాసారమునకేగి ఇందీవరములఁగోసి తీసికొనివచ్చుచు దశరథనందనుల సౌందర్యాతిశయముఁలఁ గాంచి విస్మితచిత్తనై ఇటనిలిచితిని. ఇంతలో మీరేతెంచితిరి.

వాతి:— అగును. అభీష్టపరిహారార్థము సుమేధ సీతచే గౌరీ

పూజచేయింప నిశ్చయించినదని వింటిని. వాసంతీ! పూజాకాలమతిక్రమింపకుండ నీవంతఃపురమునకుఁ బొమ్ము. నేనును విశ్వామిత్రునిసందర్శించి ధనురుద్ధగణవార్తను దెలిపి, రాణివాసమునకు వత్తును. అని వెడలిపోయెను. వాసంతియు సీతామందిరమునకుఁ జనెను.

అట సీత తెల్లవారకమున్నె పాన్పునుండిలేచి తనమందిరమున నొంటరిగాఁగూర్చుండి యిట్లు వితర్కింపఁదొడఁగెను. "ఆహా! నేనెంతటి స్వప్నముఁగంటిని! నాజీవితములో నేనింతవఱకుఁ గలగనియెఱుంగ. గతరాత్రి నిద్రలో సాక్షాత్కరించిన సుందరాంగుఁడు అశ్రుతాదృష్టపూర్వుఁడు ఈలావణ్యసుధానిధి కల్లమానసియో లేక సత్యరూపుఁడో తెలియరాదు కాని యపుడే నామానససరోవరమున సంకల్పకల్హారకోరకములు వికసింపఁదొడంగుచున్నవి.

స్వప్నావలోకితములగు ననిశ్చితరూపములే యింతటి హృదయోన్మాద హేతువులగునపుడు ప్రత్యక్షదృష్టములగు సద్రూపములు ఎంతగా జిత్తోన్మత్తతాహేతుకములగునోకదా! ఆయిందుసుందరవదనుని రూపము కనుమూసిన హృదాకాశమునందును కనుదెఱచిన బహిరాకాశమునందును గానవచ్చుచున్నది. నాకేమిచేయుటకును తోఁచుటలేదు. నాసోదరి ఊర్మిళ ఇంకనునిటకు రాలేదు కావున చిత్తవినోదార్థము నేఁగలలోఁగాంచిన మోహనరూపమును బటముపై స్ఫుటముగాజిత్రించి కనులారఁగాంచి యానందింతును. అని తలంచుచుండ మైత్రియనుదాసి యాపెకడకు వచ్చెను. సీత దానినిజూచి యిట్లుపలికెను.

సీత:—మైత్రీ! చిత్రఫలకమును వర్ణకరాటమును తూలికాపేటికను గొనితెచ్చి తలుపుదగ్గరగవేసి ద్వారముకడనుండుము. నాకుతెలుపనిదే లోనికెవరిని రానీయవలదు. అన మైత్రి యామెతెలిపినట్లొనర్చెను. అంతఁగొంతసేపటికి ఊర్మిళ సీతామందిరమునకువచ్చి మైత్రితో నిట్లు పలికెను

ఊర్మిళ:—మైత్రీ! మాయక్క సీత నిద్రనుండి లేచెనా?

మైత్రి:—అమ్మా! మీసోదరి సూర్యోదయముకాకమున్నే మేల్కని యంతఃపురాంతరమునఁ గూర్చుండి యంతరంగమున నేమేమో

ధ్యానించుచుండెను. ఆసమయమున నేనామెను సమీపింప నావైపుజూచి "చిత్రలేఖనోపకరణముల గొనిరమ్మని" తెలిపెను. వానినిగొనితెచ్చి నేనం దీయఁజేకొని నన్నిటఁగావలియుండి లోనికెవ్వరిని రానీయకుమని యాజ్ఞాపించినది. అందుచే నేనిటఁగూర్చుండియుంటిని.

ఊర్మిళ:—అట్లైన నన్ను లోనికిఁబోనిత్తువా? లేక నాపుదువా?

మైత్రి:—అమ్మా రాజపుత్రీ! మిమ్ము నిరోధింప నేనెంతటిదానను. మీయిష్టానుసారముచేయుడు. అదియుఁగాక మీయక్కసెల్లెండ్రిరువురు నొక్కమనసువారు. మీచెవినిబడని రహస్యమామెనోట నేదియునుండనేరదు.

ఊర్మిళ:— చేటీ! నిజమే. మాహృదయముల నొకరికొకరము తెలుపుకొనకున్నఁ బరితాపమొందుదముగాని తెలిసి పరిహాసించుకొనువారలముకాము.

మైత్రి:—ఇది లోకవిదితమే కాని యమ్మా! అధరణిజకు నాపైఁ గోపమురాకుండఁజేయుభారము మీపైనున్నయది.

ఊర్మిళ:—మైత్రీ! నీవున్నచోటఁ గోపమునకవకాశముండదు. భయపడకుము. అని మెల్లగాఁ పదపల్లవముల మణిమయకుట్టిములపై నిడుచు సీతయున్నగదిలోనికేగి యామెకు వెనుకభాగమున నిశ్శబ్దముగా నిలచి పటముపైఁజిత్రితమైయున్న రూపమునుజూచి తనలో "మాయక్కకుసుమశరుని వ్రాసినదేమొకో? ఇదివసంతసమయమగుట మనసిజు నర్చింప నెంచెఁగాఁబోలు. తిరుగఁబరికించి ఇది చెఱకువిలుకానిబొమ్మయగుచోఁ జేతనిక్షుదండముండవలయును కాని, వేణుకోదండమెట్లుండును! మఱియు రెప్పపాటుగలుగని చూపులుండవలయునుగాని నిమేషలసితములగు వాల్గన్నులుసరిపడునా? పోనిమ్ము, ఈసాధ్వితాను నిత్యమర్చించు విష్ణురూపమందుమా? దేహకాంతిసరిపోయియున్నను చతుర్భుజములుండవలదా? గిరిజావల్లభుఁడందుమా? సర్పాభరణములుకానరావు. నీరజాసనుఁడందుమా? నలుమొగములుచూపట్టవు ఇదేదియో మాయక్కయొక్క మానసికసృష్టియైయుండనోపు. ఆమె యాచిత్రపటమును రెప్పపడకుండఁ జూచుటనుబట్టి ఈసుందరాకారముపై నీమె

తనజ్ఞానేంద్రియములనన్నిటిని ముద్దగాచేసి యంటించినట్లు తోచుచున్నది." అనితలంచుచుండ సీత యాచిత్రితాప్రతివిగ్రహమునకు నమస్కరించి యాపటమును శిరమునఁబెట్టికొనఁ బైకెత్త ఊర్మిళకట్టినపుట్టమునకు ఆపటపుచట్టముఁ దగిలెను. అంతసీత పటమును బయ్యెటచేఁగప్పి వెనుకకుఁదిరిగిచూచెను. అప్పుడు ఊర్మిళ పక్కునవవ్వి యిట్లుపలికెను.

ఊర్మిళ:— అక్కా! ఈవరపురుషుఁడెవ్వఁడు? వీనికేల మ్రొక్కులిడుచుంటివి? ఇట్టివాఁడీలోకమునందెవ్వఁడైనఁగలఁడా? లేక నీభావములకభిమతమగు సుందరరూపమునుజిత్రించి యానందించుచుంటివా? నీవయోనిజవగుటచే నీమనోహరుఁడుగూడ నట్టివాఁడుగానే యుండఁగోరితివా? అటుగాకున్న భూవలయమున నింతటివరమోహనాంగులుందురా!

సీత:— సోదరీ! నేను మైత్రితోఁ బరులలోనికి రానీయకుమని తెలిపియుంటిని అదిద్వారముగాకడలేదా?

ఊర్మిళ:— ప్రియసోదరీ! నన్నుఁ బరులలోఁ జేర్చితివా?

సీత:— నాముద్దుచెల్లెలా! నేఁబరలోకమునకేగువఱకు నీవునాయాత్మరూపవేకాని పరురాలవుకానేరవు. పరశబ్దమునకర్థము ఆత్మకంటె వేఱైనవారని నాయభిప్రాయము.

ఊర్మిళ:— అక్కా! నీచేవ్రాయఁబడిన ఈశ్రీమంతుఁడెవ్వఁడు? ఇదివఱకు మనమిట్టియుందగానినిఁగూర్చి వినియుండలేదే! అసద్రూపములు నిన్నాదింపజేయఁజాలవుకదా? కావునఁగలనిజమెఱిఁగింపుము.

సీత:— సోదరీ! నిన్నరాతిరినిదురలో నేనొక కలగంటిని ఆస్వప్నములో నేనిపుడుపటముపై వ్రాసిన సుందరాంగుఁడు ప్రత్యక్షమై నాపైఁదనయనురాగావలోకనములఁ బఱపుచుఁగొంతసేపునిలచి, అదృశ్యుఁడాయెను. అంతనేమేల్కొని నలువైపులఁ గలయఁబరికించితిని. కాని నాకెవ్వరును గానరారైరి అటుపిమ్మట నాకుఁదిరుగ నిదురపట్టలేదు. అందుచేఁ గాలక్షేపమునకై కలలోఁగన్నరూపమును పటముపైఁ జిత్రించితిని ఆచిత్రితరూపము నాచిత్తమునుహరింప నానందపరవశనై మ్రొక్కులిడి ముద్దిడఁ బైకెత్తుచుండ నీవువచ్చితివి. ఇదినిజము. నాచేతల నీవునవ్వినను సరే! నమ్మినను సరే!

ఊర్మిళ:—విజ్ఞానవతీ! నీవుకలలోఁగన్నరూపము కల్లయెంతమాత్రమును కానేరదు నీయట్టిసతీమణుల హృదయములు పరపురుషులఁ గలలలోఁగూడఁ గాంచఁగోరవు. నీవు స్వప్నమునఁగాంచిన నృపకుమారవరాళి భూతలమున నెక్కడనో యవతరించియున్నవాఁడు. ఆపురుషవరేణ్యుఁడు నీకరతలమును బట్టనున్నవాఁడు గతస్వప్నమాకళ్యాణరూపమును నీమానసఫలకముపై జిత్రించినయది. ఇందుకుసందేహములేదు.

సీత:—వెఱ్ఱిదానా! ప్రత్యక్షరూపులగు రాజకుమారవీరులు హరచాపోద్ధరణమునకు జాలకుండ స్వప్నదృష్టపురుషుఁడు శివశరాసనమునెత్తుటయెట్లు? నామనోరథమీడేరుటయెట్లు? ఇట్లాసోదరీమణులు ప్రశంసించుచుండ వాసంతియటకువచ్చి నల్లకలువపూలసజ్జ వారియెదుటనుంచి నిలచెను. సీత వాసంతినిజూచి ఇట్లుపలికెను.

సీత:—చెలీ! వాసంతీ! పూవులఁదెచ్చుటకింత జాగేలచేసితివి?

వాసంతి:—శోభనాంగీ! నీకొకమనోహరసందేశఫలమునందిచ్చుటకు

సీత:—సఖీ! నాప్రశ్నకు నీయుత్తరమంతగాసరిపడలేదు. అయినను నీవుతెలుపు సువార్తయేమి?

వాసంతి:—భూపుత్రీ! ఇదివఱకు సరిపడకున్నను ఇపుడుసరిపోవునులే.

ఊర్మిళ:—వాసంతీ! శుభవార్తలఁదెలుపుట కాలస్యముచేయురాదు, కావున వేగముగా నాసువార్తను వివరింపుము.

వాసంతి:—క్షుధార్తుల నిరోధింపవచ్చును. పిపాసాపీడితుల నిలుపవచ్చును. కాని వరనామశ్రవణాసక్తుల నాపశక్యముకాదు. కావునవినుఁడు వివరింతును. నేనీకువలయములఁజేకొని వచ్చుచుండ కుశకాత్మజునిచెంత నీలోత్పలవర్ణుఁడొకఁడును, తెల్లకలువచాయవాఁడొకఁడును, కూర్చుండియుండిరి. ఆరూపజితసుమశరులఁ జూచి వీరెవ్వరైయుందురా? యనితర్కించుచు నటనిలచితిని.

ఊర్మిళ:—సఖీ! తుదకువారెవ్వరో తెలిసికొంటివా?

వాసంతి:—రాకొమరితలారా! త్వరపడకుము. వారెవ్వరో తెలిసికొంటిని. యావెంటనేవింటి నొకసువార్తను

సీత:—వారెవ్వరు?

ఊర్మిళ:—ఆసువార్త యేమి?

వాసంతి:—జనకనందినులారా! నేనాసువార్త దెలిపిన నాకేమి బహుమానమిత్తురో ముందు దెలుపుడు.

సీత:—మాయానందసంపదలో నీకుఁ గొంత భాగమిత్తుము.

వాసంతి:—ఆసుందరవదనారవిందులు దశరథనందనులు రామలక్ష్మణాభిధానులు. వారిలో బెద్దవాఁడగు రాముఁడు రేపు గిరిజాకాంతుని బాణాసనమును జేపట్టి నారిని సంధానింపనున్నవాఁడు.

ఊర్మిళ:—ఏమీ! రేపు నిజముగా గిరిజామనోహర శరాసనాకర్షణము జరుగునా?

వాసంతి:—రాజపుత్త్రీ! కేవల హరశరాసనాకర్షణమే కాదు. వసుధాత్మజా కరపల్లవాకర్షణముకూడ జరుపఁబడును.

సీత:—అధూర్జటికార్ముకము దుస్సంధానమనుసంగతి నారాజనందనుఁడెఱుంగునా?

వాసంతి:—రాజపుత్త్రీ! ఆమహనీయుని రూపసౌష్ఠవమునుజూడ నొకకరమున హరచాపమును వేఱొకచేత హరికార్ముకమును బట్టుటకు దగినదిట్టయని తోఁచినది. ఇంతియకాదు. ఆకువలయదళశ్యాముఁడు భూవలయమునంతను తనగోటికొనను మోపఁగలఁడు. వక్షముపై వజ్రములఁ బగులఁగొట్టఁగలఁడు.

ఊర్మిళ:—సఖీ! ఆతఁడంతటి మోటుమానిసియా? అట్లగుచో శిరీషాళిసుకుమారియగు నాయక్కకెట్లు సరిపడును?

వాసంతి:—ఊర్మిళా! కౌముదీస్పర్శచేఁ జంద్రకాంతోపలము వలె సీతాకరస్పర్శచే నాతఁడు సరసుఁడు కాఁగలఁడు. ఆవీరుఁడు మీయక్కకెంతయుఁ దగియున్నవాఁడు. వీరిరువురఁ దాసులోనుంచి తూచినఁ గులరూపగుణాదులలో సమానముగాఁ దూగుదురు. దేహగుణములో నీవిదేహాత్మజకంటె నాదశరథాత్మజుని వైపు తక్కడ కొంచెము మ్రొగ్గునట్లు తోఁచుచున్నది

ఊర్మిళ:—అట్లైననాతఁడు ఈభూమిజకుఁదగినవాఁడేయందువా?

వాసంతి:—నాయూహచే నంతయే. కాని లోకమునకు వచ్చిన వారు కన్యకామణులకు రుచింపకపోవచ్చును. కమలిని దినకరునివరించె గుముదిని శీతకరునిప్రేమించెఁ గావునఁ గన్యలు వరులనెంచుటలో వారి వారి రుచులఁబట్టియుండును

ఊర్మిళ:—వాసంతీ! అసొగసుకాని రూపమిట్లుండునా? చూడుము. అని సీతచేతనున్న చిత్రఫలకమునులీసికొని వాసంతికిచ్చెను.

వాసంతి:—రాజపుత్రీ! ఇతఁడేయాతఁడు, జాణలారా! నాకంటె ముందుగా నాయినకుల నందనులఁ గనుగొనియుంటిరా? ఎప్పుడు చూచితిరి?

ఊర్మిళ:—మాయక్కకలలో నీనల్లకలువరంగువానిని గాంచి వరించి లిఖించినది. ఆతఁడీతఁడేయైనచో మాయక్కకుఁ దగినవాఁడే.

సీత:—సఖీ! వాసంతీ! నీవుచూచిన యాపున్నమవెన్నెల వన్నె చిన్నవాఁడు ఈకన్నియకుఁ దగియుండునా?

వాసంతి:—సౌభాగ్యవతులారా! మీసోదరీమణుల నిమిత్తమే నలువ ఈవార్షికఘనరూపుని, ఆశారదాభ్రసంకాశుని, నిర్మించెనని నాయూహ.

ఊర్మిళ:—వాసంతీ! నీవుపువ్వులఁగోసి తెచ్చుటకుఁ బోలేదు. వరులసమకూర్ప నేగితివని తోచుచున్నది.

వాసంతీ:—ఊర్మిళా! నేమొకట సుమములను, బిమ్మట వర ఫలములను సమకూర్పఁబోతిని.

సీత.—నిజమే! నీవువాసంతివగుటచే సుమఫలములరెంటిని సమకూర్పఁజాలుదువు.

వాసంతి:—రాజనందనలారా! మీకాదశరథనందనులునచ్చిరా?

ఊర్మిళ:—శివచాపమెత్తిన పిమ్మటఁగదానీప్రశ్నకు సమాధానము.

సీత:—కాత్యాయనీకటాక్షమున్నఁగాని హరచాపసముద్ధరణము సాధ్యముకాదు.

వాసంతి:—కావుననే మీయమ్మ సుమేధాదేవి నీచే నీనాడు గౌరీపూజ చేయింపఁదలంచినది. అనుచుండ సుమేధాపరిచారిక వచ్చి

"అమ్మా! జానకీ! మీతల్లిగారు మిమ్ముఁబిలుచుకొని రమ్మన్నారు" అన నామాటవిని సీత యిట్లుపలికెను.

సీత:—"వాసంతీ! లెమ్ము. మాయమ్మగారిమందిరమున కేగుదము" అని యామెయిళావాసంతులతో పరిచారికవెంట సుమేధామందిరమున కేగి యామెకు నమస్కరింప ఆరాణి "కల్యాణపరంపరావాప్తిరస్తు" అని దీవించి యిట్లుపలికెను.

సుమేధ—పుత్రీ! నీవీదివసమున గౌరీపూజనొనర్పవలయు అందుకువలయు పూజాద్రవ్యములు గౌరీమందిరమున సిద్ధముగానున్నయవి కావున వెంటనేస్నానమాచరించి, నవవస్త్రాలంకారకలితవై, లలితను బూజింపుము అందుచే నీకు నిరంతరాయముగా నీప్సితార్థసిద్ధిచేకూరును. అన సీత తల్లి యాజ్ఞానుసారము సుస్నాతయై నూత్నవస్త్రాభరణాదుల ధరియించి, భూమికవతరించిన లక్ష్మియోయన గౌరీమందిరమునకేగి, కాత్యాయనీవ్రతమును విధినియమములతో నాచరించి, యాగౌరీదేవినిట్లు ప్రార్థించెను.

"శివంకరీ! శంకరీ! దశరథనృపాలసూనుఁడగు రాముఁడు నీమనోహరుఁడగు హరునికోదండము నెక్కువెట్టి నాగళమునఁ దాళిఁగట్టునట్లు ప్రసాదింపుము. దయావతీ! పార్వతీ! ఇదివఱకెందరో యువతులు చంద్రమౌళిశరాసనోద్ధరణమునకు వచ్చియుండిరి అప్పుడునామానసమున వారు వింటినెక్కుడుదురేమోయను ఖేదమేకాని మోదమొదవదాయెను. నేడేలకో తెలియరాని యమితానందము నాయంతరంగమున తరంగితమగుచున్నది. తల్లీ! పార్వతీ! తన్నువంచింపవచ్చిన పంచశరుని బంచత్వమొందించిన పంచాననునికై పరితపించి, పంచాగ్నిమధ్యమున నచంచలముగానిలచి తపమాచరించి యాత్రినేత్రునితోనేకమై తుదకు పంచనయనవై వెలసిన నీకు నిప్పట్టున నాహృదయమెట్లుండునో తెలుపవలయునా? ఓశివసుందరీ! నాయందుదయఁగొని రాముఁడు నాకరగ్రహణమొనర్చునట్లు చేయుము." అనిప్రార్థించి పూజాంతమున నంతఃపురములోనికి వెడలిపోయెను.

ఆనాడు సుమేధాజనకులుపవసించి నిజాభీష్టసిద్ధికై యుమా మహేశ్వరవ్రతమాచరించి యారాత్రి జాగరణమొనర్చిరి. మిథిలాపుర జనులు ఎప్పుడు తెల్లవారునా! ఎప్పుడురాముడుశివునివిల్లెక్కుడునా! ఎప్పుడుసీతాకల్యాణమును కనులారఁగాంతుమా! యని త్వరపడఁదొడంగిరి. మిథిలానగర మెటుచూచినను, మంగళాలంకార శోభితమై జనకదంబ బంధురమై వెలయుచుండెను.

## సప్తవింశత్యధ్యాయము.

### —♦ శివచాపోద్ధరణము ♦—

తెల్లవారినతోడనే జనకరాజేంద్రుఁడు శతానందునితోఁ గలిసి విశ్వామిత్రునికడకువచ్చి ఇట్లుప్రార్థించెను.

జనకుఁడు:—కౌశికమునీంద్రా! మీయనుగ్రహముచే యాగము నిరంతరాయముగా సాగినది ఇకముందు మీయాశీఃప్రభావముచే సీతాకల్యాణోత్సవము జరుగవలసియున్నది. హరశరాసనోద్ధరణమునకు రాజనందనులందరు స్వయంవరమంటపమునకు వచ్చియున్నవారు. మీరు దశరథనందనుల వెంటనిడికొని సభామంటపములోనికి దయచేసి నా మనోరథమీడేర్పఁ బ్రార్థించుచున్నవాఁడను.

విశ్వామిత్రుఁడు:—విదేహరాజమౌళీ! నీమనోరథమీడేరుటయే మాయభీష్టము. అనిపలికి రామలక్ష్మణులతో జనకునివెంట స్వయంవర మంటపమున కేగెను.

ఆస్వయంవరమంటపము నాకేగునప్పటికే పౌరజన సమూహములతోడను భూపాలకుమార నివహములతోడను మునిగణములతోడను సీమంతినీకదంబములతోడను నిండి నిబిడీకృతమైయుండెను. జనకుఁడు విశ్వామిత్రాదులతో సభామందిరములోని కేగి యుచితాసనముల వారలనుపవసింపఁజేసి ప్రధానామాత్యుఁడగు సుధామునితో స్వయంవరనియమములఁగూర్చి రాజనందనులకందరికిఁ దెలుపుమని నియమింప ఆమంత్రిపుంగవుఁడు లేచినిలచి ఇట్లు రాజకుమారుల సంబోధించెను.

సుధాము:—శౌర్యసాగరులారా! క్షత్రియకుమారులారా! మీ మెదుట నుంచబడిన ఈత్రిపురారి శరాసనమునకు నారిని సమకూర్చిన వారు నారీమణియగు సీతను జేకొనవచ్చును. కావున ధనురుద్ధరణమునకుఁ బ్రయత్నింపుఁడు. అన, ఆవిదేహమంత్రి వచనముల నాలించిన వారేకాని సాహసించి శరాసనాకర్షణమునకు ముందునకు వచ్చినవాఁడా రాజకుమార మండలములో నొక్కరుఁడును గానరాఁడయ్యెను. అంత నాజనకామాత్యుఁడు తిరుగ నిట్లుపలికెను.

ఈవిశాలసభాస్థలిలో నీచేసికంటివింటి నెక్కిడి కలువకంటియగు మాజనకరాజేంద్రనందన సీతను జేకొనఁదగు సమర్థులొక్కరును లేరా? అన సభాభవనము నిశ్శబ్దమాయెను. అపుడు లక్ష్మణుడు సుధాముని సూదిపోటుమాటలకు తనదేహమునఁ బ్రవహించుచున్న క్షాత్రరుధిరము దుకెత్త రాముని వైపుచూచెను. ఆసౌమిత్రిచూపుల వీరభావమును గుర్తించి రాముఁడు నిజనయనరక్తేందీవర కాంతులఁ గౌశికునిపైఁ బ్రసరింపఁజేసెను. విశ్వామిత్రుఁడు రామలక్ష్మణుల యింగితమును గుర్తించి సుధామునితో నిట్లుపలికెను.

విశ్వా:—మంత్రిపుంగవా! నీవుతలంచినట్లు ఈసభాస్థలిని చాపోద్ధరణసమర్థులు లేకపోలేదు. సుధాముఁడా! నీయాహ్వానము నిందు గల పెద్దలెవ్వరేని మన్నింతురేమోయను తలంపుతో వినయసంపన్నులగు నీదశరథకుమారులు తటస్థులైరికాని చాపమెక్కిడలేక యూరకొనలేదు. చూడుమీరాజకుమారులవైపు ఆజ్యధారలచే హోమాగ్నులట్లు నీహేళనవాక్యములచే నెట్లు ప్రజ్వలించుచున్నవారలో. కత్తి వరలో నున్నపుడు తనవాడిని జూపనేరదు. క్షత్రియుడు వినయముతో నున్నపుడు తనపరాక్రమమును జూపనోపడు. కాని వరనుదూసిన కత్తియు వినయమును బాసిన క్షత్రియుఁడును తమవాడులఁ జూపఁదొడంగుదురు అని రామునివైపుజూచి ఇట్లుపలికెను.

విశ్వామిత్రుఁడు:—అసమానవిక్రమా! రామా! అమందసమున నున్న మందాకినీధరుని వింటినెక్కువెట్టి నీవంటివీరుఁడు నృపకుమారలోకమున లేడనుకీర్తిని జేకొని పిమ్మట సరసీరుహాదళ మృదులమగు

జనకజాకరపల్లవమును జేకొనుము. కట్టుము కటితటమునఁ గౌశేయమును నిలుఁ వఁబెట్టుము. సూర్యాన్వయగౌరవమును అన రాముఁడు కుశికాత్మజుని యాజ్ఞానుసారము లేచినిలచి నడుముబిగియించి కౌశికునిపాదములకు నమస్కరించి సింగపుకొదమ కరికరాగ్రముమునకేగుకరణి గంభీరముగా నకుగులిడుచుఁ దిన్నగా మందసముకడకేగి మోమున సుందర మందహాసము తాండవింప నందున్న గిరీశశరాసనముపై జేఁబట్టి విశ్వామిత్రునివైపుఁ జూచుచు నిలచెను.

అపుడు సురేంద్రచాపకలితమగు నీలనీరదమువలె కరగతశివ చాపముతోఁ బ్రకాశించుచున్న శ్యామసుందరుఁడగు రామునివదనారవిందమునఁ గల్యాణలక్ష్మి తళుకొత్తఁ దొడఁగెను. జానకీముఖకమలమున సౌభాగ్యసంపద ప్రకాశింపఁదొడంగెను. శిరధ్వజుని మానసారవిందమున సంతోషసౌరభము జనింపఁజొచ్చెను కౌశికహృదయహ్రదమున నానందరసతరంగములు చెలరేగ మొదలిడెను బృదారకమాకందబృందములఁ బ్రమోదపల్లవము లుదయింపనాయెను షట్పదసమూహము లు సరసిజముపై వ్రాలునట్లు సభ్యావలోకనసందోహములు శ్రీరామ ముఖారవిందముపైఁ బడఁదొడంగెను. ఆకసమున నాకవాసులొండొరుల నొత్తికొనుచుఁ గుసుమవర్షములఁ గురియింపఁ గుమిగూడఁ దొడంగిరి.

అట్టిసంతోషసమయమునఁ గౌశికుని కనుసంజ్ఞచే రాముఁడుహరకోదండమునకు నల్లిత్రాటిని దగిలింపఁబోవ నాపాత్రవిల్లు నడిమికి రెండుగావిరిగి నేలఁబడెను. ఆవెంటనే మింటదేవదుందుభిధ్వానములు చెలరేగెను. దివ్యకుసుమవర్షములు గురిసెను. సభాసదులెల్లరు కరముల తట్టుచుఁ దమయానందముల వెల్లడింప నారంభించిరి.

అపుడు జనకనృపాలుఁడు ఆనందభరితుఁడై విశ్వామిత్రునకు సాష్టాంగనమస్కారమొనర్చి సంయమీంద్రా! మేచకమణిశ్యామసుందరమగు రామనీరదమును దోడ్కొనివచ్చి హరధనుర్భంగగర్జనములతో వీరరసవర్షమును గురిపించి, నామానసమహీరుహమున సంతోషపల్లవముల నుదయింపఁజేసితిరి! మునివరేణ్యా! సీతాపాణిగ్రహణమహోత్స

వమును గూడ సాగింపఁగోరుచున్నవాఁడను. రామపాదములఁ గడుగుటకు నాకరములును, సీతను బరిగ్రహింపుమని తెలుపుటకు నానాలుకయు, అట్టి కల్యాణమవలోకింప నానేత్రములునుఁ దర్వరపడుచున్నయవి. కావునఁ గర్తవ్యమును యోజింపుడు. విశ్వామిత్రుఁడు జనకుని యుత్సాహమును గుర్తించి యిట్లు పలికెను.

విశ్వామిత్రుఁడు:—నృపావతంసా! నీకోరికయెంతయు సమంజసము కాని దశరథనృపవరేణ్యునకుఁ దెలుపక మనము వేగిరపడి కల్యాణోత్సవమును నెఱపరాదు. మఱియు దశరథాజ్ఞ లేక సీతను జేకొనుటకుఁ గౌసల్యానందనుఁడంగీకరింపఁడు. కావున మనమా కోసల సార్వభౌముని కడకు కుశలుఁడగు సచివునిచే శుభలేఖను బంపి ఇటకు రాఁ బ్రార్థింతము

జనకుఁడు:—సర్వజ్ఞులరగు మీరు తెలిపినదియే మర్యాద కాని "శ్రేయాంసి బహువిఘ్నాని" అనుటచేఁ జిరకాలవాంఛితమగు సీతాకల్యాణమును శీఘ్రముగా జరుపఁ ద్వరపడుచుంటిని.

విశ్వామిత్రుఁడు:—జనకరాజేంద్రా! నీవేగిరపాటునకుఁ గారణము నే నెఱుంగుదును. హరధనుర్భేదియు వరధనుర్ధారియు నగు రాముఁడు లక్ష్మణసహాయుఁడై యుండ రాత్రించరవీరులకు యుద్ధము చేయుటకు గాని మాయలఁ బన్నుటకుఁగాని సాధ్యము కాదు. సూర్యకరప్రసారమెంత వఱకుండునో యంతదనుక చీకటిదోసములు పొసఁగ నేరవు. అటులనే శ్రీరామ బాణప్రసారమున్నంతవఱకు దోషాచరపీడలు కలుగఁజాలవు. కావున శాంతచిత్తుఁడవై జానకీపరిణయమహోత్సవమును సావకాశముగా సాగింపుము. మఱియు దశరథునకు రామలక్ష్మణులేకాక భరతశత్రుఘ్నులను మఱిద్దరు నందనులు కలరు వారును వీరితో సమానులే. కావున నీసోదరుఁడగు కుశధ్వజునిపుత్రికలను భరతశత్రుఘ్నుల కొసంగ నేర్పాటుచేసి ఏకముహూర్తమున నలుగురికిని కన్యాదానములఁ జేసిన బాగుండును. జనకుఁడు విశ్వామిత్రునిబోధలవిని వెంటనే ముఖ్యామాత్యుఁడగు సుధాముని బిలిచి స్వయముగా శుభలేఖను లిఖించి యాతని కిచ్చి "శీఘ్రముగా నయోధ్యకేగి దశరథసార్వభౌమున కీశుభలేఖనిచ్చి యాతని దగుమర్యాదలతో సపరివారముగ నిటకుఁదోడ్కొనిరమ్ము."

అని యాజ్ఞాపించి ఆవెంటనే "నాసోదరుఁడు కుశధ్వజుని సకుటుంబము గా మిథిలకుఁ దీసికొనిరమ్మని" స్వనందనుఁడగు నానందుని నియమిం చెను. ఆనందుఁడు వెంటనే సాంకాస్యమున కేగి, కుశధ్వజుని సకుటుంబ ముగా మిథిలానగరమునకుఁ దోడ్కొనివచ్చెను.

జనకమంత్రియగు సుధాముఁడు వస్త్రాభరణాది పారితోషికముల దీసికొని సాకేతనగరమున కేగి దశరథునిసందర్శించి తాఁగొనితెచ్చిన బహుమానముల సమర్పించి శుభలేఖనందిచ్చెను. దశరథుఁడును సుధా మునాదరించి యాతడిచ్చిన శుభలేఖనుజూచి రాముని పరాక్రమాతిశయ మునకు నానందించి వసిష్ఠాదులకు శుభలేఖార్థముల వినరించెను. వారె ల్లరును రామునికిఁ బరిణయోత్సవము జరుగనుండుటను దెలిసికొని పర మానందముతోఁ గోసలేంద్రుని సీతాకల్యాణమునకుఁ బ్రోత్సహించిరి. దశరథుఁడు గురుమిత్రసామంతాదుల వెంటనిడికొని సాకేతమునుండి బయలువెడలి మార్గమధ్యమున మూడురాత్రులుగడపి నాల్గవనాటి సా యంతనమునకు మిథిలానగరము సమీపించెను.

జనకుఁడు దశరథాగమనవార్తను దెలిసికొని శతానందాదుల తోఁగూడి మహానందముగా ముందున కేగి వసిష్ఠదశరథాదుల భక్తిగౌర వములతో నిజరాజధానికిఁ దోడ్కొనివచ్చి దివ్యసుందర ప్రాసాదముల వారినందరి నర్వారీతిని విడియఁజేసెను. ఆపిమ్మట గాధిసుఁడు రామలక్ష్మ ణుల వెంటనిడికొని దశరథునికడ కేగ అతఁడు కౌశికునికి నమస్కరిం చెను. రామలక్ష్మణులు దశరథపదములకు వందన మొనర్ప అతఁడువారి నానందముతోఁ గౌగలించుకొనెను. విశ్వామిత్రుఁడు దశరథునకు రామ లక్ష్మణుల యోధ్యను వీడినది మొదలు హరచాపభంజన మొనర్చువఱకు జరిగినచరితమును వివరముగాఁ దెలుప నాన్నృపుఁడు విని, యానందించి విశ్వామిత్రునిగూర్చి యిట్లుపలికెను.

దశరథుఁడు:—మునీంద్రా! అగ్నివేదిమికి వారియావిరియై యఙ్ఞ త్రములనడపించు శక్తికలనియగునట్లు మీకటాక్షవీక్షణముచే నీబా లుఁడు శూరుఁడై కార్యతంత్రముల నడుపుసామర్థ్యము కలవాఁడాయెను రాముఁడు కీర్తిధిరాజితుఁడగుటకు మీయాశీఃప్రభావమే ప్రధానసాధ

నము. అటులఁగాకున్న ప్రౌఢవీరులకుఁగూడ జయింపనలవికాని మారీచాది రాత్రించరశూరులేడ? నూగుమీసములుకూడ రానిరాముఁడేడ?

విశ్వామిత్రుఁడు:—కోసలేంద్రా! భానుకిరణములకు నుష్ణకాంతియు భాస్కరకులజులకు విజయకీర్తియు సహజములుకాని పరసహాయజనితములుకావు. అజనందనా! ఈజనకరాజేంద్రుఁడు నీసుతులకుఁగన్యాదానములుచేయఁ బరమోత్సాహముతో నీరాకకై వేచియున్నవాఁడు కులరూపనద్గుణాదులచే మైథిలకన్యకలు నీనందనుల కెంతయుఁ దగియున్నవారు. మీయుభయవంశములకును సంబాధమేర్పరుప మేమెల్లరమును సరీక్షించుచున్నవారము. అని తెలిపినతోడనే జనకుఁడు దశరథునిగూర్చి ఇట్లుపలికెను.

జనకుఁడు:—మిత్రమా! కోసలరాజచంద్రమా! నేనెంతకాలము నుండియో మీతోసంబంధము నెఱుప నభిలషించుచుంటిని. నేటికాయభిలాషను ఈకుశకాత్మజుఁడు నీయాత్మజులఁదోడ్కొనివచ్చి పూరించెను కావున జాగుసేయక నాపుత్రికలగు సీతోర్మిళల రామలక్ష్మణులకును, నాయనుఁజనుహితలగు మాండవీశ్రుతకీర్తుల భరతశత్రుఘ్నులకును కళత్రములనుగాఁజేకొని నన్ను గృతార్థునిగాఁ జేయఁగోరుచున్నాఁడను.

దశరథుఁడు:—ప్రియసఖుఁడా! జనకభూపాలుఁడా! లోకములో దాతలు ప్రార్థింపఁబడుమరుగాని ప్రతిగృహీతలుకారు నీవిపుడు దాతవును నేను ప్రతిగృహీతనునై యుంటిమి. కావున నీయభిష్టానుసారము చేయుము. మనమిరువురము వసిష్ఠవిశ్వామిత్రుల యాజ్ఞలపై శుభకార్యముల సాగించుటెంతయు శ్రేయస్కరము అనిపలికి వసిష్ఠునిజూచి ఇట్లు పలికెను.

దశరథుఁడు:—దేశికేంద్రా! వింటిరికదా? కౌశికోక్తులను జనకాభిలాషములను ఇకముందు నన్నేమిసేయుమందురో సెలవిండు,

వసిష్ఠుఁడు:—దశరథ రాజేంద్రా! బోధింపనలసిన దేమున్నది దాత్ప ప్రతిగృహీతలగు మీరిరువురును నేకమైయుంటిరి. మధ్యపురోహితునిదా? యాటంకము నృపేంద్రా! నీపుత్రులకు జనకపుత్రికలఁ జేకొనుటయే కర్తవ్యము. కావున నీవు రేపు నీసుతులకు స్నాతకవ్రతముల

బూర్తిచేయుంపుము అని తెలిపెను అనంతరము జనకుఁడు వసిష్ఠ విశ్వామిత్రాదులకడ సెలవుగైకొని శతానందునితో వెడలిపోయెను.

దశరథుఁడు మిథిలానగరమునకు వచ్చిననాడే కైకేయీసోదరుఁడగు యుధాజిత్తు గిరివ్రజపురమునుండి మిథిలానగరమునకువచ్చి, దశరథునితోఁ గలిసికొనెను దశరథుఁడు కేకయయువరాజును గారవించి, "కేకయసార్వభౌములు కుశలముగా నున్నవారా?" యనిప్రశ్నించెను. అందుపై యుధాజిత్తు "మాజనకులు కడువృద్ధులైయున్నవారు మా యక్క సంతానవతియైనసంగతి మీరువ్రాసిన శుభలేఖవలనఁ దెలిసికొనిరి. అప్పటినుండియు తమదౌహిత్రునిజూడ నభిలషించుచున్నవారు. మిమ్ముఁనడిగి, యొకపర్యాయము భరతునిదీసికొనిరమ్మని నన్ను బంపినారు నేను మొదట నయోధ్యకేగితిని. మీరు మీపుత్రులకుఁ బాణిగ్రహణమహోత్సవములజరుప మిథిలానగరమునకేగితిరను సువార్తనువిని తిన్నగా నిటకువచ్చితిని. కాకతాళీయముగా నాకీకల్యాణ మహోత్సవము చూచుట సంప్రాప్తమైనది.

దశరథుఁడు:— కేకయయువరాజా! "శ్రీరామాదిసోదరులకు మైథిలరాజకన్యకల నొసంగుటకేర్పాటుచేసియుంటిమి వెంటనే రమ్మని" విశ్వామిత్రుఁడుత్తరమువ్రాయించుటచే నవ్యవధిగాఁ బయలుదేరవలసి వచ్చినది అందుచే నాప్తబంధువులనుగాని ప్రియమిత్రులనుగాని పిలుచుటకు వీలుకాదయ్యెను కాని హితులగు నీయట్టిబంధుగులు పిలుపుల నరకుచేయక శుభకార్యములకువచ్చి సాయపడుదురు. నీవీవివాహ మహోత్సవమునకువచ్చుట మాకెంతయుఁ బ్రమోదావహమైనది. వివాహమహోత్సవములు పూర్తియైనపిమ్మట నీమేనల్లుఁడు భరతుని మామగారికడకుఁ దీసికొనివెళ్ళవచ్చును అని తెలిపి యాతనికిఁదగు మర్యాదలఁ జేయించెను.

అమరునాడు దశరథుఁడు వసిష్ఠమునీంద్రులచే నిజనందనులకు స్నాతకవ్రతముల జరిపించుటకు నేర్పాటుచేసెను. అంతజనకుఁడు స్నాతకమునకుఁ గావలసిన మంగళద్రవ్యముల వెంటనిడికొని బంధుబృందములతోడను మంగళవాద్యములతోడను దశరథమందిరమునకువచ్చి

తాఁదెచ్చిన మంగళవస్తువులనొసంగెను. వసిష్ఠుఁడు విశ్వామిత్రాదిమహర్షులతోఁగూడి రామలక్ష్మణభరతశత్రుఘ్నులచే స్నాతకవ్రతములఁజేయించి బ్రహ్మచారిసంస్కారముల నవనయించి గార్హస్థ్యచిహ్నములగు నవవస్త్రభూషణాదులతో దశరథనందనుల నలంకరింపఁజేయించి మహర్షులచేతను భూసురోత్తములచేతను మహదాశీర్వాదములఁ జేయించెను. అపిమ్మట ఆకుమారులు స్నాతకవేషాలంకృతులై తమమంగళరూపములచే నటనున్న వారిమానసముల నాకర్షింపఁదొడంగిరి. వారియపూర్వసుందరవేషములఁజూచి జనకరాజేంద్రుఁడు అపరిమితానందభరితుఁడై వసిష్ఠదశరథులఁగూర్చి యిట్లుపలికెను.

జనకుఁడు:—మునిమానవసార్వభౌములారా! వసిష్ఠదశరథులారా! మీరెల్లరు బంధుపరివారసమేతులై వివాహమహోత్సవముల నెరపనామందిరమునకు రాఁబ్రార్థించుచున్నవాఁడను వైవాహికమహోత్సవమును జూచుటకుఁ బౌరులెల్లరును ఉవిలోత్సుకులై యున్నవారలు కావున వేగముగా విడిదినుండి కల్యాణమంటపమునకు రానలయును. అనిప్రార్థింప వసిష్ఠదశరథులు ఇట్లుపలికిరి. "విదేహసార్వభౌమా! నీయాహ్వానము మాకెంతెయు సంతసావహము ఇదేబయలుదేరి వచ్చుచున్నవారము" అన జనకుఁడు శతానందాదులతో నిజమందిరమునకేగెను.

## —: అష్టావింశత్యధ్యాయము :—

### సీతాకల్యాణము.

దశరథుఁడు వసిష్ఠవిశ్వామిత్రాది మునిగణములతోడను, సామంతరాజసమూహము లతోడను, బంధుబృంధములతోడను, సైనికసివహముల తోడను, గూడి భేరీమృదంగాదిమంగళవాద్యనాదములు మిన్నుముట్టుచుండ రామలక్ష్మణభరతశత్రుఘ్నుల వరాభరణవస్త్రాదులచే మనోహరముగానలంకరింపఁజేసి చతురశ్వయానముల పైఁ గూర్చుండఁబెట్టి విడిదిమనికిపట్టునుండి మహావైభవముతో నూరేగుచు మిథిలాపురరాజవీధిని వచ్చుచుండెను.

అపుడు పౌరనారీమణులు శివచాపఖండనవీరుఁడగు రాముఁడు సీతాపాణిగ్రహణమునకు నూరేగుచు వచ్చుచున్నాఁడను వార్తను సఖ

జనులవలనవిని ఆజగన్మోహనాకారుని వివాహనైపథ్యమును జూచునభిలాషతో మందిరాంతరములనుండి తొందరగారావోడంగిరి.

అందొకయలివేణి యుత్సవఘోషము వినినతోడనే గట్టువాలొనర్చుచున్న పూలజడయల్లిక మూగియకమున్నె జడనులాగికొని గ్రుచ్చిన పువ్వులు నీలవేణినుండి నేలరాల గవాక్షముకడకుఁ బరుగిడెను.

వేఱొకమందయాన పరిచారిక పాదతలములకు లత్తుకరసమును బూయుచుండ అరచన పూర్తికాకమున్నె మార్గముపొడవునను నిజపదరాగచిహ్నముల ముద్రించుచు కిటికీకడకేగెను. మరియొకసారసాక్షి కుడికంటికి కాటుకనుదిద్ది యెడమకంటికి నంజనమును బెట్టఁగాటుకబరణినుండి నేలిలోనంజనమునుదీసి దానిని కంటికిఁబెట్టకయే జాలముకడకుబోయెను. ఇకనొకసుందరాంగి మొలనూలును వ్రేలికిజుట్టి బంగరుమువ్వలగుచ్చుచు చేతనున్నదారపుకొస నట్లెవిడచి గుంభితములైన పసిడిగజ్జెలు క్రిందఁబడ పచ్చనిసూత్రము పసిరికపామువలె పాదమునంటిరాఁ బరుగిడఁజొచ్చెను. మఱొక్క మోహనాంగి మోమునఁ గస్తూరీతిలకమును దిద్దునుద్దేశముతో నొకచేతనద్దమును వేఱొకహస్తమున మృగమదశలాకను బట్టుకొని బొట్టిడకయే కిటికీదగ్గరకేగెను.

అట్లామిధిలాపురవిలాసినులు అసమాపితాలంకారకార్యలై విషయాంతరములమరచి యుండుటనుజూడ వారిజ్ఞానేంద్రియములన్నియు నేత్రేంద్రియమున నైక్యమై యాశ్రీరామరమ్యాకృతి నీక్షించుచున్నట్లు తోచెను.

"నిజమే! ఈకాలమునఁ జిత్రలేఖనములయందును. లోహప్రతిమలయందును, శిలావిగ్రహములయందును, మట్టిబొమ్మలయందును జూపట్టుకల్పితరామరూపమే మానవమానసహారమై వెలయుచున్నయపుడు ఆకాలమున శ్రీరాముని సహజసుందర వైవాహికరూపమును గన్నులారఁగాంచువారికి వ్యాపారాంతరములు మందగించినవన సందేహమందఁబనిలేదు.?

అట్లామహోత్సవములో దశరథభూపాలుఁడు స్యందనారూఢులగు నిజనందనులఁదోడ్కొని రాజవీధినూరేగుచు దుర్గద్వారముకడకు

రాగా జనకుఁడు ఎదురేగి వియ్యాలవారిని మర్యాదలతో గల్యాణమం టపమునకుఁ బిలుచుకొనిపోయి యర్హాసనములపై నాసీనులనుగాఁ జేసెను. అంతశతానందుఁడు వసిష్ఠునితో నిట్లు తెలిపెను.

శతానందుఁడు:—భానుకులాచార్యా! వసిష్ఠమునివర్యా! వివాహమునకు వలయుమంగళపరికరములన్నియు సిద్ధముగానున్నవి. దశరథనందనులకుఁ గన్యాదానములొనర్చి కృతార్థులగుటకు నిమికులనృపాలురగు జనకకుశధ్వజులు ప్రతీక్షించుచున్నవారలు. కావునఁ బాణిగ్రహణ విధానమును జరిపింపఁబ్రార్థించుచున్నవాఁడను అనవసిష్ఠసంయమీంద్రుఁడుకల్యాణప్రాసాదమధ్యమున నిర్మింపఁబడియున్న వేదికయందుఁ బావకునిప్రతిష్ఠింపఁజేసి అందుమంగళహోమములజరిపించి కంకణబంధములనమకూర్చి "గౌతమనందనా! మాపక్షమునఁజేయింపవలసిన వైవాహికసంవిధానములు పూర్తి చేయింపబడినవి. ఇక కన్యాదానమునకు సంకల్పముచేయింపుము." అని తెలిపినతోడనే శతానందుఁడు జనకుని చేఁగన్యాదానమునకు సంకల్పముచేయించి నిమివంశప్రవరనుపఠించెను. వశిష్ఠుఁడు సూర్యవంశప్రవరను పఠించెను. అట్లుభయప్రవరలు తెలుపఁబడినపిమ్మట భేరీమృదంగాది మంగళవాద్యములు మ్రోగుచుండ ఆకసమున దేవదుందుభిధ్వానములు చెలగుచుండ మహర్షులు వైవాహికమంత్రములఁ జదువుచుండ వీణావేణుమృదంగాది గానవాద్యములు ధ్వనించుచుండ సభాసదులెల్లరు పరమామోదములో రెప్పవాల్పక చూచుచుండ జనకభూపాలుఁడు తనపట్టపుదేవియగు సుమేధ సువర్ణకలశములో జలములఁబోయ శ్రీరామచరణారవిందముల బంగరుపళ్ళెరమున నుంపఁజేసి ప్రక్షాళనమొనర్చి యాపవిత్రోదకములఁ బత్నీసహితముగా శిరముపైఁజల్లుకొని శ్రీరామునకు సీత కరమునందిచ్చుచు నిట్లుసంబోధించెను.

జనకుఁడు:—ఓయినకులసాగరసోమా! రామా! ఈసతీలలామ సీతానామ సుగుణాలవాల నాబాల ఈపెను నీవు సహధర్మచారిణినిగాఁ జేకొనఁగోరుచున్నాను. ఈసుముహూర్తసమయమునఁ గల్యాణకరమగు నీకరములో మంగళావహమగు ధరణిజాపాణిపల్లవమును గ్రహింపుము

ఈఘనాశయయగు సీత నీడవలెనిన్నెడబాయక వెంటనంటియుండును. నీకు శుభములు కలుగుగావుత అని మంత్రోదకపూర్వకముగా సీతాకరసరసిజమునందీయ శ్రీరాముఁడు నిజవదనవిలాసములచే వినయానందములఁ దెలియఁజేయుచు ననురాగముతో వరరాగకలితమగు జానకీకరమును బరిగ్రహించెను.

సకలలోక కల్యాణసంధాయకమగు ఆసీతాపాణిగ్రహణ సుముహూర్తసమయమున సురలోకమునుండి సుపర్వులు సుమవర్షములఁగురిపించిరి. వేదవేదాంగవిదులగు విప్రోత్తములు సువర్ణాక్షతలఁజల్లిరి. సతీమణులగు సౌభాగ్యవతులు ముత్తెములను వేలాలనుజల్లిరి. వందిమాగధులు మంగళగీతములఁ బాడిరి.

పెళ్ళిపీటలపైఁ గూర్చుండియున్న నూతనవధూవరులగు నాసీతారాములఁ దిలకించి "ఆహా! ఈవరుడెంతటి రూపముకలవాఁడనువారును ఓహో! ఈసీతకీతఁడే తగుననువారును, సృష్టికర్త వీరిరువురిని దంపతులనుగా సమకూర్పకున్నఁ దాఁజేసిన సుందరరూపనిర్మాణము వ్యర్థము చేసియుండుననువారును, సుమేధకిట్టియల్లుఁడు సమకూరుట కెంతపున్నెమొనర్చెనోయనువారును, మనసీతయే వరునికన్న హెచ్చువన్నె కలదనువారును; కాదుకాదు నిజమారయ భూమిజకన్న రాముఁడే వన్నెకాఁడనియును" ఇట్లేవేవో సంతోషపూరితములగు సంభాషణముల సభాసదులెల్లరు చేయఁదొడంగిరి.

ఆహా! నీలేంద్రమణిశ్యాముఁడగు రాముఁడు బంగారుఛాయగల సీతయొక్క కరమును ఘనానురాగముతో గ్రహించుచుండుటను కన్నులారచూచు భాగ్యమబ్బుటకు అచటివారెంతటి పుణ్యములు చేసియుండిరో కదా! పూర్వజన్మసుకృతపుంజమున్నగాని అట్టిదివ్యలావణ్యరూపుల కళ్యాణము గాంచుభాగ్యమబ్బనేరదు.

"పాఠకమహాశయులారా! సీతాకరగ్రహణ మొనర్చుటచేతనే రాముఁడు పురాణప్రసిద్ధుఁడగు పురుషవరేణ్యుఁడాయెను. ఇటనుండియే రాముఁడు శ్రీవిలసితుఁడై శ్రీరాముఁడాయెను. ఇదివఱకు కాసీరజాతుఁడు

కేవలరాముఁడే. సోదర సోదరీమణులారా వింటిరికదా? మహదానంద జనకమగు సీతాకల్యాణమును ఇకనితరపరిణయములఁగూడవినుఁడు."

జనకుఁడు సీతనురామునకొసంగి ఆవెంటనే లక్ష్మణునిబిలిచి "సుమిత్రానందనా! లక్ష్మణా! ఈయూర్మిళను జేకొని నన్ను సంతసింప జేయుము." అని యూర్మిళను లక్ష్మణునకునొసంగెను. అటుపిమ్మట శీరధ్వజుఁడు తనయనుంగుతమ్ముఁడగు కుశధ్వజునిబిలిచి భరతశత్రుఘ్నులకు మాండవీశ్రుతకీర్తుల నొసంగుమన నన్నయనుమతిని కుశధ్వజుఁడు భరతునిరాబిలిచి తనయర్ధాంగియగు సత్యవతి కాంచనపాత్రితో జలము లఁబోయ భరతునిపాదములఁగడిగి మాండవిని కైకేయీనందనునకొసంగి శత్రుఘ్నునాహ్వానించి యుదకపూర్వకముగా శ్రుతకీర్తినాసుమిత్రాసుతునకిచ్చెను పిమ్మట నావధూవరులందరును పురోహితులయాజ్ఞానుసారము అగ్నులకుఁ ప్రదక్షిణనమస్కారములొనర్చి నవరత్నమణిమయములగు పెళ్ళిపీటలపై వరుసదీరిగూర్చుండిరి. అప్పుడు పెద్దవయసుగల ముత్తయిదువలు బంగరుపళ్ళెరములలో గర్పూరహారతుల మంగళగీతములతో వధూవరులకొసంగిరి. ఇట్లాకల్యాణములు ఆనందనామ సంవత్సర వైశాఖశు॥ దశమిని ఉత్తరఫల్గునీనక్షత్రయుక్త మిధునలగ్నమున మహోత్సాహముగా జరుపఁబడినవి.

## ఏకోనత్రింశత్యధ్యాయము.

### —♦ పరశురామాగమనము ♦—

మహావైభవముగాఁ గల్యాణోత్సవములు నెరవేరినతోడనేవిశ్వామిత్రుఁడు నూతనవధూవరుల నాశీర్వదించి వసిష్ఠాదులతో నేఁబోయి వచ్చెద"నని తెలిపి హిమగిరికి వెడలిపోయెను. జనకమహారాజు వసిష్ఠాది మహామునులకును భూసురోత్తములకును సర్వములగు సన్మానముల జఱపి దశరథాదిబంధుజనుల ననర్ఘమణిభూషణాములతో బహూకరించి మంత్రిసామంతాదుల బహువిధముల గౌరవించెను.

దశరథుఁడా వివాహమహోత్సవము ముగిసినతోడనే క్రొత్త కోడండ్రి వెంటనిడికొని సాకేతమునకుఁ బ్రయాణమగుచుండ జనకన్నృ

పె లుఁడు రామాదిజామాతలకు ననర్ఘవస్తువాహనాదులఁ గానుకలఁగా నొసంగి నిజకన్యకలకు వలయుసారెచీరల నొసంగెను. అనవవధువులు త ల్లులకడకేగి నమస్కరింప సుమేధాసత్యవతులు వారినిదీవించి కౌగలించి "బిడ్డలారా! ఇటపుట్టింట స్వేచ్ఛగా మాకడమసలినట్లు అట నత్తింట నత్తమామలకడ మసలికొనక వారుబోధించురీతిని సంచరించుచు, భర్త లకును అత్తమామలకును విధేయులై యుపచారములనెరపి వారలకు సంతసమును సమకూర్పుడు. దాసీదాసాదుల మిత్రసములగ భావించి యాదరింపుడు." అనిబోధించిరి అపుడు సీత తల్లులతో నిట్లుపలికెను.

సీత:—తల్లులారా! మిమ్మువదలివెళ్లుటకు మాకెంతయో కష్ట ముగానున్నయది. అమ్మలారా! తిరుగమాకు మిమ్ముదర్శించు భాగ్యమె ప్పుడు కలుగఁజేతురు?

సుమేధ:—గుణవతులారా! పుత్రికలారా! మీరు గర్భవతుల రైతిరను సువార్త విన్నతోడనే మేమటకువచ్చి మిమ్మిటకుఁ దీసికొని వత్తుము. అచిరకాలములోనే అట్టిసంపద సమకూరుగావుత అని భగవం తుని బ్రార్థించుచుందుము.

సత్యవతి:—కొమరితలారా! మిమ్ముడబాసియుండుటకు మాకును మనసొప్పుటలేదు. కాని కన్యలు వివాహితలైనతోడనే భర్తలతో గృ హప్రవేశోత్సవమునకై వెడలుట మర్యాదయగుటచే మేమెట్టియాటంక మును కలిగింపజాలకున్నవారము. మీయక్కచెల్లెండ్రందరును, ఒక్క మనసుకలవారలై, మెలగుచుండవలయును. అని బోధించిరి. వారి సద్బో ధలవిని సీత యిట్లుపలికెను.

సీత:—తల్లులారా! ఆత్మగౌరవసంరక్షణమేజీవితఫలముగానెంచు మీయట్టి సలీమణులకడ శిక్షితులైన కన్యలన్యథాగా మసలుట యసం భవము మఱియు విదేహరాజవంశము నిత్యమగు తత్వసంపదనపేక్షిం చునుకాని చంచలమగు భౌతికభాగ్యము నభిలషించునదికాదు కావున జనయిత్రులారా! మీపుత్రికలత్తవారింట నెట్లుందురోయని చింతిల్ల కుడు. సంతసముతో సెలవునయొసేయుడు.

ఊర్మిళ:—తల్లులారా! మేముబాల్యమున మీశిష్యలనువలె ఇపుడు మాయక్కసీతబోధలను, నాధారముగాచేసికొని మసలుదుము కాని స్వేచ్ఛగా దిరుగఁబోము. కావున మీరు మాచరితములగూర్చి బెంగ టిల్లకుడు. అనివారెల్లరు తల్లులకువందనములొనర్చి జనకునికడకు వచ్చి నమస్కరించి నిలచిరి.

శీరధ్వజుఁడు నిజతనయుడగు నానందునిబిలచి యిట్లుపలికెను.

జనకుఁడు:—నందనుఁడా! నీవు నీసోదరీమణులతోఁగూడ నయో ధ్యకేగి, యట గృహప్రవేశమహోత్సవములు ముగిసినతోడనే దశరథ రాజేంద్రునియొద్ద సెలవుగైకొని రమ్ము. అని యర్ఘ్యములగు పారిబర్హ ముల సమకూర్చెను.

దశరథుఁడును మిథిలాపురమునుండి సపరివారముగా నూతన వధూవరుల వెంటనిడికొని బయలువెడలి మూడుయోజనముల దూర మేగినతోడనే విపరీతములగు నపశకునములు గన్పట్టదొడంగెను. అతేఁ డా దుశ్శకునముల దిలకించి ఏదియో యనివార్యమగు నాపద రానున్న దని భీతిల్లి వసిష్ఠునితో "మహాత్మా! మనకేదియో వినాశమాసన్నమైన ట్లీదుర్నిమిత్తములు తెలియచేయుచున్నయవి. మీకీనుర్దినమున నద్దుపడ కున్న దుఃఖాంధకారమున బడవలసివచ్చును." అనుచుండ "ఎవడురా పూజ్యపాదులగుమాగురువులచాపమును విరచి మమ్మవమానించినవాఁ డు? వాఁడు బ్రతుకదలంపలేదు కాబోలు లేకున్న పురారిశిష్యుఁడగు నీపరశురాముఁడుండ నిట్టిసాహసమునకు బాల్పడునా?" అనుచు గొండ గుహలు ప్రతిధ్వనించునట్లు కేకలిడుచు మూపునగండ్రగొడ్డలియు కర మున హరికార్ముకమును బట్టుకొని యటకువచ్చెను.

దశరథుఁడాభీకరాకారుఁడగు భార్గవరాముని చూచినతోడనే భయకంపితగాత్రుఁడై ఇట్లుపలుకఁదొడంగెను.

దశర:—హా! నయనాభిరామా! రామా! నిన్నొకసారి యాలిం గనముచేసికొననిమ్ము నీముఖారవిందముచు గన్నులారఁజూడనిమ్ము. దురదృష్టవంతుఁడనగునాకు నికనిన్నుజూచు భాగ్యముండదని తోచు చున్నది. అహా! ఈభార్గవుఁడెంతటికూ్రరుఁడు. భూవలయమునఁగల

క్షత్రియుల నిరువదియొక్కమారు నిజపరశుపావకునిచే దహించియుం డ్రప్రతిరక తిరుగఁబ్రజ్వలితక్రోధానలుఁడై శ్రీరాముని వెదకుచున్న వాఁడు.

కట్టా! పాపపుదైవమా! శ్రీరామచంద్రుఁడు భువనైకసుందర కోమలాంగియగు సీతతోఁగొన్నిదివసములైన సాంసారికానందముల ననుభవింపకమున్నె వివాహకాలమునఁగట్టిన మధుపర్కముల విప్పకమున్నె నిర్హేతుకముగా నీకట్టడివిని సుగుణసుధానిధియగు నానందమునకు నోటననరాని యాపదనుదెత్తువని తోఁచుచున్నది కటకటా! జనకనందినీ! నీవదనారవిందమున సౌభాగ్యలక్ష్మి నాట్యమాడుచుండ నట్టివిపరీతము జరుగనున్నది!

ఓవసిష్ఠాది మహర్షులారా! యుధాజిదాది బంధుసముద్రులారా! సుమంత్రాది సచివోత్తములారా! స్వామిహితైకపరాయణులగు సేనానాయకులారా! మీరెల్లరును జాగరూకులైయుండుడు. పరమక్రూరుఁడగు పరశురాముఁడు కోపానలజ్వాలాజాజ్వల్యమానుఁడై మనశ్రీరామునిపై కేగుచున్నవాఁడు. అనిపలికిమూర్ఛితుఁడాయెను.

శ్రీరాముఁడు భార్గవకంఠనాదము విన్నతోడనే జలదగర్జనమును విన్న పిన్నసింగముమాడ్కి తనవారినందరినిదాటి ముందునకేగి పరశురాముని రాకకెదురు చూచుచుండెను పరశురాముఁడు నిర్భయముగా నిలచియున్న శ్రీరామునిదివ్యరూపమునుచూచి ఇటులఁదలంచెను.

పరశు:—ఓహో! యీపిన్నవాఁడెవ్వడో చిరునవ్వుతో నిర్భయముగా నావైపు తనధీరావలోకనముల బ్రసరింపఁజేయుచున్నవాఁడు ఈతని వినయగంభీరాకృతిని జూడగనే వేగముగాఁబెనగిడివచ్చుచున్న నాక్రోధనదీప్రవాహము ఘనతరనీలపాషాణాహతికివలె వెనుకకుమరలుచున్నది. ఈవయసుకాల్మి నిర్లక్ష్యభావముచూడ గిరిజాపతిశరాసనమును విరచి, జనకజనుచేపట్టిన చెట్టియీతఁడేయని తోఁచుచున్నది ఆహా! ఏమియీతని మనోహరాకారము అనుచు శ్రీరామునికడకేగి ఇట్లు ప్రశ్నించెను.

పరశు:—ఓయీ! సుకుమారాకారా! శివునివింటినివిరచి "నా వంటిశూరుఁడులేడు" అనితలంచుచున్న రాముఁడెచ్చటనున్నవాఁడు? ఆ మాటవినినతోడనే శ్రీరాముఁడు భక్తివినయములతో భార్గవరామునకు నమస్కరించి ఇట్లుపలికెను.

శ్రీరాముఁడు:—భార్గవమునిచంద్రా! తమకాకుఱ్ఱవానితోఁబని యేదియో తెలుపనుగ్రహింతురేని యాతని దోడ్తెచ్చి మీపాదసరసిజముల ముందు నిలువబెట్టెదను.

పరశు:— నేనాతనిపరాక్రమమును బరిశీలించి పిమ్మటనాతనితో యుద్ధముసేయవచ్చితిని. కావున మాతపఃకాలము వ్యర్థముకాకుండ వెంటనేవానిఁజూపుము.

శ్రీరాముఁడు:—రేణుకానందనా! అట్లైనఁ దిలకింపుఁడు దశరథనందనుఁడగు రాముఁడు మీయెదుటనిలిచియున్న యీభక్తుఁడే తాపససార్వభౌమా! అనలమునఁబడి బంగారు వన్నెకెక్కినట్లు వేదపూతమగు మీవదనమునఁబడి నాపేరు పావనమైనది సంయమివరా! తమకీవిధేయునిపై నింతకోపమురాఁగారణమేమి?

పరశు:—తనలో "ఓహో! యేమియీతని వినయవాక్కులు! నేననేకక్షత్రియవీరులఁ బరికించియుంటినికాని, వారిలోనొకఁడును నాయెదుట నిట్లునిర్భయముగానిలచి మాటలాడినవాఁడే లేఁడు. నినిర్ధీరస్వభావముఁజూడ భూవలయమునఁ దిరుగ క్షాత్రమునుద్ధరింప నారాయణుండీరూపముతో నావిర్భవమందినట్లు తోఁచుచున్నది. కానియేదియెట్లైననుసరే యీతనిసమావేశము నాకానందప్రదమే". అనిశ్రీరామునితో నిట్లుఁబలికెను.

పరశు:—దశరథరామా! నీపరాక్రమములను నీవుశివధనుస్సును విరుచుటను వినియుంటిని. అందుచే నేస్వయముగా నీబాహుపీర్యమును బరిశీలింపఁదలంచి ఇటకువచ్చితిని. కావున ముందునాచేతనున్న కార్ముకమునందుకొని దీనఁబాణమును సంధింపుము. అట్లొనర్చినచో నీవు పరాక్రమశాలివనియెంచి నీతోయుద్ధమొనర్తును. ఆమాటలవిన్నతోడనే దశరథుఁడు గడగడవడఁకుచు బరశురామునితో నిట్లుపలికెను.

దశర:—ఓయసమానప్రతాపాగ్నీ ! జామదగ్నీ ! నీవుక్షత్రియ క్రోధమునువీడి శాంతాత్ముఁడవై సురపతితో " నేనికశస్త్రమును బరిగ్రహింపను" అనిప్రతిజ్ఞచేసియుంటివి క్షత్రియులసంహరించి నీవుగడించిన భూతలమునంతను పితరానుంక్షవై కశ్యపునకు దానమొసంగియుంటివి.

అట్టిధీరోదాత్తుఁడవగు నీవాడినమాటఁబాటింపకుంట పాడికాదు. మఱియు శమప్రధానులగు భార్గవశ్రోత్రియుల వంశమునఁబుట్టియున్న వాఁడవు. కావున శాంతాత్ముఁడవై ఈపిన్నవాని తప్పుసైరించి నాకుఁ బుత్రదానమొసంగఁ గోరుచున్నవాఁడను. పరశురాముఁడా దశరథోక్తులఁ బాటింపకయే శ్రీరామునితో నిట్లుపలికెను.

పరశు:—ఓయీ ! నీవేనా ! మాగురుచాపమును విరచిన రాముఁడవు ?

శ్రీరాముఁడు:—రేణుకాత్మజా ! ఇదికొంతవఱకునిజమే జరిగిన సంగతిని నివేదింతును. ఆగ్రహింపకవిమడు మాశస్త్రగురువులగు విశ్వామిత్రమునీంద్రులు విదేహరాజసభలో నన్నాశివధనుస్సు నెక్కుడమని యాజ్ఞాపించిరి. వారియాజ్ఞానుసారము నేనాశివునిచాపమునుఁ జేపట్టి యెత్తబోవుసరికి రెండుగావిఱిగి నేలఁబడినది. అయ్యదియుదివఱకే విరుగు చూపియున్నదో ! లేకపాతదగుటచేనాకరస్పర్శమువలనఁదునుకలై నది యో నేఁదెలుపఁజాల. మాగురువరుల యాజ్ఞానుసారము మీగురువరుల కార్ముకమును ముట్టితిని. లేకున్న నాకాచీకువింటితో బనియేమి ? ప్రవిల్లువిరుచుట యొకపరాక్రమలక్షణమా ? మునివరా ! జరిగినదింత యు. ఇందుతప్పున్నచో క్షమింపుడు దశరథసుతులు మునివిధేయులు కాని విజేతలుకారు.

పరశు:—ధూర్తక్షత్రియుఁడా ! ఏమినీవినయవక్రోక్తులు ! అగునునీవనినట్లు నీకాచీకువింటితోఁ బనిలేనిమాటనిజమే. కానీ యిదిగో నాచేతనున్న శివసేవితశరాసనమును జేకొనియెక్కుడుము పిమ్మటనీగర్వభంగమొనర్తును. ఇకమాటలతోఁ గాలయాపనచేయకుము అనితనచేత నున్న వాటికోదండమునుజూప శ్రీరామచంద్రుఁడు మందహాసముతోఁ

బరశురాముని చేతినుండి యాతని తేజస్సుతోఁగూడ శ్రీహరిశరాసనము నాకర్షించి యిటులబలికెను.

శ్రీరాముఁడు:—భార్గవకులావతంసా! విరాగులై శమప్రధానులై అహింసామార్గమునఁ గాలముగడుపఁదగు మీయట్టిబ్రహ్మర్షుల కిట్టి క్రూరశరాసనములతోఁబనిలేదు. అవి మాయట్టిక్షత్రియకుమారులకుఁ దగియున్నవి. అందుచే మీకరమునుండి యీకార్ముకమును నేఁ జేకొంటిని క్షమియింపుడు అన శీతలవారిసేచనముచే క్షీరోత్తాపము శాంతించునటుల శ్రీరామకరసంస్పర్శచే నురవాంకారమంతరింప భార్గవరాముఁడు దశరథరాముని శ్రీకాంతునిగా భావించి యిట్లుప్రార్థింపఁదొడఁగెను.

పరశు:—శ్రీరామచంద్రా! నీవుమానవకుమారుఁడవుకావు ఆద్యంతరహితాఖండ చిదానందస్వరూపమగు పరబ్రహ్మమవు. నిరీహుండవును నిష్క్రియుఁడవును నిర్వికారుఁడవును నగునీయందు జలమున నురుగువలెను, అనలమునఁ బొగవలెను, అనంతబ్రహ్మాండములావిర్భవించుచున్నవి అంతియకాని నీకుజన్మాది షడ్వికారములులేవు. ప్రకృతివ్యామోహితులగువారు నీనిజతత్త్వమును తెలియఁజాలక నీవును జరామరణములు కలవాడవేయని భ్రమించుచుందురు.

ఓపావననామా! శ్రీరామా! నేడు నీదివ్యసందర్శనముచే నాజన్మసఫలమయినది నాకులము వన్నెగాంచినది సీతారమణా! నిన్నుగూర్చి నేఁబలికిన కఠినోక్తులకుఁ గారణము నీవుపన్నినమాయయే ఇపుడు నీపాణిపంకజస్పర్శచే నాయవిద్యాతిమిరము నశింప నీస్వరూపము గానవచ్చెను. ఓభక్తవత్సలా! ఇక నాకు జన్మలేకుండఁజేసి నన్ను నీదివ్యపదసరసీరుహసన్నిధిని చేర్పుము.

ఓదయాసింధూ! జానకీబంధూ! మున్నుఁ గార్తవీర్యనందనులు నీచులై నాతండ్రి జమదగ్నిమునీంద్రుని దారుణముగాఁజంప నేనాదుర్భరదుఃఖమును భరింపజాలక ఆదుష్టక్షత్రియుల నాశనమొనర్పఁగోరి నిను గూర్చి తపమొనరించితిని. భక్తవరదుఁడవగునీవు నాతపమునకు సంతసించి ప్రత్యక్షమై "నీవీకార్ముకమును జేకొని కుత్సితులగు క్షత్రియుల

సంహరింపుము" నేను త్రేతాయుగమున దశరథనందనుఁడనుగా నవతరించి నీయొద్దనుండి తిరుగ నీశరాసనమునందుకొని నిన్నుద్ధరింతును" అని నాకీచాపమునొసఁగి యంతర్ధానమైతివి. కావున ప్రపన్నార్తిహరా! సీతామనోహరా! క్షత్రియహింసాజనితములగు నాయఘౌఘముల నీయమోఘబాణముచే ఛేదించి నన్ను నీపదయుగనళిన మధుపానమత్తునిగాఁ జేయఁ బ్రార్థించుచున్నవాఁడను అనిపలుక శ్రీరాముఁడాధ్యాత్మికముగాఁ బరశురామునకభయము నొసంగి లోకలీలకై భార్గవపదములకు వందనమొనర్చి చిరునగవుతో "మునివరా! పరశుధరా! నాపైఁగినుకతొలగెనా? అనిపలికినతోడనే పరశురాముఁడు పరమానందభరితుఁడై "శ్రీరామచంద్రా! దయాశీతలమగు నీస్మితచంద్రికాప్రసారముచే నాక్రోధతాపము చల్లారినది. శాంతాత్ముఁడనైతి"నని పలికి వెంటనే యటనుండి మహేంద్రగిరికి వెడలిపోయెను.

అంతదశరథుఁడు క్షత్రియాంతకుఁడగు పరశురాముని శాంతాత్మునిగాఁజేసి మందహాసముతో నిలచియున్న నిజనందనుని గాఢముగా నాలింగనమొనర్చి దీవించెను. శ్రీరాముఁడు వసిష్ఠాదులకు నమస్కరించి వారిదీవనలనందికొని సీతకడకేగ ఆసతీమణి భర్తకునమస్కరించి "ప్రాణేశ్వరా! మీరు నన్నువిడచి యాపరశురాముని కెదురేగునపుడు నాకమితమగు భయముకలిగినది.

శ్రీరాముఁడు:—జనకనందినీ. నీయట్టిక్షత్రియాంగనలకట్టి భయముతగునా? ఉత్తమక్షత్రియకుమారుఁడు సమరాహ్వానమునువిని యూరకుండునా?

సీత:—శూరాగ్రణీ! నాభీతికిఁగారణము క్షత్రియవీరకుమారుల మర్యాదలు తెలియకకాదు. మరేమన ఆభార్గవుఁడు మీజనకుల నిర్లక్ష్యముచేయుటచే మీరుక్రోధావేశపరవశులై పాపమా వృద్ధబ్రాహ్మణుని సంహరింతురేమోయని.

శ్రీరాముఁడు:—సుభాషిణీ! క్షమాతనూజాతయగు సీతయొక్క కరమును బట్టినవానికంతటి కోపమెట్లువచ్చుననుకొంటివి? గవికులకుమా

రులు భూసురవీరుల నెట్లుశాంతులనుగాఁ జేయవలయునో తెలియని
వారుకారు. నీకాసంగతి తెలిసియుండినచో నీవింతటిభయమందియుండవు.

సీత:—వీరావతంసా! సాగరక్షారోదకమున నమృతమిమిడియున్న
ట్లు సాగరకుమారవీర్యములో నోర్పుచేరియున్నది. సందియము లేదు.
కావుననే సమరసారంభము సంబరముగా మారినది. ప్రాణేశా! గుణము
లాచరణముచేతగదా? తెలియనగును. అందువలన మూఁడట్లుతలంచితిని.

అని ఆసీతామధురాలాపములకు శ్రీరాముఁడత్యంతానంద మందెను.

## త్రింశత్యధ్యాయము.

### —♦ నూతన వధూగృహప్రవేశము ♦—

సాకేతవాసులగు స్త్రీపురుషాదులెల్లరును తమసార్వభౌముఁడగు
దశరథుండు నూత్నవధూవరులఁ దోడ్కొని వచ్చుచున్నవాఁడను. సు
వార్త తెలిసినతోడనే నిజనగరమును వైకుంఠనగరమట్లు సుందరముగా
నలంకరించి వారిరాకకై యెదురుచూచుచుండిరి.

అంతదశరథుండు మంగళవాద్యనాదములు చెలరేఁగుచుండ మహో
త్సవముతో సాకేతనగరద్వారము కడకు రాఁగానే సౌభాగ్యవతులగు
పురంధ్రీమణులు నూతనవధూవరులకు వసంతకలశములను, సువర్ణాక్షత
లను, దిగనుడిచిరి పిమ్మటఁ బచ్చకప్పురపు నివాళులనొసంగిరి. ఆలాం
ఛనములైన వెంటనే కోసలక్ష్మాపాలుఁడు వధూవరులఁ బట్టపుటేనుగుల
పై బంగారునంబారీలలోఁ గూర్చుండఁబెట్టి సకలజనపరివృతుఁడై రాజ
వీధినూరేఁగుచు రాఁదొడంగెను.

అపుడు పౌరకాంతలెల్లరు సౌధాళిందములలో వరుసలుదీఁనిలచి
వధూవరులపై కుసుమములను, లాజలను, ముత్తెములను, నక్షతలను
సంతోషముతోఁ జల్లఁదొడంగిరి. అట్లాపురకాంతలు చూపుచున్న గౌర
వానందకృత్యములఁ దిలకించుచు శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు
తమభార్యలతో నూరేఁగుచుండ సాకేతపురజనులా వధూమణులఁగాంచి
"మనదశరథరాజేంద్రుని మందిరములకుఁ గ్రొత్తగానలుగురు లక్ష్మీకాం
తలు వచ్చియున్నారని పలుకఁజొచ్చిరి. కోసలక్ష్మాపాలుఁడు నూతన
వధూగృహప్రవేశమును మహావైభవముగా సాగించి గురుబంధుమిత్రు

దుల నత్కారరీతిని సన్మానించి కైకేయీసోదరుఁడగు యుధాజిత్తునకును సీతాసహోదరుఁడగు నానందునకును మహారాజసన్మానములఁ జేసి గారవించెను.

ఇట్లాయుత్సవము పదునారుదినములవఱకు నొక్కరీతిని నడచెను అటుపిమ్మట శ్రీరామచంద్రుఁడు తమకుఁగావలసిన సకలసౌకర్యములఁ దమతల్లులు సమకూర్చుచుండఁ దమకెట్టిభారము లేకుండ స్వసౌఖ్యముల నిజజనకుఁడు కనుగొనుచుండ అమందానందముతో విదేహకన్యయగు సీతతోఁగూడి పద్మాలయతోఁగూడిన పుండరీకాక్షునివగిది వివిధములగు భోగములననుభవించుచు తమవిలాసములఁగనుగొని సోదరులును పురజనులును సంతసింప సాకేతమున దమ్ములతోఁగలిసి నానందముగాఁ విహరింపఁదొడంగెను.

భరతాదిసోదరులును శ్రీరామునిమాటలకడుగుదాటక సదావిధేయులగు భృత్యులకైవడి నడువఁదొడంగిరి. సీతాదులగు క్రొత్తకోడండ్రు నిజభర్తలకును, అత్తమామలకును అనువర్తనులై ఘనమర్యాదలచే బంధుబృందముల సంతసింపజేయుచు, నత్తవారింట గాపురములఁ జేయుచుండిరి.

శ్రీరాముఁడు కేవల విషయభోగలోలుపుఁడుకాక, సోదరులతోఁ గూడి ప్రజాక్షేమముల నరయుచుఁ గోసలవాసులకపేక్షితములగు మనోరథములఁ గనిపెట్టి, వానిని దశరథసార్వభౌమునకుఁ దెలియఁజేసి, జనకునియంగీకారముపై నలయుసౌకర్యముల సమకూర్చుచు, పండితులతో గలసి ధర్మనిర్ణయములఁగూర్చిచర్చించుచుఁ గవివరులనాదరించి సత్కావ్యనిర్మాణములకుఁ బ్రోత్సహింపుచు, సేనానాయకులతో వీరశాంతరసములగూర్చి ముచ్చటించుచు పాఠశాలలకేగి విద్యార్థులఁ బరీక్షించి బహుమతులనొసంగుచు. సభలగావించి ప్రజాసమూహములకు సోదరభావములగూర్చి బోధించుచు పరసుఖసంపాదనపరుఁడై కోసలదేశమునకుఁ గ్రొత్తకాంతిని సమకూర్పఁదొడంగెను.

సీతయు శ్రీరామునకు ప్రోత్సాహజనకములగు ప్రసంగముల చేయుచు తననాథుడొనర్చు ధర్మకార్యములయందు సహధర్మచారిణియై

మెలఁగుచుండెను ఆదంపతులకు శరీరభేదముతక్క వేఱెట్టిభావభేదమును కానరాకుండెను శ్రీరామునిహృదయములో సీతయు, సీతాహృదయమున శ్రీరాముఁడును అద్దములయందుఁ బ్రతిబింబములవలెఁ బ్రత్యక్షమగుచుండుటేకాని కానరామికానరాదు.

ఆమిథిలారాజన్యకన్యకలు కాపురమునకు వచ్చినతోడనే దశరథ గృహలక్ష్మి క్రొత్తవిన్నాణముతో ప్రకాశింపఁదొడంగెను. దశరథనృపాలుఁడాకోడండ్రను ఆపుత్త్రులనుగాంచి తనయంతటి భాగ్యశాలురీధరణీతలమున లేరనిగర్వింపఁజొచ్చెను.

ఇటులమహదానందముగా వైవాహికోత్సవములు ముగిసినతోడనే యుధాజిత్తు దశరథుని భరతునిదనవెంటఁ గేకయదేశమునకు దీసికొని వెళ్ళుటకనుమతింపఁగోరెను. అంతఁబుత్త్రకప్రాణుఁడగు నాతఁడు కొంత వఱకు మారుపలుకక యెట్టకేలకు స్వాంతము శాంతముచేసికొని భరతుని, మేనమామతోఁ దాతగారింటికి బంపుటకనుమతించి, భరతునిఁ బిలిపించి యిట్లుబోధించెను.

దశర:—భరతకుమారా! నీమాతామహులగు నశ్వపతిమహారాజేంద్రులు నినుఁజూడఁగోరుచున్నవారలు. నీమేనమామ నిన్నుఁ దోడ్కొనివెళ్ళుటకు వచ్చియున్నవాఁడు కావున నీవచటికేగి, కొన్నివారములుండి వెంటనేరావలయును నిన్నెడబాసి నేయుండఁజాలను. పోయిరమ్ము.

భరతుఁడు:—దయానిధీ! మీసెలవుప్రకారముచేతును. కాని శత్రుఘ్నునిగూడ నాతోఁబంపవలయును. నేనాతనివిడచి యుండఁ జాలను.

దశర:—కుమారా! మీసౌభ్రాత్రమును నేనెరుంగుదు. నీకు శత్రుఘ్నుఁడును నీయన్న శ్రీరామునకు లక్ష్మణుఁడును తోడుండినగాని యెట్టిపనియుసాగనేరదు. కావున నీతోనీతమ్ముని దీసికొనివెళ్ళుము. అన భరతుఁడు తండ్రిసెలవుగైకొని తిన్నగాఁ గౌసల్యామందిరమునకేగి యటదమతల్లులు ముగ్గురును గలసియుండుటను దెలిసికొని లోనికేగి ముందుఁగౌసల్యకు వందనమొనర్చెను. అంతఁగౌసల్య భరతుని బుత్త్రి

చరితుఁడవు కమ్మనిదివిర్చి తనరొద్దగూర్చుండఁబెట్టుకొని యిట్లు ప్రశ్నించెను.

కౌసల్య:—నాయన్నా! నీవు మీతాతగారింటికేగుదువని యిప్పుడువింటిని నిజమేనా?

భరతుఁడు:—అమ్మా! కౌసల్యాదేవీ! నిజమే మీకువందనము నర్పి సెలవుగైకొనుటకే వచ్చియుంటిని.

కౌసల్య:—సత్యరతా! భరతా! యథార్థముగఁ దెలుపుచున్న దానను, నీవునాకు రామునికన్న గారాబుబిడ్డఁడవు. నిన్నువిడచి యుండుటకష్టమే కానినాసోదరుఁడు యుధాజిత్తునకు భారముకలుగునని తలంచి నీపోకనంగీకరించుచున్న దానను.

భరతుఁడు:—అమ్మా! పట్టమహిషీ! తమకు నాయందెక్కుడు వాత్సల్యముండుట నేనెఱుంగుదును మీయట్టిదయామయులగు మాతల విడచి యుండుటకు నాకును ఇష్టము లేదు. కానిమీరనినయట్లు మామయ్యగారికిఁ గోపమువచ్చునని యే నేనును ప్రయాణమునంగీకరించితిని. అనిసుమిత్రకు మ్రొక్కి యిట్లుపలికెను.

భరతుఁడు:—అమ్మా! సుమిత్రాదేవీ! నావిన్నపమొకటికలదు. వినుడు నాతమ్ముఁడు శత్రుఘ్నుని నాతోఁగొంపోవ ననుగ్రహింపుడు.

సుమిత్ర:—చిరంజీవీ! అందులకింతప్రయత్నమేల? నీవెవరినైన నెడబాసియుందువుకాని శత్రుఘ్నునివీడి యుండనేర విదిలోకవిదితము.

భరతుఁడు:—అమ్మా! మేమిరువురమెంతయభేదముగానున్నను నాతమ్ముని దూరముగాఁ గొంపోవునపుడు మీతో మనవిచేయవలదా!

సుమిత్ర:—సోదరీ! కైకేయీ! కంటివా ? నీగర్భశుక్తిముక్తాఫలవినయవిలాసమును

కైకేయి:—తలవంచి చిరునగవుతో అక్కలారా! యీమర్యాదలన్నియు మీగుణకలాపినవియేకదా?

భరతుఁడు:—తల్లికివమస్కరించి "అమ్మా! శత్రుఘ్నుతోఁ దాతగారినిసందర్శించి, వచ్చుటకనుమతింపుమున అకేకయాత్మజ బిడ్డా! మమ్ము సెలవడుగబనిలేదు. మాయక్కకౌసల్య సెలవుగైకొన్నచాలును.

కౌసల్య:—భరతకుమారా! మీయిరువురిభార్యలను మాయొద్దనే యుంచికొందుము. మీకుమమ్ముమఱచినను మీయర్ధాంగులందుంచిన్యైన వేగముగావత్తురు

భరతుఁడు:—అమ్మా! యిట్టంటికేల! గర్భవతులైనది మొదలు నేటివఱకొక్కరీతిని శ్రీమించిపెంచిన తల్లులు మఱపునకువచ్చునెడ నిన్న మొన్నవచ్చిన ముగ్ధలు తలుపునకు వచ్చుటయెట్లు? అమ్మా! వారిని మీకు నుపచారములఁజేయ మీకడనేయుంచిపోయెదము. అని వారి యొద్దసెలవుగైకొని శత్రుఘ్నుతోఁగలసి శ్రీరామునిమందిరమునకేగెను శ్రీరాముఁడు భరతశత్రుఘ్నులఁ జూచినతోడనే యెదురేగి కౌగలించుకొని లోనికిఁదోడ్కొనివచ్చి యాసనములనొసంగి యిట్లుప్రశ్నించెను.

శ్రీరాముఁడు:—తమ్ముడా! భరతుఁడా! చిన్నతమ్ముఁడు శత్రుఘ్నునితో రాజగృహమునకేగుదువటకా? సోదరులారా! మిమ్మువిడిచి యుండుట ఖేదావహమైనను పెద్దలయాజ్ఞ యగుటచే మాఱుమాటాడ వీలుకాదు. అందుపితృవాక్యపరిపాలనము రఘువంశజులకు ముఖ్యకర్తవ్యము.

భరతుఁడు:—అన్నా! శ్రీరామచంద్రా! మనతండ్రిగారి యాజ్ఞ యగుటనే యనుజవత్సలురగు మిమ్మొడబాసి, వెళ్ళవలసివచ్చినది. కావున నఁబోయివత్తుమాజ్ఞనొసంగుడు. అని శత్రుఘ్నునితో శ్రీరామునకు నమస్కరించి పక్కనిలచియున్న లక్ష్మణునితోఁ బోయివచ్చెదమని తెలిపి వెడలిపోయెను.

ఓం తత్సత్

కల్యాణకాండము సంపూర్ణము.

శ్రీరామార్పణమస్తు.

